# బ్రహ్మసూత్రములు

నరహరి రంగయ్యశెట్టిచే రచింపబడిన

అర్థతాత్పర్యములు

(ద్వితీయభాగము)

Edited by

P T G Rangaramanujacharyulu

హరిప్రియా ప్రకాశనము

తిరుపతి

2000

ఆంధ్రటీకాసహిత
బ్రహ్మసూత్రములు
(పరహరి రంగయ్య శెట్టిచే వేదాంతదీపగ్రంథాధారముగ
రచింపబడిన అర్థతాత్పర్యములు)
1000 ప్రతులు
మూల్యము --రూ 50

This book is published with the financial aid of Tirumala Tirupati Devasthanams, Tirupati under their scheme "Aid to the Authors"

హరిప్రియా ప్రకాశనము
తిరుపతి
2001

శ్రీమతే రామానుజాయ నమః

# బ్రహ్మసూత్రములు

## తృతీయాధ్యాయము - ప్రథమపాదము

**69 తదంతరప్రతిపత్త్యధికరణము (3-1-1)**

**288 తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్ (3-1-1)**

**అర్థము** - తదంతర - దేహాంతరముయొక్క, ప్రతిపత్తౌ - ప్రాప్తికాలమందు, సంపరిష్వక్తః - ఇంద్రియములతో గూడినవాడై, రంహతి - పోవుచున్నాడు ప్రశ్ననిరూపణాభ్యాం - ప్రశ్నప్రతి వచనములచేత తెలియబడును జీవుడు దేహాంతరమును పొందేకాలమందు దేహమునకు కారణమైన భూతసూక్ష్మములతో కూడినవాడైపోవునా లేదా యని సంశయము దేహాంతరమునకు అచ్చటచ్చట భూతసూక్ష్మములు సులభత్వములగుటవలన

**సిద్ధాంతము** - పంచాగ్నివిద్యయందు "వేత్థ యథా పంచమ్యామాహుతావాప పురుషవచసో భవంతి" అని ప్రశ్నప్రతివచనమందు చెప్పబడుచున్నది దేహారంభకమైన ఉదకము త్రివృత్కరణముచేత భూతాంతరసంసృష్టములై స్వర్గలోకపర్జన్యభూమిపురుషరూపాగ్నులయందు జీవునితో ప్రవేశించినవై పంచమియైన ఆహుతియందు యోషిదగ్నిప్రవేశకాలమందు పురుష శబ్దముచే చెప్పుటకు అర్హములౌచున్నవని ప్రసిద్ధము పురుషాకారత్వమును పొందుచున్నదని తాత్పర్యముగనుక భూతసూక్ష్మములచే కూడినవాడగుచున్నాడు

**సూత్రార్థము** - [తదనంతరప్రతిపత్తౌ] సంజ్ఞామూర్తిక్లుప్తి అనుచోట మూర్తి శబ్దముచే దేహము ప్రసక్తము, తచ్ఛబ్దముచేత దేహము పరామర్శ చేయబడు చున్నది దేహాంతరప్రాప్తికాలమందు, [రంహతి పరిష్వక్తః] జీవుడు భూతసూక్ష్మములతోగూడినవాడగును ఎట్లన్న [ప్రశ్ననిరూపణా భ్యామ్]

పంచాగ్నివిద్యాంతర్గతప్రశ్నప్రతివచనములచే తెలియబడుచున్నాదని యర్థము ఏ ప్రకారము విశేషరహితమైన అప్శబ్దముచే సమస్తము చెప్ప డమని ఆశంకచేసి చెప్పుచున్నాడు

289 త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ (3-1-2)

అర్థము - త్ర్యాత్మకత్వాత్తు - త్రివృత్కరణరూపమందైతే, భూయస్త్వాత్ - అధికోపదేశమువలన తుశబ్దము శంకానివృత్త్యర్థము ఉదకములకు త్రివృత్కరణముచేత మూడింటితో గూడియుండుటవలన ఆప యని భూతాంతరసంస్పృష్టమైన ఉదకముచెప్పబడు చున్నది ఉదకభాగము భూయస్త్వాత్ అతిశయించి యుండుటవల్ల ఆపచ్ఛబ్దముచే పేర్కొన బడును

290 ప్రాణగతేశ్చ (3-1-3)

అర్థము - ప్రాణగతేశ్చ - ప్రాణగతివలన ఇచ్చటగూడ భూతసూక్ష్మ ములతో గూడినవాదయ్యెను "తముత్క్రామంతం ప్రాణోనూ త్క్రామతి ప్రాణమనుత్క్రామంతం సర్వే ప్రాణా అనుత్క్రామంత" అని ప్రాణము లకు ఇంద్రియములకు జీవునితో సహగమనమువినబడుటచే ఇంద్రియము లకు దేహాశ్రయత్వముండుటచే ఆ దేహమున్ను భూతసూక్ష్మరూపముచే పోవుచున్నదని తెలియ బడుచున్నది స్మృతియు "మనష్షష్ఠానీంద్రి యాణి ప్రకృతిస్థాని కర్షతి" ఇత్యాదులచే విశదమగును

291 అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న, భాక్తత్వాత్ (3-1-4)

అర్థము - అగ్న్యాది - అగ్న్యాదులకు, గతి - గమనముయొక్క, శ్రుతే - శ్రుతివలన, ఇతిచేన్న - ఇటులగూడదు, భాక్తత్వాత్ - దాని యందభిమానముగల దేవతావాచిత్వమువలన "యత్రాస్య పురుషస్య

మృతస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణశ్చక్షురాదిత్యమ్" అని మరణవేళ యందు వాగాదులకు అగ్న్యాదులయందులయము వినబడుటవలన జీవుని తో సహగమనము చెప్పెడిశ్రుతి మరియొక ప్రకారము బోధించుచున్నదని చెప్పగూడదు [భాక్తత్వాత్] అచ్చట వాగాదిశబ్దమునకు వాగాద్యభిమానిదేవతావిషయమువలన అచ్చట వాగాదులకు "ఓషధీర్లోమాని వనస్పతీన్కేశా అని వానితోగుడ సహపాఠముండుటవలన

292 ప్రథమేఽశ్రవణాదితి చేన్న తా ఏవహ్యుపపత్తేః (3-1-5)

అర్థము - ప్రథమే - మొదట, అశ్రవణాత్ - వినబడకపోవుటవలన, ఇతి చేన్న - అనకూడదు, ఉపపత్తేః - ప్రశ్నోత్తరములకు ఉపపత్తివలన తా ఏవ - అవే శ్రద్ధాశబ్దముచేత చెప్పబడును ప్రథమే - ద్యులోకాగ్నిహోమమందు ఉదకమునకు శ్రవణములేకపోవుటవలన ఆ ఉదకములు భూతాంతరసంసృష్టములైపోవుచున్నవని చెప్పడమునకు శక్యముకాదు అచ్చట "తస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి" అని శ్రద్ధయే హోమముచేయుటక్షముగా వినబడుచున్నదని చెప్పగూడదు ఆ ఉదకము శ్రద్ధాశబ్దము చేత చెప్పబడుచున్నది ఉత్తరమునకు ప్రశ్నానుగుణముసంభవించుటచే "వేత్థ యథా పంచమ్యామాహుతావాప పురుష వచసో భవంతి" అని ఉదకములతోగూడిన పురుషవిషయముమగూర్చి అడిగేప్రశ్నకు ఆ విషయకమైన ప్రత్యుత్తరము చెప్పతగినది కావున శ్రద్ధాశబ్దముచే ఆఉదకముతో గూడిన పురుషుని చెప్పుచున్నది "శ్రద్ధా వా ఆప " అని శ్రుతి గలదు

293 అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః (3-1-6)

అర్థము - అశ్రుతత్వాత్ - వినబడకపోవుటవలన, ఇతి చేన్న - అటులనగూడదు, ఇష్టాది కారిణాం - జీవులకు, ప్రతీతేః - ప్రసిద్ధివలన "ఆప పురుషవచసో భవంతి", "శ్రద్ధాం జుహ్వతి" అని అంతరిక్షాదులందు ఉదక

ములే పోవుచున్నవని వినబడుచున్నది వానితో పరిష్వక్తుడై జీవుడును పోవడమనేది లేదు ఆ కారణమువలన ప్రశ్నోత్తరములయందు జీవునికి ఉనికిలేకపోవుటవలన ఉదకములతో పరిష్వక్తుడై జీవుడుపోవుచున్నాడని చెప్పుట యుక్తముగాదని చెప్పినట్లైతే అట్లా చెప్పరాదు [ఇష్టాదికారిణాం ప్రతీతే ] ముందర "అథ య ఇమే గ్రామ ఇష్టా పూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమమభిసంభవంతి" ఇత్యాదులందు జీవులకు స్వర్గలోకాది గమనము పునరావృత్తిప్రకారవచనమందు ద్యులోకాగ్నిసంబంధమై చంద్రుని పొందిన అప్పుల్లవాచ్యానికి ప్రతీతియుండుటవలన ఇచ్చుట అప్పుల్లము చేత వానితోగూడిన జీవుడేచెప్పబడుచున్నాడు "ఆకాశాచ్చంద్రమస ఏష సోమో రాజా దేవానామన్నం తం దేవా భక్షయంతి" అని ధూమాది మార్గ ముచేత పోయినవానికి దేవతలచే భక్షణము వినబడుటవలన జీవునికి భక్ష ణానర్థముచే జీవుడచ్చట చెప్పబడినవాడు కాదనే శంకకుత్తరము చెప్పు చున్నారు

294 భాక్తం వా నాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి (3-1-7)

అర్థము - అనాత్మవిత్త్వాత్ - బ్రహ్మవేతృత్త్వము లేకపోవుటవలన, భాక్తం వా - భక్ష్యత్వ వచనమువలన దేవభృత్త్యభావముగా, తథా ఆ ప్రకారము, దర్శయతి - శ్రుతి చెప్పును వాశబ్దము శంకా నివృత్త్య ర్థము "తం దేవా భక్షయంతి" అని భక్ష్యత్వవచనము పొందడమని అర్థము కేవల ఇష్టాదికారులైన జీవులకు బ్రహ్మ వేతృత్వము లేకపోవు టచేత దేవతలకు ఉపకారము అగుననెడు అభిప్రాయము గల్గిన ఆత్మవే త్తలు కానివారు కేవలఇంద్రాదిదేవతలను పూజించి దేవతలను పొందినవా రికి ఉపకరణములౌచున్నారు ఈ అర్థమునే శ్రుతి చెప్పుచున్నది "యథా పశురేవం స దేవానామ్" అని భూతసూక్ష్మములచే గూడినవారై జీవులుపోవుచున్నారు

**అధికరణ సంగ్రహము** - జీవుడు సుకృతకర్మఫలానుభవార్థం దేహాద్దేహాంతరప్రవేశము చేయుతరి ఆ స్థలమందున దేహారంభకభూతసూక్ష్మములు లభించుటచే పూర్వదేహస్థభూత సూక్ష్మసంపరిష్వక్తుడైపోవలసిపది లేదని శంకించి పంచాగ్నివిద్యోక్తప్రక్రియవలన పూర్వదేహస్థభూత సూక్ష్మ సంపరిష్వక్తుడై దేహాద్దేహాంతరప్రవేశము చేయుచున్నాడని నిర్ణయింపబడినది ఈ యధికరణమున కాదాచిత్కముగనైనను భూతసూక్ష్మసంపరిష్వంగం లేకనే విర్ముక్తుడైయుండుటకు అవకాశము లేదని వైరాగ్యజననార్థము యావన్మోక్షం ప్రకృతి సంబంధమవర్జనీయమైనదని విస్పష్టమైనది "కిం చ భాక్తం వా నాత్మవిత్వాత్" అను సూత్రంలో దేవభృత్యభావమునవలంబించి తత్ప్రాయుక్త క్లేశకరంభితమైయుండు స్వర్గభోగానుభవముయొక్క క్షయిష్ణుత్వము, సాతిశయమునూ విస్పృతము

**70 కృతాత్యయాధికరణము (3-1-2)**

**295 కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేనం చ (3-1-8)**

**అర్థము** - కృత - పుణ్యముయొక్క, అత్యయే - అంత్యమందు, అనుశయవాన్ - కర్మశేషముగలవాడై వెనుకకు తిరుగును, దృష్టస్మృతిభ్యామ్ - శ్రుతిస్మృతులుండుటవలన, యథేతమనేనంచ - పోయిన మార్గముచేతను, మరియొకదోవగూండావచ్చును ధూమాదిమార్గ గతుడైవెనుకకుతిరిగినజీవుడు కర్మశేషముగలవాడైనివర్తించునా కాదాయనిసంశయము కాదని పూర్వపక్షము "యావత్సంపాతముషిత్వా", "ప్రాప్యాంతం కర్మణా" ఇత్యాది శ్రుతులచేత సమస్తమైనకర్మయొక్క అనుభవముగా ప్రతీతియుండుటవలన కర్మశేషముగలవాడై వెనకకు తిరగడు

**సిద్ధాంతము** - "తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహ యత్తేరమణీయాన్ యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనింక్షత్రియయోనిం వైశ్యయోనింవా అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహ యత్తేకపూయాం యోని

సూపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా" అని రమణీయ్యకర్మగలవారు బ్రాహ్మణయోనియు, కపూయచరణా - కుత్సితకర్మగలవారు సూకరాదియోనియు పొందుతారనియు శ్రుతియుండుటవలన "ప్రాప్యాంతం కర్మణ" అనుశ్రుతి ఫలదానమందు ప్రవర్తించినకర్మవిషయమని కర్మావశేషముచే వెనుకకు తిరుగును

సూత్రార్థము - [కృతాత్యయే] కృతస్య - చేయబడినపూర్వకర్మనాశమందు, అనుశయ - అనుభవించి మిగిలినకర్మ అదిగలవారై వెనుకకు తిరుగును ఎట్లన్న దృష్టస్మృతిభ్యామ్ - శ్రుతిస్మృతులచే తెలియబడుచున్నది "తద్య ఇహ రమణీయచరణా" ఇత్యాదిశ్రుతులు "తత పరివృత్తా కర్మఫలశేషేణ జాతింరూపం" ఇత్యాదిస్మృతులు [యథేతమనేవంచ] ఆరోహణ ప్రకారముచే మరియొకరీతిచేతను వెనుకకుతిరుగుచున్నారు "చంద్రమసస్థావాదాకాశమ్" అని ఆరోహక్రమముచేత అవరోహణముచేయును, వాయుధూమాభ్రాదులప్రకారాంతముచేత వెనుకకు తిరుగుచుందురు

296 చరణాదితిచేన్న తదుపలక్షణార్థేతికార్ష్ణాజిని (3-1-9)

అర్థము - చరణాత్ - చరణశబ్దమువలన పుణ్యపాపరూపకర్మలు, ఇతి చేన్న - అనియనరాదు, తదుపలక్షణార్థేతి - చరణశ్రుతికర్మకు ఉపలక్షణమని, కార్ష్ణాజిని - కార్ష్ణజిన్యాచార్యులు తెలియుదురు "రమణీయ్య చరణా' అనిస్మృతియందు చెప్పబడినరమణీయాచారమునకు బ్రాహ్మణ్యాదిప్రాప్తిసాధనత్వశ్రవణము..వ కర్మసహితుడైవెనుకకుతిరుగునని చెప్పగూడదని యున్నట్లైతే అట్లుచెప్పరాదు చరణశ్రుతికర్మోపలక్షణార్థమని కార్ష్ణాజనాచార్యులుతెలియుదురు పుణ్యకర్మకే సుఖప్రాప్తియందు కారణత్వముండుటవలన

**297 అనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్ (3-1-10)**

**అర్థము** - తదపేక్షత్వాత్ - ఆచారాపేక్షవలన, అనర్థక్యమితిచేన్న - వ్యర్థత్వమనిచెప్పగూడదు స్మృతివిహితమైన ఆచారమునకు అకించిత్కరత్వముగా వ్యర్థత్వముప్రసక్తమౌనని అంటే అట్లు చెప్పరాదు తదపేక్షత్వాత్ - ఆచారాపేక్షయందును సుఖసాధనభూతమైన పుణ్యకర్మకు "సన్ధ్యాహీనోశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు" అని సర్వములకు పుణ్యకర్మాచారాపేక్షయేయని కార్ష్ణాజినుల మతము

**298 సుకృతదుష్కృత ఏవేతి తు బాదరి (3-1-11)**

**అర్థము** - సుకృతదుష్కృత ఏవేతి తు - పుణ్యపాపరూపకర్మలు చెప్పబడునని, బాదరి - బాదరాచార్యులు తెలియుదురు తు శబ్దము పూర్వమతమును వ్యావృత్తి చేయుచున్నది "రమణీయ్య చరణా", "కపూయచరణా" యనిచరణశబ్దముచే సుకృదుష్కృత కర్మలే ప్రతి పాదించుచున్నవి పుణ్యకర్మాచరణీయని పుణ్యకర్మధాతువుకు కర్మయందే ప్రసిద్ధ ముండుటచే లక్షణయోగ్యముకాదని బాదరాచార్యులు తెలియుదురు ఇదే సూత్రకారులకు ఇష్టము తుశబ్దం చేత పూర్వమతమునకంటే వ్యావృత్తి యుండుటవలన సుకృతదుష్కృములేయని వ్యావర్తనమువలన "ఆనర్థక్యమ్" అనిచెప్పకూడదు ఆచారాపేక్షత్వముండుటవలనయని స్వీకరింపబడినది

**అధికరణసంగ్రహము** - స్వర్గానుభవానంతరం జీవుడైనవాడు కృత్స్నకర్మఫలమును భుక్తము అయినందువలన కర్మసంబంధరహితుడై దిగుచున్నాడనిశంకించి రమణీయచరణులు రమణీయ యోనులనుపొందుచున్నారు కపూయచరణులు కుత్సితయోనులను పొందుచున్నారు అనిశ్రుతి చెప్పుటచే కర్మసంబంధముగలవాడయ్యేదిగుచున్నాడని నిర్ణయింపబడినది దీనిచే సూక్ష్మ దేహమునకు కారణతయా సకలసంసారనిదానకర్మసంబం

ఁము ముక్తిపర్యంతము అనువృత్తమై యున్నదనిసంసారదోషము చెప్పబ మైనది

**71 అనిష్టాదికార్యధికరణము (3-1-3)**

**299 అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్ (3-1-12)**

అర్థము - అనిష్టాదికారిణామపి - పాపకర్ములకును, శ్రుతం - చంద్రగమనమువినబడుచున్నది అవిహితకర్మగలవారు నిషిద్ధసేవయందాసక్తులు పాపకర్ములుగలవారు ధూమాదిమార్గంచేత చంద్రునిబొంది వెనుకకుతిరుగుదురాలేదాయని సంశయము పొందివెనుకకుతిరుగుదురని పూర్వపక్షము "యేవైకేచాస్మాల్లోకాత్ప్రయంతి సర్వే గచ్ఛంతి" యనిసమస్తులకువిశేషములేక కనే చంద్రప్రాప్తిచెప్పుటవలన

సిద్ధాంతము - "అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తేదత్తమిత్యుపాసతే తే ధూమమభిసంభవంతి" యనిధూమమార్గంచేత చంద్రగమనమునకు పుణ్యకర్మఫలత్వం చెప్పుటవలనపుణ్యరహితులు పాపకర్ములుగలవారు పొందేదిలేదు "యేవైకేచ" అనేటివచనముసమస్తపుణ్యకర్మగలవారికి చంద్రగమనముచెప్పుచున్నది

సూత్రార్థము - [అనిష్టాదికారిణామపిచ శ్రుతం] ఇష్టాపూర్తాదికర్ములుచేయువారికి పాపిష్ఠులకు చంద్రగమనముకలదు "యేవైకేచాస్మాల్లోకాత్ప్రయంతి" అని అవిశేషముచేతశ్రుతియుండుట వలన ఇట్లుచెప్పినపక్షమందు పుణ్యపాపములుచేసినవారికి విశేషములేనిగతికానియనగా ఆ ప్రకారముకాదనిచెప్పుచున్నారు

**300 సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్ (3-1-13)**

అర్థము - ఇతరేషాం - పాపిష్ఠులకు సంయమనే - యమశాసన మందు, అనుభూయ - యాతననుయమభవించి ఆరోహావరోహా ఆరోహావరోహములు తద్గతిదర్శనాత్ - యమ ప్రాప్తివినబడుటవలన తుళబ్దముశంకనువ్యావర్తిచేయుచున్నది ఇతరేషాం - అనిష్టాదికారులకు చంద్రునియొక్క ఆరోహావరోహములు, సంయమనే - యమశాసన మందు, యాతనాది - దుఃఖమును, అనుభూయైవ - అనుభవించే, ఎల్లన్ను తద్గతిదర్శనాత్ - పాపిష్ఠులకు యమసదనప్రాప్తి వినబడుటచే "వైవస్వతం సంగమనంజనానామ్"ఇత్యాదులయందుసిద్ధము

301 స్మరంతి చ (3-1-14)

అర్థము - స్మరంతి చ - స్మృతులచేతను తెలియబడుటవలన ఇదే యర్థము "సర్వే హ్యైతే వశం యాంతియమస్యభగవన్కిల" ఇత్యాదులలో పరా శరాదులుస్మరించుదురు

302 అపి సప్త (3-1-15)

అర్థము - అపిసప్త - సప్తనరకములు సప్తాపి - పాపకర్మగలవారికి పొందుటకు యోగ్యముగా సప్తరౌరవనరకాదులను స్మరించుచున్నారు ఓయీ సప్తనరకాదులందు పోయేవారికి ఏ ప్రకారముయమపురిప్రాప్తియు నగా చెప్పుచున్నారు

303 తత్రాపి తద్వ్యాపారాదవిరోధ (3-1-16)

అర్థము - తత్రాపి - ఆనరకములందును, తద్వ్యాపారాత్ - యమ వ్యాపారమువలన, అవిరోధ - విరోధములేదు ఐనచో రౌరవాదినరకలోక ములందును, తద్వ్యాపారాత్ - యమునియాజ్ఞచేతపోవుటవంన విరోధ ములేదు కావునఅనిష్టకర్మచేసినవారికిని యమలోకం పొంది యాతనను

యనుభవించిన అనంతరం చంద్రారోహావరోహములుయాచున్నవి ఇట్లని పూర్వపక్షమువచ్చినయెడలచెప్పుచున్నారు

### 304 విద్యాకర్మణోరితి తు ప్రకృతిత్వాత్ (3-1-17)

అర్థము - విద్యాకర్మణో - విద్యాకర్మకుఫలమనిచెప్పుటవలన, ఇతి తు - యేప్రకారమనగా ప్రకృతత్వాత్ - ఈ ప్రకారముచెప్పుటవలన తు శబ్దముపక్షమును వ్యావృత్తిచేయుచున్నది పాపకర్మగలవారికి అర్చిరాది మార్గముచేత చంద్రప్రాప్తియు సంభవించదు ఆ విద్యాకర్మకు ఫలమగుట వలన ఏ ప్రకారముదానిఫలముతెలియుచున్నదంటే [ఇతి ప్రకృతత్వాత్] ఈ ప్రకారము ప్రకృతముండుటవలన విద్యాకర్మలకు ప్రకృతముందు వానికి ఫలముగా రెండు గతులనుచెప్పుచున్నది "తద్య ఇత్థం విదుర్యేచే మేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవంతి" అని "అథ యు ఇమే గ్రామఇష్టాపూర్తేదత్తమిత్యుపాసతే తే ధూమమ భిసంభవంతి" అనియు పాపిష్ఠులకు విద్యారహితత్వముచేత బ్రహ్మలోకప్రాప్తిలేనట్లే పుణ్యకర్మ లేనివారికి చంద్రగమనమున్ను సంభవించదనియర్థము "పంచ మ్యామాహుతావాప పురుష వచసో భవంతి" అని పంచమాహుతిచే దేహారంభశ్రవణంవల్ల వారికిచంద్రగమనపూర్వకంగా పాపిష్ఠులకున్ను దేహారంభముకొరకు చంద్రప్రాప్త్యవశ్యంకాదగినదన్నచెప్పుచున్నారు

### 305 న తృతీయే తథోపలబ్ధే (3-1-18)

అర్థము - తృతీయే - తృతీయస్థానమైన స్వర్లోకమందు, న - పంచ మాహుత్యపేక్షలేదు, తదోపలబ్ధే - ఆ ప్రకారము ప్రత్యక్షముండుటవలన కేవలం పాపకర్మగలవారికి తృతీయ స్థానమందు దేహారంభముకొరకు పంచమాహుతియపేక్షలేదు [తథోపలబ్ధే] "వేత్థ యథా సౌ లోకో న సంపూర్యతా ఇతి" ద్యులోకముపొందనివారెవరనెడి ప్రశ్నకు ఉత్తరమైన

"అథైతయోః పథోర్నకతరేణ చ తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానం తే నాసౌలోకో సంపూర్యత" అని తృతీయస్థానమైన స్వర్గలోక అప్రాప్తిశ్రవణమువలన వాని దేహారంభమందు పంచమాహుతియొక్క అపేక్షలేదు

**306 స్మర్యతేపి చ లోకే (3-1-19)**

అర్థము - లోకే - శిష్టలోకమందు, స్మర్యతేపి చ - స్మరింపబడుచున్నది పుణ్యకర్మగల ద్రౌపతిమొదలగు కొందరి దేహారంభమందు పంచ మాహుత్యపేక్షలేదని పెద్దలుచెప్పుదురు

**307 దర్శనాచ్చ (3-1-20)**

అర్థము - దర్శనాచ్చ - శ్రుతియందుకనబడుచున్నది కొందరికి దేహా రంభమందువంచమాహుతి అపేక్ష శ్రుతియందు చూడబడుచున్నది "తేషాంఖల్వేషాం భూతానాం త్రీణ్యేవబీజాని భవంతి అణ్డజంజీవజముద్భి జ్జమ్" అని స్వేదజోద్భిజాలయొక్క దేహారంభమందు పంచమాహుతి అపేక్షలేదు అణ్డజంజీవజముద్భిజమనే స్థలమందు స్వేదజమునకు గ్రహ ణంలేదన్న చెప్పుచున్నారు

**308 తృతీయశబ్దావరోధస్సంశోకజస్య (3-1-21)**

అర్థము - తృతీయశబ్దాత్ - ఉద్భిజ్జశబ్దమువలన, సంశోకజస్య - స్వేదజమునకు, అవరోధ - సంగ్రహము "అండజంజీవజముద్భిజమ్" అనుస్థలమందు మూడవఉద్భిజశబ్దం చేత సంశోకజస్య - స్వేదజము నకు, అవరోధ - సంగ్రహమనియర్థము గాన కేవలపాపకర్మ కలవారికి చంద్రారోహావరోహములు సంభవించవు

అధికరణసంగ్రహము - అనిష్టాదికారకులైన పాపకర్ముకున్ను చంద్రప్రాప్తి యున్నదనిశంకించి ఇష్టాపూర్తాదిసత్కర్మరహితులకు పితృయాణమార్గద్వా

దాగమనములేనందున చంద్రప్రాప్తిలేదని నిర్ణయించబడినది ఇందు "గ్రామంగచ్ఛన్వృక్షమూలాన్యుపసర్పతి" యనే న్యాయంచేతనైనా స్వర్గ ప్రాప్తిలేదు యమసదనమందున్ను, రౌరవాదినరకములందున్ను మిక్కిలి యాతనానుభవం కీటాదిజన్మప్రాప్తిగలదని సంసారదోషమువ్యక్తముగాకీర్త నచేయబడినది

72 తత్స్వాభావ్యాపత్త్యధికరణము (3-1-4)

309 తత్స్వాభావ్యాపత్తిరుపపత్తేః (3-1-22)

అర్థము - తత్స్వాభావ్య - ఆకాశాదిస్వభావమునకు, ఆపత్తి - ప్రాప్తి, ఉపపత్తే - ఉపపత్తివలన ధూమాదిమార్గముచేత చంద్రునిపొందినవారికి అవరోహణప్రకారం చెప్పబడుచున్నది "యథేతమాకాశమాకాశాద్వాయుం వాయుర్భూత్వాధూమోభవతి ధూమో భూత్వాఽభ్రంభవతి అభ్రంభూత్వా మేఘోభవతి మేఘోభూత్వా ప్రవర్షతి" అనియిచ్చట ఆకాశదులభావము దేవమనుష్యాదిభావమువలె ఆకాశాదిశరీరత్వమాలేక దానిసాదృశ్య ప్రాప్తియా యని సంశయము ఆకాశాదిశరీరత్వమని పూర్వపక్షము శ్రద్ధకు సోమరాజభావమువలెఇచ్చట తచ్ఛరీరత్వమే చెప్పబడుచున్నది

సిద్ధాంతము ఆకాశాదిప్రాప్తియందు సుఖదు ఖాదులయనుభవములేకపో వుటవలనవానియొక్క సామ్యప్రాప్తియే సుఖదు ఖానుభవముకొరకుసోమా ది శరీరత్వము

సూత్రార్థము - తత్స్వాభావ్యాపత్తి - ఆకాదివస్తువులసాదృశ్యప్రాప్తి, ఉప పత్తే - సుఖదు ఖాది అనుభవములేకపోవడమునకు ఉపపత్తియగుటవలన

అధికరణ సంగ్రహము - శ్రుతిసిద్ధమైన ఆకాశాదిభావము జీవునికి దేవమ నుష్యాదిభావమువం లేనందున తత్సామ్యాపత్తియేగాక తచ్ఛరీరత్వములే దనినిర్ణయింపబడినది ఇందు స్వర్గావరో - హణంచేయువారికి ఆకాశాది భావశ్రవణముచే తదభిమానిదేవతలవలె ఆకాశాదిశరీరప్రయుక్తమైన

కొన్నిదివ్యభోగములు ఉంటాయనుశంకానివృత్త్యర్థంగా ఆకాశాదిసంశ్లేష మాత్రమేయున్నదని చెప్పుటచేత దోషకీర్తనముస్ఫుటము

**73 నాతిచిరాధికరణము (3-1-5)**

**310 నాతిచిరేణ విశేషాత్ (3-1-23)**

అర్థము - విశేషాత్ - విశేషవచనమువలన, అతిచిరేణ - బహుకాలము, న - జీవునికి నిష్క్రమణములేదు ఆకాశవాయుధూమాభ్రమేఘవర్షప్రాప్తియందు అచ్చటచ్చటబహుదినములు ఉండేదిలేదా లేక నియమములేదయని సంశయము అనియమమని పూర్వపక్షము నాతిచిరేణయని విశేషవచనములేకపోవుటవలన

సిద్ధాంతము - ఉత్తరత్ర వ్రీహ్యాదిభావమందు "అతో వై ఖలు దుర్నిష్ప్రపతరం" అని అచిరేణ గమనవచనముండుటనుబట్టి ప్రాచీనులు అచిరగమనమును సూచించుచున్నారు ఆకాశాది యావద్వ్రీహ్యాదులభావప్రాప్తివరకు అచిరంబుగనుండును

అధికరణ సంగ్రహము - ఆకాశవాయుధూమాభ్రమేఘవర్షప్రాప్తిగల్గినపుడు ఆయా స్థలముల్లో అతిశీఘ్రముగా జీవునికి గమనములేదనేనియమములేదు తద్ధేతువులేనందువయనిశంకించి ఉత్తరత్రవ్రీహ్యాదిప్రాప్తిలో "అతోవైదుర్నిష్ప్రపతరం" అనివిశేషించికృచ్ఛ్రనిష్క్రమణంచెప్పుట వలనఆకాశాదిప్రాప్తిలో అచిరనిష్క్రమణమేయున్నదని నిర్ణయించబడినది దీనియందాకాశాది అవస్థానవిళంబనియమనిరసనవ్యాజేన వ్రీహ్యాదులందుసుఖభోగములేక అచిరావస్థానరూప దోషముద్ధృతమైనది

**74 అన్యాధిష్ఠితాధికరణము (3-1-6)**

**311 అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్ (3-1-24)**

అర్థము - అన్యాధిష్ఠితే - ఇతరజీవునిచేతవుంచబడినదానియందు సంబంధము, పూర్వవత్ - ఆకాశాదిభావమువలెనే, అభిలాపాత్ -

చెప్పుటవలన దిగుచూమండెడుజీవులు వ్రీహ్యాది భావముచేతపుట్టుచు న్నారని వినబడుచున్నది "మేఘో భూత్వా ప్రవర్షతి త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయస్తిలమాషా ఇతి జాయంతే" అని ఆ జీవులువ్రీహ్యాదిశరీరకులైపుట్టుచుందురా లేక అన్యులైన జీవులచేత వ్రీహ్యాదిశరీరములు అధిష్ఠించియుండబడినవ్రీహ్యాదులను ఆలింగనము చేసుకొందురా యని సంశయము "జాయంతే" అనువచనమువలన వ్రీహ్యాదిశరీరం నందు భోక్తలైయుత్పన్నులౌతారని పూర్వపక్షము

సిద్ధాంతము - వ్రీహ్యాదిజన్మమందు హేతువైన కర్మవిశేషంకు వినికిలేక పోవుటచేవ్రీహ్యాదుల సంశ్లేషమాత్రమేయున్నది "జాయంతే" యనిజన్మవచనమౌపచారికము బ్రాహ్మణాదిశరీరభావం నందు "రమణీయ చరణా", "కపూయచరణా" యనిజన్మహేతుభూతములైనపుణ్యపాపరూప కర్మములువినబడుచున్నవి

సూత్రార్థము - అన్యాధిష్ఠితే - అన్యులైనక్షేత్రజ్ఞులచేత అధిష్ఠింపబడినవ్రీహ్యాదులయందు సంశ్లేషము ఎట్లన్న పూర్వమందుచెప్పబడిన ఆకాశాదిభావములవలె వ్రీహ్యాదిభావములు చెప్పబడియున్నవి జన్మహేతువులైన కర్మలను చెప్పకపోవుటవలన యని యర్థము

312 అశుద్ధమితి చేన్న శబ్దాత్ (3-1-25)

అర్థము - అశుద్ధం - పూర్వమందుచెప్పబడినకర్మకారణము, ఇతిచేన్న - అనియనరాదు, శబ్దాత్ - అహింసత్యాదిశబ్దమువలన ఎట్లైనను వ్రీహ్యాదిభావముచేత పుట్టుచున్నారనుచోట జన్మమైనహేతువుకు కర్మవినబడలేదో అట్లే పూర్వముచెప్పబడిన ఇష్టాదులగుఅగ్నిషోమీయాది కర్మాదులు హింసాగర్భమౌటచేత అశుద్ధములు హింసాత్వముచేత అపరిశుద్ధమైన వ్రీహ్యాది జన్మమందును హేతుగర్భముకలదని చెప్పినట్లైతేఅట్లు చెప్పరాదు అహింసశబ్దముండుటచే పశువులయొక్క హింసకు స్వర్గప్రా

ప్తిసాధనభావవాదిశబ్దమువినబడుచున్నది "హిరణ్మశరీర ఊర్ధ్వస్స్వర్గంలో కమేతి న వా ఉ ఏతన్ ప్రియుపేనంపృశ్యతి" ఇత్యాదులు

313 రేతస్సిగ్యోగోఽథ (3-1-26)

అర్థము - అథ - వ్రీహ్యాదిస్వరూపప్రాప్త్యనంతరం, రేతస్సిగ్యోగ - పురుషసంశ్లేషమాత్రం వినబడుచున్నది దీనికంటే వ్రీహ్యాదులయొక్కసంశ్లేషమాత్రమే వ్రీహ్యాదిభావముకంటే అనంతరమందు రేతోరూపయోగంవినబడుచున్నది "యో యోహ్యన్నమత్తి యో యో రేత స్సించతి తద్భూయ ఏవ భవతి" అనియిచ్చటపురుషసంశ్లేషమాత్రమే వినబడుచున్నది ఈ ప్రకారం వ్రీహ్యాదిభావమందును తెలియబడుచున్నది

314 యోనేశ్శరీరమ్ (3-1-27)

అర్థము - యోనే - యోనిప్రాప్తివలన, శరీరమ్ - శరీరసంబంధంవినబడుచున్నది యోని ప్రాప్తికంటే అనంతరమందు దిగుచూనుండెడు జీవునికి శరీరసంబంధముకల్గును అచ్చటనే సుఖ దుఃఖములయొక్క అనుభవముండును కనుక పూర్వమందాకాశాదుల్లో సంశ్లేషమాత్రమే అనియభిప్రాయము

అధికరణ సంగ్రహము - స్వర్గావరోహముచేయుజీవులకు వ్రీహ్యాదిజన్మహేతుభూతకర్మవిశేషం అశ్రుతమైనందున అన్యజీవాధిష్ఠితవ్రీహ్యాదులలో సంశ్లేషమాత్రమేయున్నదని నిర్ణయించిరి అందుచే వ్రీహ్యాదిభావేపజననమన్నచో తల్లవణపర్యంతమాత్రమే దుఃఖముక్తమై అట్లుగాక సంశ్లేషమాత్రమని నిర్ణయించినదీనిచే శోషణకుష్మాలావస్థాపనావహనసఫలీకరణపాకభక్షణాది దశలయందుఅనువృత్తిసిద్ధించుటచేతభక్షణవిషయకముగాకయుండెదువ్రీహ్యాదులలోనుపరిణామపరంపరయా సంశ్లేషము సిద్ధించుటవలన దోషకీర్తనమతిస్ఫుటము

తృతీయాధ్యాయమున ప్రథమపాదము ముగిసెను

# తృతీయాధ్యాయము - ద్వితీయపాదము

**75 సంధ్యాధికరణము (3-2-1)**

**315 సంధ్యే సృష్టిరాహ హి (3-2-1)**

అర్థము - సంధ్యే - స్వప్నమందు, సృష్టి - విచిత్రనిర్మాణం జీవుని చేతచేయబడినదికాదని, ఆహ హి - ఈ అర్థమును శ్రుతిచెప్పెను గదా "న తత్ర రథానరథయోగాన పంథానో భవంత్యథరథాన్రథయోగా న్పథ స్సృజ్యతే" అనియారంభించి "అథ వేశాన్పుష్కరిణ్యస్స్రవంత్యః సృజ్యతే సహి కర్తా" అనిస్వప్నమందనుభవింపబడినపదార్థములకు నిర్మాతజీవుడా పరమాత్మా యనిసంశయము స్వప్నముజూచెడిజీవునికి సన్ని ధానమువలన "సహికర్తా" అనియతడే కర్తగా పరామర్శచేయబడుచున్నది జీవునకిసత్యసంకల్పత్వము ప్రజాపతివాక్యముచే చెప్పబడినది గావున అతడే సృష్టించునని పూర్వపక్షము

సిద్ధాంతము జీవునకు సత్యసంకల్పత్వము సిద్ధమయినను సంసారదశ యందు పరమపురుషునియొక్క సంకల్పముచేత తిరోహితమయిన జీవుని సంకల్పమాత్రముచేత నిర్మాతృత్వము యుపపన్నము కానేరదు ఈ కారణమువలననే పరబ్రహ్మ సకలేతర పురుషుల యొక్క అనుభవ ములకు విషయముగా ఆయాపురుషులచేతనే యనుభవించుటకు యోగ్య మయిన ఆయాకాలమునననుసరించి స్వప్నార్థములను నిర్మాణము చేయును

సూత్రార్థము సంధ్యే - స్వప్నమందుశ్రూయమాణమైన రథాదులయొ క్కసృష్టిస్వప్నదృష్టి గల జీవునిచే తనేచేయబడినది ఎట్లన్న ఆహ హి - అతడే కర్తయని ఆ జీవునికే పరామర్శ ఉండుననియర్థము

316 నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ (3-2-2)

అర్థము -- ఏకే - కొన్ని శాఖలు, నిర్మాతారం - ఈ జీవునినిస్వప్న పదార్థములయందు కర్తగా చెప్పును పుత్రాదయశ్చ - కామశబ్దముచేత పుత్రాదులను హరించుననని చెప్పబడినది ఇదే జీవుని స్వప్నార్థముగ కొన్ని శాఖలుచెప్పుచున్నవి "య ఏషు సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" అనియిచ్చట కామశబ్దముచేత నిర్దిష్టమైన వస్తువులు కూరుటకు యోగ్యమైటచేత పుత్రాదులగును చ శబ్దము అవధారణార్థము. ఇచ్చట "సర్వాన్ కామాన్" అని కామశబ్దముచేత ప్రసక్తులైన 'శత యుష పుత్రపౌత్రాన్ వృణీష్వ" అనగా దీర్ఘాయుష్షుగల పుత్రపౌత్రాదులను వరించుమని వివేచనచేయబడుచున్నది

317 మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్ (3-2-3)

అర్థము - మాయామాత్రం - ఈశ్వరమాయమాత్రమే, కార్త్స్న్యేన - సమస్తమునకు, అనభివ్యక్తస్వరూపత్వాత్ - అభివ్యక్తముగానిస్వరు పమౌటవలన జీవుడుస్వప్నసృష్టిచేయడు తుశబ్దమువలన పక్షముతిరుగు చున్నది స్వప్నమందుండేపదార్థములు జీవునిచేతనే సృష్టింప బడినది కాదు, మరేమంటే ఈశ్వరునియొక్కమాయామాత్రమే సకలేతరపురు షుల అనుభవమునకు గోచరమై జీవునొకనిచేతనే అనుభవించుటకర్హమైన తత్కాలమందే పరిపుచ్చ బడిన ఆశ్చర్యరూపమైన అర్థసమూహములను ఈశ్వరుడే నిర్మాణముచేయునని యర్థము జీవునికిసత్యసంకల్పత్వాదు లుసమస్తసంసారదశయందభివ్యక్తంగానిస్వరూపముమైయుండుటచే
అతనికి సంకల్పత్వమాత్రంచేతనే నిర్మాతృత్వము ఉపపన్నముకానేరదు "కామం కామం పురుషో నిర్మిమాణః" యని పరమపురుషునే నిర్మాణకర్తగా చెప్పినది "య ఏషు సుప్తేషు జాగర్తి" ,"తస్మింల్లోకాశ్శ్రితాస్సర్వే తదు నాత్యేతి కశ్చన" యని ఉపక్రమోపసంహారములందు పరమపురుషునేకహ

...రణములైన ధర్మములను చెప్పుటవలన "సహి కర్తా" అని దానితో ఐక కంఠ్యమువలన పరమపురుషునే చెప్పుచున్నది

తాత్పర్యము జీవునివలన స్వప్నమందనుభవించదగిన ఆశ్చర్యరూప మైన అర్థసముదాయము అను సర్వేశ్వరుడు సృజనచేయుచున్నాడు జీవుడు సృష్టిచేయజాలడు జీవునికి సత్య సంకల్పత్వాదిగుణములు స్వాభావికములైనయెడల ఏ ప్రకారము అభివ్యక్తములుకాలేదనగా చెప్పుచు న్నారు

318 పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్యబంధవిపర్యయౌ (3-2-4)

అర్థము - పర - పరబ్రహ్మ, అభిధ్యానాత్ - సంకల్పమువలన, తిరోహితం - ఆఛ్ఛాదితం అయిన, తత - సంకల్పమువల్లనే, అస్య - ...జీవునికి, బంధవిపర్యయౌ - బంధ మోక్షములు ఏనబడును తు శబ్దము శంకా నివర్తకము పరమపురుషుని అభిధ్యానమువలన ఈ జీవు ని ...స్వాభావికమయినరూపము అనాదికర్మప్రవాహమువలన కృతాపరాధు ...చేత తిరోహితమయినది (తతో హ్యస్య బంధవిపర్యయౌ) తత ...పరమపురుషసంకల్పమువలన ఈ జీవునకు బంధవిపర్యయౌ సంసా రమోక్షములు ఏర్పడుచున్నవి "కో హ్యేవాన్యాత్ క ప్రాణ్యాత్ ఏష ...ఆకాశ ఆనందో న స్యాత్, ఏష హ్యేవానందయాతి", "పరం జ్యోతిరుపసం పద్య స్వేన రూపేణాభినిష్పద్యత" ఇత్యాదులలో ఈయర్థము స్ఫుటము

తాత్పర్యము పరబ్రహ్మసంకల్పమువలన ఈ జీవునకు స్వాభావికమ యిన రూపము అనాదికర్మప్రవాహముచేత తిరోహితమయినది అందువ లన పరమపురుషసంకల్పమువలన ఈ జీవునకు బంధమోక్షములు ఏర్పడుచున్నవి తిరోభావప్రకారమును చెప్పుచున్నారు

319 దేహయోగాద్వా సోఽపి (3-2-5)

అర్థము - సోపి - అతిరోభావము, దేహసంబంధమువలననె అ... న్నది వాళ్ళను వికల్పార్థము వ్యవస్థచేయబడినది వికల్పము సృష్టివేళ యందుదేవమనుష్యాదులయొక్క దేహకారణముగా పరిణతమైన అచిత్తు భాగమువల్ల, ప్రళయకాలమందు నామరూపవిభాగమునకనర్హమైన సూక్ష్మదశనుపొందిన అచిత్సంబంధముచేతనౌను

320 సూచకశ్చ హి శ్రుతేరాచక్షతేచ తద్విద (3-2-6)

అర్థము - శ్రుతే - స్వప్నశ్రుతులను, సూచకశ్చహి - శుభాశుభసూచక ములని, తద్విద - అభిజ్ఞులు, ఆచక్షతే - చెప్పుదురు ముందున్న స్వప్నమందురథాదులుజీవసంకల్పముచే చేయబడినవికావు ఎందువల్ల నంటే స్వప్నముశుభాశుభములకు సూచకమని శ్రుతులవలన తెలియబడు చున్నది "యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి। సమృద్ధిం తత్ర జానీయత్తస్మింత్స్వప్ననిదర్శనే॥ అథ స్వప్నే పురుషం కృష్ణం కృష్ణదంతం" ఇత్యాదుల్లో స్వప్నాధ్యాయవేత్తలు చెప్పు చున్నారు జీవసంకల్పముచేత చేయబడినయెడలసూచకత్వము సంభవిం చదు తన సంకల్పముచేత చేయబడినయెడల ఫలములకు సూచకమై ... అర్థమును నిర్మాణముచేసి జీవుడు చూచును కనుక స్వప్నమందు ... క్షమయ్యేడు అర్థములకు పరమ పురుషుడే నిర్మాత

అధికరణ సంగ్రహము - స్వాప్నసృష్టిప్రకరణమందు జీవుడు సన్నిహితుడౌ టచేత, తత్సృష్టి జీవకర్తృకమనిశంకించి సంసారదశలో ప్రచ్ఛన్నమయ్యే సత్యసంకల్పత్వాదులు కర్మతిరోహిత స్వరూపుడైన జీవునికి గూడనం దున స్వాప్నసృష్టిజీవకర్తృత్వముగాదు పరమాత్మకర్తృకమని నిర్ణయించబ డినది

76 తదభావాధికరణము (3-2-2)

**321 తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ (3-2-7)**

అర్థము - తదభావ - స్వాప్నాభావముసుషుప్తియని అర్థము, నాడీషు - నాడులయందు, ఆత్మని చ - ఆత్మయందును, తచ్ఛ్రుతే - సుషుప్తిస్థానత్వముగాశ్రుతులు చెప్పును నాడులు పురీతద్బ్రహ్మయును సుషుప్తిస్థానత్వముచే వినబడుచున్నవి వీనికి వికల్పమా లేక సముచ్చయమాయని సంశయము వికల్పమనిపూర్వపక్షము "ఆసు తదానాడీషు సుప్తో భవతి", "తాభి ప్రత్యవసృప్యపురీతతి శేతే", "సతా సోమ్య తదా సంపన్నో భవతి" యని మూటికిని నిరపేక్షత్వము తోచుటవలన

సిద్ధాంతము - ప్రాసాదముఖట్వము పర్యంకాదులవలె కార్యభేదముచే సముచ్చయము సంభవించుచుండ గవాక్షిబలాధగర్భవికల్పము యుక్తము గాదు సముచ్చయమే యోగ్యము ఏ కారణమువలన పర్యంకమువలె బ్రహ్మముసుషుప్తికిస్థానమౌనో అందువలన పర్యంకస్థానీయం బ్రహ్మము

సూత్రార్థము - తదభావ - స్వప్నాభావ, సుషుప్తియని తాత్పర్యము సుషుప్తినాడులలో ఆత్మయందును చకారముచేత పురీతతియందును తచ్ఛ్రుతే - మూటికిసుషుప్తిస్థానత్వము యొక్క శ్రవణముండుటవలన చెప్పబడిన న్యాయముగా సముచ్చయము యోగ్యమని అభిప్రాయము

**322 అత ప్రబోధోఽస్మాత్ (3-2-8)**

అర్థము - అత - అందువలన, అస్మాత్ - ఈబ్రహ్మమువలన, ప్రబోధ - ప్రబోధశ్రుతి ఉపపన్నమౌను అత - ఆ కారణమువలన, అస్మాత్ - ఈబ్రహ్మవలన, ప్రబోధశ్రుతి - ప్రబోధకశ్రుతి, వ్యపదిశ్యతే - ఉపపన్నమగుచున్నది "స త ఆగమ్య న విదుస్సత ఆగచ్ఛామ అని

అధికరణ సంగ్రహము - నాడులేమి, పురీతత్ప్రదేశమేమి, బ్రహ్మమేమి, ఈ మూడున్ను నైరపేక్ష్యేణ సుషుప్తిస్థానత్వముగా శ్రుతమగుటవలన తద్స్థానత్వము వికల్పముగావచ్చునని శంకించి ప్రాసాదఖట్వాపర్యంకముల

వలె కార్యభేదేన సముచ్చయమే కూడినట్లుండగా సాక్షిబాధ గర్భవిక ల్పము అయుక్తమగుటచే సముచ్చయమే యుక్తమని నిర్ణయింపబడినది

**77 కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము (3-2-3)**

**323 స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః (3-2-9)**

అర్థము - కర్మ - జన్మాంతరకర్మచేతను, అనుస్మృతి - ప్రత్యభిజ్ఞ చేతను, శబ్ద - శబ్దముల చేతను, విధిభ్య - ఉపాసనచేత, స ఏవ - ఆ జీవుడేయని అర్థము సుషుప్తుడైనవాడే ప్రబోధ కాలమందు పైకిలేచువా లేక అతడా అన్యుడాయని నియమములేదని సంశయము సుషుప్తుడు అయినవానికి సర్వోపాధివినిర్ముక్తమైన బ్రహ్మయందు సంపత్తిగల్గియుం డుటచే ముక్తునికంటె వైలక్షణ్యములేదుగనుక పూర్వశరీరంయొక్క సంబం ధంలేకపోవుటచే అతడేనని నియమము సంభవించదని పూర్వపక్షము సుషుప్తుడైనవానికి బ్రహ్మజ్ఞానములేకపోవుటచేత పూర్వమందు చేయబడి నకర్మకు అతనిచేతనే అనుభవింపబడుటవలన వాడేనవాడని ప్రత్యభిజ్ఞవ లన "త ఇహ వ్యాఘ్రోవా సింహోవా" అనియారంభించి "యద్యద్భవంతి తథా భవంతి" అనుశబ్దమువలన మోక్షమునకు సాధ్యమైనవిద్యకు సార్థ క్యముసంభవించుటచే అతడేలేస్తున్నాడనిసిద్ధాంతము జీవుడు శరీరేంద్రి యములతోత వినిర్ముక్తుడుకాడు, మరేమనిన కరణకళేబరములయొక్క ప్రవర్తనవల్ల ఆయాసమును దూరటను పొందుటకొరకు బ్రహ్మమందు లయమునుపొందకనయే తిరిగి దూరదించుకొనినవాడై పైకిలేచునని చెప్పన బెను

అధికరణ సంగ్రహము - సుప్తుడే ప్రబోధకాలమందు ఉత్థితుడౌతాడని అన రాదు, సుప్తునకు సర్వోపాధివినిర్మోకపూర్వకబ్రహ్మసంపత్తివచ్చుటచేతనని శంకించి ముముక్షుకిముందే అరబ్ధమైన క ర్మము ఉత్థితునివలన సమాపన ముచేయబడుటచే సోహమని సుప్తుడేయుత్థితుడని ప్రత్యభిజ్ఞ వచ్చుటచేత ఇత్యాదియుక్తులచే సుప్తునికేయుత్థితత్వము సమర్థింపబడినది

78 ముగ్ధాధికరణము (3-2-4)

324 ముగ్ధేఽర్ధ సంపత్తి పరిశేషాత్ (3-2-10)

అర్థము - ముగ్ధే - మూర్ఛయందు యే అవస్థాయది, పరిశేషాత్ - మరణజాగ్రదవస్థలురెండు గానందున, అర్థసంపత్తి - మరణముకొరకు, అర్ధసంపత్తనిభావము మూర్ఛ - మరణంకంటే భిన్నమా, మరణమేనా యని సంశయము సమస్తేంద్రియములు ప్రాణములయొక్క వ్యాపార సమాప్తివలన మరణమేనని పూర్వపక్షము ఆకారమునకు వైరూప్యములేక పోవుటచే సూక్ష్మ ప్రాణముంటుందని అంగీకరించుటచే మరణమందర్ధసం పత్తని సిద్ధాంతము

సూత్రార్థము - ముగ్ధే - మూర్ఛనొందిన పురుషునియందు ఏ అవస్థో అది మరణముకొరకు అర్ధసంపత్తి ఎట్లన్న [పరిశేషాత్] ప్రాణాదులయొక్క సర్వవ్యాపారములు శాంతములగుటవలన జాగ్రదవస్థకాదు గతమైన ప్రాణంగలయవస్థయుగాదు ఆకారవైలక్షణ్యంచేత సూక్ష్మప్రాణాలకు స్థితి నంగీకరించుటవలన మూర్ఛపొందినవారుతిరిగి బ్రతుకుటవలన మరణ ముకాదు పరిశేషమువలన మరణముకొరకు అర్థసంపత్తియని తెలియబడు చున్నది

అధికరణ సంగ్రహము - మూర్ఛ - సర్వేంద్రియప్రాణవ్యాపారోపరతిదశ గానుండుటచేత మరణమనిశంకించి ఆకారవైరూప్యముచే సూక్ష్మప్రాణావ స్థిత్వముచే అవగతమైనందువల్ల మరణాయార్థసంపత్తిమూర్ఛయని నిర్ణ యింపబడినది

79 ఉభయలింగాధికరణము (3-2-5)

325 న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి (3-2-11)

అర్థము - పరస్య - బ్రహ్మమునకు, న స్థానతోఽపి - ఆయా స్థాన ములందుండుటవలన, దోషము సంభవించదు, సమస్తస్థలములందును, ఉభలింగం హి - దోషరహితత్వకల్యాణ గుణవత్త్వరూపమైన రెండు

లింగములుండుటవలన జీవునివలె అంతర్యామియైన పరబ్రహ్మకు జాగ్రాదిప్రయుక్తములైన దోషములు సంభవించునా లేదాయని సంశయము "య పృథివ్యాం తిష్ఠన్", "యశ్చక్షుషి తిష్ఠన్", "యో రేతసి తిష్ఠన్" ఇత్యాదులలో జీవునివలెనే సర్వావస్థలందును స్థితిచెప్పుటవలన తన ఇచ్ఛననుబట్టి పూయశోణితాదులందు మజ్జనము అపురుషార్థమైనను సమస్త దోషములు సంభవించునని పూర్వపక్షము

సిద్ధాంతము - "అపహతపాప్మా", "నిరవద్యం నిరంజనమ్", "సత్యకామస్సత్యసంకల్ప", "యస్సర్వజ్ఞస్సర్వవిత్", "యోమామజమనాదిం చ వేత్తిలోకమహేశ్వరమ్", "పర పరాణాం సకలాయనత్ర క్లేశాదయస్సంపతి తాపరేశ" ఇత్యాదిశ్రుతిస్మృతుల్లో నిరస్తనిఖిలదోషగంధముగల సర్వజ్ఞసత్యసంకల్పత్వాద్యుభయలక్షణస్వరూపమవగతమౌటచేపరబ్రహ్మకున ర్యాంతర్యామిత్వం చేత అవస్థితమైన దోషగంధముసంభవించదు మరేమ నిన సర్వనియమనరూపలీలారసమును వహించతమే

సూత్రార్థము - [న స్థానతోఽపి పరస్య] పృథివ్యాదులందంతర్యామిగానుండునను, పరబ్రహ్మ ఆయా స్థానములందుండుటచే జీవునికి ఏ దోషాలుచెప్పబడినవో అవి సంభవించవు ఎట్లన్న [ఉభయలింగం సర్వత్ర హి] హి - హేతువు ఏ కారణమువల్ల, సర్వత్ర - శ్రుతిస్మృతులయందును నిరస్తనిఖిలదోషత్వసమస్తకల్యాణగుణాత్మకత్వరూపోభయలింగమో — ఆ హేతువునుబట్టి ఉభయ లక్షణముగల పరబ్రహ్మమని తెలియబడినది

326 భేదాదితిచేన్న ప్రత్యేకమతద్వచనాత్ (3-2-12)

అర్థము - భేదాత్ - స్థితిభేదమువలన, ఇతిచేన్న - జీవునివలె పరమాత్మకి దోషముకూడదు, ప్రత్యేకం - ప్రతిపర్యాయము, అతద్వచనాత్ - దోషాభావముచెప్పటవలన ఏ ప్రకారము జీవుడు స్వత అపహతపాప్మత్వాదిగుణములుగలవాడైనను దేవాదిశరీరసంబంధస్థితివల్ల చెప్ప

బద్ధదోషసంబంధిత్వంగలదో ఆ ప్రకారమే పరబ్రహ్మకును "యస్య పృథివీశరీరమ్" ఇత్యాదుల్లో " ఏ త ఆత్మా అంతర్యామ్యమృత " అని అంతర్యామిక్ దోషత్వముచెప్పుచున్నది జీవునికి పరమాత్మసంకల్పమువల్ల స్వరూపసమాచ్ఛాదితమని చెప్పబడుచున్నది గాన శరీరసంబంధం ఉండినను పరబ్రహ్మకాదోషములు సంభవించవు

**327 అపి చైవమేకే (3-2-13)**

అర్థము - ఏకే - కొన్నిశాఖలు, ఏవమపి చ - ఇదే ప్రకారము చెప్పును మరియు ఈ జీవ పరమాత్మలకు ఏకశరీరమునందే శరీరులు గానుండుటచే దోషసంబంధిత్వం, దోషరహితత్వం ఏది చెప్పబడినదో అదే అర్థమును కొన్నిశాఖలు స్వశబ్దముచే చెప్పుచున్నవి "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానంవృక్షం పరిషస్వజాతే। తయోరన్యం పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్ అన్యోభిచాకశీతి" అని మనుష్యాది శరీరములందు శరీరియగు జీవునికి నామరూపములు పొందటముచేత కర్మవశ్యత్వమందు హేతువగును అది పరబ్రహ్మకు కర్మవశ్యత్వముచేత ఏ ప్రకారము కర్మముఫలము అనుభవమనగా చెప్పుచున్నారు

**328 అరూపవదేవహి తత్ప్రధానత్వాత్ (3-2-14)**

అర్థము - తత్ - పరబ్రహ్మ, ప్రధానత్వాత్ - నియామకత్వము వలన, అరూపవదేవ హి - రూపరహితమగును మనుష్యాదిశరీరములందు శరీరిగాయుండినను ఆ బ్రహ్మ రూపరహితమైనదే ఎట్లన్న ప్రధానత్వాత్ - నిర్వాహకత్వమువలన, జీవునికి నామరూపప్రాప్తిపూర్వకముగా కర్మఫలానుభవమును నిర్వహింపజేయుటకు పరబ్రహ్మ ఆయా శరీరములయందు శరీరిగా ఉండును "యస్య పృథివీ శరీరమ్,

యస్యాత్మా శరీరమ్, య ఆత్మానమంతరో యమయతి" "అంత ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" అని కావున ఉభయలింగము పరబ్రహ్మమే
తాత్పర్యము - దేహాంతప్రవిష్టుడై అన్యులకదృష్టుడై పరమాత్మ శాసన ముచేయుచుండును "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని ప్రకాశము క్కలే బ్రహ్మస్వరూపమని చెప్పబడుచున్నది ఎట్లు ఉభయలింగమనగా చెప్పుచున్నరు

329 ప్రకాశవచ్చావైయర్థ్యాత్ (3-2-15)
అర్థము - ప్రకాశవత్ - ప్రకాశమునకు బ్రహ్మస్వరూపమువలె, అవై యర్థ్యాత్ - వైయర్థ్యము లేకపోవుటవలన కల్యాణగుణవత్వము స్వీక రింపబడును ఏ ప్రకారము "సత్యంజ్ఞానమ్" అను వాక్యమునకు వ్యర్థత్వ ములేకపోవుటకు ప్రకాశమే బ్రహ్మస్వరూపమని తెలియబడుచున్నదో ఆ ప్రకారము "యస్సర్వజ్ఞస్సర్వవిత్ పరాశ్యశక్తిర్వివిధైవ శ్రూయతే" అనువా క్యానికి వైయర్థ్యము లేకపోవుటవలన కల్యాణగుణాకరత్వమున్ను బ్రహ్మకు స్వరూపమని తెలియుచున్నది కావున ఉభయలింగము పరబ్ర హ్మమే
తాత్పర్యము - శ్రుతులయందు వైయర్థ్యములేనందున బ్రహ్మమునకు కల్యాణగుణాకరత్వము గ్రహింపబడుచున్నది

330 ఆహ చ తన్మాత్రమ్ (3-2-16)
అర్థము - తన్మాత్రమ్ - ప్రకాశస్వరూపమాత్రమునే, ఆహ చ - సత్యమనెడి శ్రుతి చెప్పు చున్నది "సత్యంజ్ఞానమ్" అనువాక్యము, బ్రహ్మ జ్ఞానస్వరూపమని ఇంతమాత్రంచెప్పినది మరల కల్యాణగుణాకర త్వబ్రహ్మస్వరూపమును విషేధించదు

331 దర్శయతిచాథోఽపి స్మర్యతే (3-2-17)

అర్థము - దర్శయతిచ - శ్రుతులు చెప్పును, అథాపి - అనంతర మందును, స్మర్యతే - స్మృతులున్ను చెప్పుచున్నవి వేదాంతవాక్యస మూహము నిరస్తనిఖిలదోషత్వము, కల్యాణ గుణాకరత్వమును చూపించు చున్నవి "నిష్కళం నిష్క్రియంశాంతం నిరవద్యం నిరంజనమ్" "తమీశ్వ రాణాం పరమ మహేశ్వరమ్। తం దేవతానాం పరమం చ దైవతమ్" ఇత్యాదులు "యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్", "అహం కృత్స్నస్య జగత ప్రభవ ప్రళయస్తథా। మత్త పరతరం నాన్యత్"" ఇత్యా దులు

## 332 అతఏవ చ ఉపమా సూర్యకాదివత్ (3-2-18)

అర్థము - అతఏవ చ - ఆకారణమువలన, సూర్యకాదివత్ - జల సూర్యాదులవలెనే, ఉపమా - సాదృశ్యము అనగా సూర్యప్రతిబింబసా దృశ్యమని తెలియవలయును ఏ కారణమువల్ల పరబ్రహ్మకు నిరస్తసమస్త దోషములచేత, కల్యాణగుణాశ్రయత్వముచేత ఉభయలింగత్వమువల్ల పృదివ్యాది స్థానములయందుండినను వానివలన ప్రయుక్తమైన దోషసం బంధములేదో ఆ కారణమువలన శాస్త్రములయందు జలసూర్యాదుల యొక్క సాదృశ్యము చెప్పబడియున్నది 'ఆకాశమేకం హి యథా ఘటా దిషు పృథగ్భవేత్। తదాత్మైకోప్యనేక జలాధారేష్వివాంశుమాన్" ఇత్యాదు లు

తాత్పర్యము - పరబ్రహ్మమునకు నిరస్తనిఖిలదోషభావముచేతను, కల్యా ణగుణాకరత్వము చేతను పృదివ్యాదిస్థానమునందుండినను తత్ప్రయుక్త దోషము ఆకాశసూర్యాదులవలె సంభవించదు

## 333 అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్ (3-2-19)

అర్థము - అమ్బువత్ - ఉదకమందు సూర్యునివలె, అగ్రహణాత్ - గ్రహణంలేకపోవుటచే, న తథాత్వమ్ - తద్రూపత్వములేదు తుశబ్దము చోద్యమును సూచనచేయుచున్నది ఉదకమందున్న తెల్లువలె గ్రహణము లేకపోవుటచే ఏ ప్రకారం ఉదకమందు సూర్యుడు లేకపోయినను భ్రాంతి చేత అచ్చటనుండువానివలె గ్రహింపబడునో గ్రహింపబడునో ఆ ప్రకారం పృథివ్యాదులందు పరమాత్మ గ్రహింపబడదు "య పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యామంతర" యని పరమార్థత్వముగా స్థితిగ్రహింపబడును కనుక యారీతికాదు సూర్యునివలె తత్ప్రయుక్త దోషంయొక్క అభావము పరమాత్మకులేదు, యదార్థముగామండుటచే పరిహరించుచున్నారు

334 వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవం దర్శనాచ్చ (3-2-20)

అర్థము - అంతర్భావాత్ - పరమాత్మకు పృథివ్యాదులందు అంతర్భావమువలన, వృద్ధిహ్రాస భాక్త్వం - వృద్ధిక్షయప్రాప్తిని నివారణచేయబడును ఇదెట్లుతెలియబడునన్న ఉభయసామంజస్యాత్ - రెండు దృష్టాంతములకు సమంజసమువలన, ఏవం - ఈ ప్రకారం, దర్శనాచ్చ - సాదృశ్యముచెప్పుటవలన పృథివిమొదలైన విషమస్థానము లందుండినను పరమాత్మకు తదంతర్భావాత్ - అక్కడ అంతర్భావము వలన దానివలన సంభవించిన వృద్ధిక్షయములను పొందడము "జలధారే ష్వివాంశుమాన్"అనే దృష్టాంతముచేత నివర్తింపజేయబడును ఇదెట్లు తెలియునన్న [ఉభయ సామంజస్యాదేవం] ఉభయదృష్టాంతముల ఉపాదానసమంజసత్వము వలన ఈ ప్రకారము తెలియబడుచున్నది "ఆకాశ మేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్" అని ఘటకరకాదులలో విషమంబుగనుండు ఆకాశమును, "జలాధారేష్వపివాంశుమాన్" అని యదార్థముగాలేని సూర్యుని ఈ యుభయమును దృష్టాంతంగా తీసుకొని "తథాత్మకోప్యవేకస్థ" అని నిగమనముచేయుటవలన ఆయా స్థానప్రయుక్తవృద్ధి

హ్రాసప్రాప్తివివర్తనమాత్రమే వివక్ష చేయబడినదని తెలియబడుచున్నది మరియొకస్థలమందు దృష్టాంతదార్ష్టాంతములకు సర్వ సామ్యమభావ మైనను సింహైవమాణవక ఇత్యాదుల్లో దృష్టాంతోపాదానముయొక్క దర్శ నంచే తెలియబడుచున్నది "అథాత ఆదేశో నేతి నేతి" ఇత్యాదులచే పూర్వమందు ప్రకృతమైన మూర్తామూర్తరూపమైన ప్రపంచమునకు బ్రహ్మస్వరూపముయొక్క నిషేధత్వమువల్ల నిష్ప్రపంచమైన సన్మాత్రమే బ్రహ్మము ఉభయలింగముగలదిగాదనిశంకించి సమాధానము చెప్పుచు న్నారు

335 ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః (3-2-21)

అర్థము - ప్రకృత - పూర్వమందు ప్రకృతమైన, ఏతావత్త్వం - ఇంతమాత్రంబ్రహ్మమునకు నిషేధమగును, తత - పూర్వమందుచెప్పబడి ంద నిలిచ్చను భూయ - అధికంగా బ్రవీతిచ - చెప్పుచున్నది హి శబ్దం హేతువాచకము "ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తంచామూర్తమేవ చ" ఇత్యాదులందు స్థూలసూక్ష్మప్రపంచమునకు బ్రహ్మరూపత్వముచే ప్రమాణాంతరమందు చెప్పబడనిదానికచ్చట నిరూపముగా ఉపదేశముం డుటవలన నిషేధము సంభవించదు ప్రకృతమందింతమాత్రమే బ్రహ్మ మునకు నిషేధంకల్గుచున్నది పూర్వమందుప్రకృతమైనంత మాత్రం కల్గి నది బ్రహ్మముకాదని "అధాత ఆదేశో నేతి నేతి" అనుస్థలమందు ప్రతిపా దించ బడినదనియర్థము [తతో బ్రవీతి చ భూయః] తత - పూర్వోక్తమైన అధిక్యమును వాక్యశేషమును చెప్పచున్నది "నహ్యేతస్మాదితి నేత్యన్య త్పరమస్తి అధనామధేయం సత్యస్య సత్యమితి ప్రాణావై సత్యం తేషామే ష సత్యమితి" అని నేతినిర్దిష్టమువల్ల బ్రహ్మమునకన్యము లేదనియర్థము సత్యస్య సత్యమని బ్రహ్మయొక్క నామధేయము, దానివల్ల నిశ్చయకథ నము ప్రాణావై సత్యము తేషామేషసత్యమని ప్రాణసాహచర్యమువలన జీవాత్మలు ప్రాణములు అవి అంతరిక్షాదులవలె ఉత్పత్తికవర్గములగుటచే

సత్యము వానికంటే ఇతడు సత్యము వారు కర్మానుగుణమైన దేహసం బంధముచేత జన్మగలవారు అవి ఇతనికి లేవుగనుక వారియందు ఇతడు సత్యము జ్ఞానసంకోచాదివికారములును సంభవింపవు ఈ కారణంచే ప్రమాణాంతరం చేత తెలియబడనిస్వరూపముగలబ్రహ్మమునకు మూర్తా మూర్తప్రపంచక్రమముచేత ఉపదేశము ఉండుటచే మరియొకప్రకారవిశేష ఉపదేశమువల్లను "అథాత ఆదేశో నేతి నేతి" అని పూర్వ ప్రకృతమైన ఇయ త్తాబ్రహ్మమునకు నిషేధముచెప్పబడుచున్నదనియర్థము ఓయీనస్వభా వంగా ప్రత్యక్షమువల్ల నిర్విశేషచిన్మాత్రమే గ్రహింపబడుచున్నది దాని కంటే అతిరిక్తమైనభ్రాంతిచేత తోచెడివిశేషమునారోపముచేసి "నేతినేతి" యని నిషేధముచెప్పుచున్నదన్న చెప్పుచున్నారు

336 తదవ్యక్తమాహ హి (3-2-22)

అర్థము - తత్ బ్రహ్మము, అవ్యక్తం - అస్ఫుటమని, ఆహ హి - శ్రుతిచెప్పెను ఆ బ్రహ్మము ఏ ప్రమాణముచేతనూ వ్యక్తముకాదు అట్లే శ్రుతిచెప్పుచున్నది "న సంద్సశే తిష్ఠతి రూపమస్య" ఇత్యాదులందు

337 అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్ (3-2-23)

అర్థము - ప్రత్యక్షానుమానాభ్యాం - శ్రుతిస్మృతులచేతను, సంరా ధనేఽపి - ధ్యానమందు పరమాత్మతెలియునని నిశ్చయింపబడినది మరియు సంరాధనమందే పొందబడుచున్నది సంరాధనం - చక్కగా ప్రీతితో గూడినభజనము, ఉపాసనమని తాత్పర్యము ఉపాసనరూప భగవ త్ప్రీతిజనకమైన నిమిత్తమువినా మరిదేనిచేతను పొందబడెడువాడుకాడని శ్రుతిస్మృతుల చేత తెలియబడుచున్నది "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన యమేవైషవృణుతే తేన లభ్య", "నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా - భక్త్యాతు అనన్య

యాశక్య" అని కనుక ఏ ప్రమాణముచేతను అవ్యక్తరూపముకలవాడగుట చేతను బ్రహ్మకు "ద్వావే బ్రహ్మణో రూపే" ఇత్యాదులందు బ్రహ్మమునకు ప్రకారతయా జగదైశ్వర్యము ఉపదేశముచేయబడినది "నేతినేతి" అని నిషేధింపబడలేదు మరేమనిన ప్రకృత ఇయత్తామాత్రమే నిషేధింపబడుచున్నది

338 ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్ (3-2-24)

అర్థము - కర్మణి - ధ్యానకర్మయందు, అభ్యాసాత్ - అభ్యాసము వలన, ప్రకాశశ్చ దర్శనంకల్గి, ప్రకాశాదివత్ - జ్ఞానానందాదుల వలె అవైశేష్యం విశేషాభావం తోచుచున్నది ఈ కారణమువలన జ్ఞానానందాదువలె జగదైశ్వర్యమున్ను బ్రహ్మయొక్కరూపము ఏ వామదేవాదులకు ధ్యానరూపకర్మయందభ్యాసమువలన ప్రకాశముకల్గెనేమో, దర్శనముకల్గెనో వారలదర్శనమందు ప్రకాశాదివత్ - జ్ఞానాదులకువలె జగదైశ్వర్యమునకు అవిశేష్యము తోచుచున్నది "తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవ ప్రతిపేదే అహం మనురభవం సూర్యశ్చాహం కక్షీవాన్" ఇత్యాదులందు

339 అతోనంతేన తథాహి లిఙ్గమ్ (3-2-25)

అర్థము - అత ఆ కారణమువలన, అనంతేన - కల్యాణగుణసమూహముచేత యోగము సిద్ధించెను, తథా - అట్లైనను, లింగంహి - ఉభయలింగముగలదే బ్రహ్మ అత, అనంతేన - కల్యాణగుణసమూహముచేతయోగము బ్రహ్మకు సిద్ధించెను ఆ ప్రకారమైన ఉభయలింగమే పరబ్రహ్మ అధికరణసంగ్రహము - జీవునివలెపరమాత్మకు జాగరాదిసర్వావస్థల్లో అవస్థానముక్తమైనందున తత్ప్రయుక్తదోషాలు సంభవించునని శంకించి సర్వావస్థావస్థితమైన బ్రహ్మమునకు అఖిలహేయ ప్రత్యనీకత్వక

ల్యాత్రైకత్వానత్వములనే ఉభయలింగము శ్రుతిశతసమధిగతమాటచే తత్ప్రయుక్త దోషములు సంభవించదనినిర్ణయింపబడినది

80 అహికుండలాధికరణము (3-2-4)

340 ఉభయవ్యపదేశాత్త్వహి కుండలవత్ (3-2-26)

అర్థము - అహి - సర్పమునకు కుండవలత్ - కుండలభావము వలె బ్రహ్మస్వరూపమునకు అచిద్రూపముచేతస్థితి, అచిత్తునకు బ్రహ్మ రూపముచేతస్థితి, ఉభయవ్యపదేశాత్ - ఏకత్వ నానాత్వవ్యపదేశముల వలన అగును "ద్వేవావ బ్రహ్మణో రూపే" ఇత్యాదులలో చెప్పబడిన అచిద్వస్తువునకు బ్రహ్మరూపత్వము, బ్రహ్మస్వరూపమునకు అచిద్వస్తువుచే పరిణామముచే అగుచున్నదా లేక పరబ్రహ్మయందు అచిద్వస్తువుయందును ఏకజాతియోగమువంటిదా లేక జీవునివలె బ్రహ్మశరీరత్వముచేత బ్రహ్మశరీరత్వముచేతనాయని సంశయము భిన్నత్వ అభిన్నత్వరూపోభయవ్యపదేశములకు ఉపపత్తికొరకు బ్రహ్మఅచిద్రూపముచేత పరిణమించు చున్నదని మొదటిపక్షము ఆ ప్రకారమైనను బ్రహ్మకు నిర్దోషత్వాదులు బాధపెట్టుచున్నదని ఏకజాతియోగముచేతనని రెండవపక్షము ఇట్లైన "ఆత్మైవేదం సర్వమ్", "బ్రహ్మైవేదం సర్వమ్" అని బ్రహ్మస్వరూపమునకే సర్వశబ్దవాచ్యత్వముయొక్క వ్యపదేశమునకుబాధకలగని లోకమందొక్కగోవు ఖండమనియు ముండమనియు పూర్ణశృంగమనియు సర్వగోవ్యక్తులకు వాచకమైన శబ్దముచేత చెప్పబడుచున్నది కానిన జీవునికి అట్లే బ్రహ్మశరీరత్వముచేతను అచిద్వస్తువుకు బ్రహ్మాంశత్వమని సిద్ధాంతము మాత్రార్థము - తు శబ్దమవధారణార్థకము సర్పమునకు కుండలభావంవలే బ్రహ్మస్వరూపానికి అచిద్రూపముచేతస్థితి ఎట్లన్న ఉభయవ్యపదేశాత్ - నానాత్వైకత్వవ్యపదేశములను చెప్పుటచే

341 ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్ (3-2-27)

అర్థము - తేజస్త్వాత్ - తేజస్త్వముచేత, ప్రకాశాశ్రయవద్వా - ప్రకాశాశ్రయమువలె, ఏకజాతి యోగముండుసు వా శబ్దము అనంతరమందు చెప్పబడినదానికి వ్యావృత్తమనియర్థము ఏ ప్రకారము ప్రకాశమునకు తదాశ్రయవస్తువునకు తేజస్త్వముచేత ఏకజాతియోగమువలన అభిన్నత్వము భిన్నత్వము రెండుయున్నదో ఆ ప్రకారము అచిద్బ్రహ్మలకుండును

342 పూర్వవద్వా (3-2-28)

అర్థము - పూర్వవద్వా - పూర్వము బ్రహ్మకు నిర్దోషత్వముచెప్పబడిన ప్రకారంగనైనను వాశబ్దము వక్ష్యద్యయవ్యావృత్తిఫలకమనియర్థము పూర్వవత్ - ఏ ప్రకారం "అంశో నానావ్యపదేశాత్" ప్రకాశాదులకొరకు బ్రహ్మకు నిర్దోషత్వము సిద్ధించెడికొరకు ప్రకాశజాతిగుణ - శరీరము వలె భిన్నముగానుండడమునకు అర్హమైన విశేషణత్వముచే జీవునికి బ్రహ్మాంశత్వం చెప్పబడినదో అట్లే అచిద్వస్తువుకు అచిద్వాచకశబ్దము చేత అచిద్విశిష్టమైనవస్తువే బ్రహ్మమని చెప్పబడినది "ఆత్మైవేదం సర్వమ్" అని అభేదవ్యపదేశమునకుపపత్తి విశేషణవిశేష్యములకు స్వరూపస్వభావములయొక్క భేదజ్ఞానముకొరకు విశేషణవిశేష్యములభేదముచే వ్యపదేశము ఉపపన్నమౌను "క్షరంత్వవిద్యాహ్యమృతం తు విద్యా విద్యావిద్యే ఈ శయతే యస్తుసోన్య" అని బ్రహ్మమునకు నిర్దోషత్వము చెప్పబడెను

343 ప్రతిషేధాచ్చ (3-2-29)

అర్థము - ప్రతిషేధాచ్చ - బ్రహ్మమునకచిద్ధర్మనిషేధమువలన "స వా ఏష మహానజ ఆత్మాజరోఽమర", "నాస్యజరయైతజ్జీర్యతి", "విజరరో విమృత్యు" ఇత్యాదులందు బ్రహ్మకు అచిద్ధర్మములయొక్క నిషేధముచే విశేషణవిశేష్యభావములచే అంశాంశిభావమనితాత్పర్యము అధికరణ

సంగ్రహము - అచిద్వస్తురూపేణ పరిణతము బ్రహ్మమే కాగావలెను లేక బ్రహ్మయందును అచిద్వస్తువందును ఏకజాతియోగముచేత ఐకజాతికవస్తువులుగాగావలెను భిన్నాభిన్నత్వోభయవ్యపదేశముగూడా కావలసినదని శంకించి "అంశో నానావ్యపదేశాత్" అనే అధికరణన్యాయముచే జీవుని వలె శరీరాత్మభావముకల్గినదై అందుచే భిన్నాభిన్నత్వవ్యపదేశము కూడుటచే అచిద్వస్తువు బ్రహ్మశరీరమని నిర్ణయించబడినది

81 పరాధికరణము (3-2-5)

344 పరమతస్సేతూన్మానసంబంధ భేదవ్యపదేశేభ్యః (3-2-30)

అర్థము - అత - ఈ బ్రహ్మకంటే, పరం - వ్యాప్యమైన వస్తువున్నదనియు, సేతు - సేతువని, ఉన్మాన - అపరిమితమనియు, సంబంధ - సంబంధముగలదనియు, భేద - భేదముగలదనియు, వ్యపదేశేభ్యః - చెప్పుటచేననియొకటు తెలియును "యతో వా ఇమాని" ఇత్యాదుల్లో జగజ్జన్మాదికారణత్వము చెప్పబడినబ్రహ్మకంటే భిన్నమైన మరో తత్త్వమున్నదా లేదాయని సంశయము ఇంతకంటే పరము ఉన్నదని పూర్వపక్షము "అథ య ఆత్మా స సేతు" అని దీనికి సేతుత్వవ్యపదేశమువలన "ఏతం సేతుం తీర్త్వా" అని దీన్నిదాటుటకు యోగ్యమైన ప్రకారము చెప్పటవలన దీనికంటే భిన్నమున్నదని తెలియబడుచున్నది "చతుష్పాత్ బ్రహ్మ షోడశకలం" అని పరిమితవ్యపదేశమువలన అపరిమితమైనది మరియొకటియున్నదని తోచుచున్నది "అమృతస్యైష సేతు" అని ప్రాపకత్వము చెప్పుటచే దీనిచేత ప్రాప్యమైనది మరియొకటున్నదని ప్రాప్యప్రాపకరూపమైన సంబంధమువలన తోచు చున్నది ఈ ప్రకారము "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం తతో యదుత్తరతరమ్" అని పురుషశబ్దముచే చెప్పబడినబ్రహ్మకంటే ఉత్తరత్వముచే భేదముచెప్పుటచే మరియొకటున్నది సిద్ధాంతము - "నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి" ఇతి

నేతియని నిర్దిష్టమైన మూర్తామూర్త రూపమైనబ్రహ్మకంటే మరియొకపరం లేదని పరతత్త్వంయొక్క నిషేధముచే కారణమైన బ్రహ్మ కంటే భిన్న మైన పరవస్తువులేదు సేతువ్యపదేశమందునను "ఏషాం లోకానామసంభే దాయ" అనగా ఈ లోకములకు అసంకరత్వముచేత జేయబడినది "ఏతం సేతుంతీర్త్వా" యని తరతి ధాతువునకు వేదమును దాటును యనే ప్రకారము ప్రాప్తివాచకము, " చతుష్పాద్బ్రహ్మ షోడశకలం " అని యున్మానవ్యపదేశమున్ను - " వాక్పాదశ్చక్షు పాద " యను ప్రకారము పాసనము కొరకు - అపరిమితమైనను తత్తద్దేశ సంబంధిత్వముచే పున్మితత్వాను సంధానము సంభవిస్తున్నది " అమృతస్యైష సేతు " యని తనకే యమృతత్వ స్వరూపమునకు తానే ప్రాపకమని చెప్పబడుచున్నది 'యమేవైష వృణుతే తేనలభ్య " ఇత్యాదిశ్రుతులందు "తతో యదుత్తర తరం" అనియూ "తేనేదం పూర్ణం" అని నిర్దుష్టుడైనపురుషునికంటే అన్య ము ఎ ఎరతత్వము చెప్పలేదు మరేమనిన 'తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్య పంథా విద్యతే అయనాయ" అని పూర్వమందు ప్రతిజ్ఞచే యబడినది పురుషజ్ఞానమునకు అమృతత్వ హేతుత్వము అన్యమునక మూర్ధత్వము ఈ రెంటని సహేతుకముగా ఉపసంహారము చేయుచు న్నది "యస్మాత్పరం నాపరమస్తి కించిత్" అనియారంభించి "తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్" అని పురుషునికి సమస్తంకంటే పరత్వము అన్యమునకు పరత్వాభావము ప్రతిపాదించి తత - ఆహేతువునిబట్టి ఉత్త రతరం శ్రేష్ఠమైన పురుషత్వమున్ను అదేరూపము అనామయము "య ఏతద్విదు అమృతాస్తే భవంతి అథేతరేదు ఖమేవాపి యన్తి" అని పూర్వము ప్రతిజ్ఞచేయబడినదే ఉపసంహారముచేయబడినది

సూత్రార్థము - [పరమత ] "జన్మాద్యస్య యత " అనియారంభించి ఆలోకనంతేన తథాహి లింగమ్" అనువరకు ప్రతిపాదనచేయబడినసమస్త జగత్తుకు కారణము సర్వాంతర్యామి నిఖిలనిరస్తదోషగంధముగల అనవధి

కాతిశయము అనంతకల్యాణగుణాలకు ముఖ్యాధారుడైన పరబ్రహ్మకంటే పరమైనవస్తువున్నదని ఒకరు తెల్పును ఎట్లన్న [సేతూన్మానసంబంధభేద వ్యపదేశేభ్యః] అని దీనియర్థము పూర్వమే వ్యాఖ్యానముచేయబడినది

345 సామాన్యాత్తు (3-2-31)

అర్థము - సామాన్యాత్తు - సేతుసాదృశ్యమువలన పరబ్రహ్మకంటే పరములేదు తుశబ్దము పక్షమును వ్యావృత్తిచేయుచున్నది సేతుత్వవ్యపదేశమైతే ఆ బ్రహ్మకంటే పరును తోపింప చేసేదిలేదు సేతుసామాన్యాత్ సాదృశ్యరూపమువలన, అనగా జగద్ధారణరూపమైన సాదృశ్యమువలన బ్రహ్మమునకు ఆప్రకారము వ్యపదేశమని శ్రుతిరేయే సేతుశబ్దమును చెప్పుచున్నది "అథ య ఆత్మా స సేతుర్విధృతిరేషాం లోకానామసంభేదాయ" అని యేయే స్వభావముగల లోకములు సృజింపబడినవో ఆయా స్వభావములుగల అసాంకర్యముకొరకు సమస్తలోకములను ధరించునుగనుక సేతువువలె సేతువని చెప్పబడునని యర్థము

346 బుద్ధ్యర్థ పాదవత్ (3-2-32)

అర్థము - పాదవత్ - వాక్పాదశ్చక్షుపాదమువలె, బుద్ధ్యర్థ ఉపాసనకొరకైనది "చతుష్పాద్ బ్రహ్మ" , "పాదోస్య విశ్వా భూతాని" అనే ఉన్మానవ్యపదేశము అట్లు సంధానముకొరకు "వాక్పాదశ్చక్షుపాద " అను ప్రకారమని తెలియవలయును అపరిమితస్వరూపంగల బ్రహ్మకు అనుసంధానముకొరకైనను ఏప్రకారం పరిమితత్వమనగా చెప్పుచున్నారు

347 స్థానవిశేషాత్ప్రకాశాదివత్ (3-2-33)

అర్థము - ప్రకాశాదివత్ - ప్రకాశము మొదలైనవానివలె, స్థానవిశేషాత్ - ఆయాస్థానాలయొక్క విశేషంవల్ల పొందబడిన వాగాది స్థానవిశేషంయొక్క సంబంధంచే ఆయాస్థానసంబంధిత్వంచే అవచ్ఛిన్నమైన అను

సంధానముగూడుచున్నది ఏ ప్రకారము విస్తారమైన ప్రకాశమునకు ఆకాశమునకు గవాక్షిఘటాదులవలె

348 ఉపపత్తేశ్చ (3-2-34)
అర్థము - ఉపపత్తేశ్చ - ఉపపత్తిసంభవించుటవలన "అమృతస్యైష సేతు" అని అమృతమైన తనకుతానే ప్రాపకుడని సేతుత్వవ్యపదేశము నకు ఉపపత్తికల్గుటచే మరొక పరమున్నదనే కల్పనగూడదు "నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేనలభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" అన్నచో ఇదే అర్థము ధృవమౌచున్నది

349 తథాన్యప్రతిషేదాత్ (3-2-35)
అర్థము - తథా - ఆప్రకారము అన్య - పరమపురుషునికంటే అన్యునికి ప్రతిషేధాత్ - నిషేధమువలన "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం తతో యదుత్తరతరమ్" అని పరమపురుషునికంటే అనుయ్యునకు పరత్వముచెప్పలేదు "నతస్య కశ్చన","నహ్యేతస్మాత్" అని దీనికంటే పరములేదు "యస్మాత్పరం నాపరమస్తి కించిద్యస్మాన్నాణీయో న జ్యాయోస్తి కశ్చిద్యస్మాదపరం పరంవాస్తి" అని ఇత్యాదులందు పురుషుని కంటే అన్యమునకుప్రతిషేధం చేయుటచుబట్టి "తతో యదుత్తరతరమ్" అని ఏ కారణమువలన పురుషత్వముశ్రేష్ఠమో ఆ హేతువువలన ఉత్తరత రమైన పురుషత్వము ఆదేరూపము అనామయమని వ్యాఖ్యానము చేయ బడినది "య ఏతద్విదురమృతాస్తేభవంతి" అని "తమేవం విదిత్వాతిమృ త్యుమేతి నాన్య పంథాయనాయ విద్యతే" అని ప్రతిజ్ఞచేయబడినదే ఉప సంహారముచేయబడినది "న తస్యేశకశ్చన తస్య నామమహద్యశ" అని పురుషతత్వమును చెప్పుచున్నది అనంతరం "అద్భ్యస్సంభూతో హిర

వ్యగర్భ ఇత్యష్టావ" అని అని పురుషతత్త్వవాచకములైన వాక్యాలతో ఏకవాక్యత్వాంగీకారమువలన "అద్భుతస్య పారే యమంతస్యముద్రే కవయో౽వయంతి" అని ఉపక్రమమువలన

350 అనేన సర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః (3-2-36)

అర్థము - అనేన - బ్రహ్మచేతసమస్తమునకున్ను, గతత్వం - వ్యాప్తత్వం, ఆయామశబ్దాదిభ్యః -సర్వవ్యాప్తవాచిశబ్దాదులవల్ల తెలియబడును "తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్", "అంత బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థిత ", "నిత్యం విభుం సర్వగతంసూక్ష్మంతదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరా " అనే అనేక ఆయామశబ్దములచేత సర్వవ్యాప్తివాచకాలు అయిన వాటిచేత తెలియబడేదిదై ఇతనికంటే పరమును వారించుచున్నదని అర్థము అది శబ్దమువలన "ఆత్మైవేదం సర్వమ్" ఇత్యాదులు గ్రహింపబడుచున్నవి అత - ఈ కారణంచే "యతో వా ఇమాని భూతాని" అనువాక్యాలచే తెలియబడినజగత్తుకు నిమిత్తోపాదానకారణ - భూతమైనబ్రహ్మకంటే పరమైనదిలేదు

అధికరణ సంగ్రహము - జగజ్జన్మాదికారణతయా దృష్టపరబ్రహ్మవస్తువు కంటే పరవస్తువును సేతూన్మానసంబంధభేదవ్యపదేశములు చేయుచున్నదనిశంకించి కారణవస్తువుకంటే వస్త్వంతరమునకు పరత్వము "యస్మాత్పరతరం నాపరమస్తికించిత్" ఇత్యాది శ్రుతినిషిద్ధం అగుటచే సేతుత్వవ్యపదేశము సర్వలోకాసాంకర్యహేతుత్వప్రయుక్తమైనందునను, అపరిచ్ఛిన్న వస్తువుకు ఉన్మానవ్యపదేశము ఉపాసనార్థమైనందునను సంబంధవ్యపదేశము తనకే ప్రాప్యత్వ - ప్రాపకత్వప్రయుక్తమౌటచేత "తతోయదుత్తరతరం" అను శ్రుతికి భేదవ్యపదేశము అర్థము కానందున జగత్కారణవస్తువుకంటే పరవస్తువులేదని నిర్ణయింపబడినది

82 ఫలాధికరణము (3-2-7)

351 ఫలమత ఉపపత్తే (3-2-37)

అర్థము అత - బ్రహ్మవలన, ఫలం - మోక్షాదిరూపఫలము, ఉప పత్తే - ఉపపత్తివల్ల అని భావము వేదమందు చెప్పబడిన యాగము, దానము హోమము మొదలగు ఉపాసనలు "యజేత", "ఉపాసీత" అని కామికిని ముముక్షువునకు కర్తవ్యత్వముచే విధింపబడుచుండెడు కర్మ అపూర్వద్వారముగా భోగాపవర్గరూపఫలమునిచ్చునా లేక వానియొక్క ఆరాధన చేత సంతుష్టుడైన పరమపురుషుడే ఫలమునిచ్చునాయని సంశయము కర్మమే ఇచ్చునని పూర్వపక్షము లోకమందు పొందుటకు యోగ్యమైన కృషి మొదలైన కర్మములకు సాక్షాత్తుగానైనను పరంపరలచేతనైనను ఫల ప్రదత్వము వినబడుటవలన వేదమందు "యజేత స్వర్గకామః", "ఆత్మాన మేవ లోకముపాసీత" అని కామికిని, ముముక్షువునకును కర్తవ్యత్వము చేత విధింపబడెడు కర్మ ఆయాఫలమందు సాధనమని తెలియబడినది క్షణికమై నను అపూర్వము అనెడి ద్వారముచేత భోగాపవర్గమైన సమస్తఫలము నిచ్చును

సిద్ధాంతము - కర్తవ్యత్వముచేత తెలియబడినయాగాదులందు ఉపాసన యున్ను "యజ - దేవ పూజాయాం" అని తెలియబడినధాత్వర్థస్వభావ ముగల్గినదగుటవలన "వాయుమేవ స్వేన భాగధేయేనోపధావతి స ఏవైనం భూతింగమయతి" అని వాక్యశేషమున్ను ""ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్యనాభి ", "తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదుచంద్రమా ", "స తయా శ్రద్ధయాయుక్తస్తస్యారాధనమీహతే। లభతే చ తత కామాన్ మయైవ విహితాన్హితాన్" , "అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।", "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః", "మత్ప్రసాదాత్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్" ఇత్యాదిశ్రుతిస్మృతులవలన పరమపురుషుడే కర్మలచేత ఉపాసనచేత

పూజచేయబడినవారై భోగాపవర్గరూపమైన ఫలమునిచ్చును లోకమందు కృష్యాదికర్మలచేత సస్యాదులనుపుట్టించి దానిచేత భృత్యమూలముగనైనను సాక్షాత్తుగానైనను రాజును సంతోషింపజేసి వానివలననే ఇష్టార్థమును పొందుచున్నాడు ఆప్రకారముగా పరమపురుషుడే ఫలము నిచ్చును

సూత్రార్థము - అత -పరబ్రహ్మకర్మలచేత ఉపాసనచేత ఆరాధితుడై తద్వారా భోగాపవర్గమైన ఫలమునిచ్చును ఎట్లన్న ఉపపత్తే - కర్మ క్షణ ధ్వంసియౌటచేత కాలాంతరములో కల్గెడిఫలం కొరకు ఉత్పాదకముకానేరదు కనుక సర్వజ్ఞుడై సర్వశక్తిగల పరమకరుణాశాలియైన మహా ఉదారత్వముగల అద్యంతరహితుడైన సర్వనియామకుడైన పరబ్రహ్మతన ఆరాధనరూపమైన కర్మచేత పూజచేయబడినవాడై ఫలమునిచ్చునని ముఖ్యమైన ఉపపత్తిగల్గును

352 శ్రుతత్వాచ్చ (3-2-38)

అర్థము - శ్రుతత్వాచ్చ - శ్రుతియందు చెప్పుటవలనను "స వా ఏష మహానజ ఆత్మాన్నాదో వసుదాన ", "ఏష హ్యేవానందయాతి" అని భోగాపవర్గరూపమైనఫలమును పరబ్రహ్మ ఇచ్చునని తెలియబడుచున్నది

353 ధర్మం జైమినిరతఏవ (3-2-39)

అర్థము - అతఏవ - ఉపపత్తివలననే, ధర్మం - యాగాదిధర్మఫలమునిచ్చునని, జైమిని - జైమినులు చెప్పుచున్నారు యాగాదికము ఉపాసనాస్వరూపమైన ధర్మమేఫలమునిచ్చునని జైమిన్యాచార్యులు తెలియుదురు అతఏవ - అనగా ఉపపత్తికి శ్రవణముండుటవలనయని అర్థము లోకమందు మొదలైన కర్మలకు సాక్షాత్తుగాగాని పరంపరచేతగాని ఫలదాతృత్వ దర్శనముండుటవలన వేదమందునను ఇదేప్రకారము యుక్తమని ఉపపత్తిచేయుచున్నది అపూర్వరరూపమైన మార్గంచేతనే సాధన

త్వము ఉపపన్నమగును "యజేత స్వర్గకామ ", "బ్రహ్మవిదాప్నోతిప రమ్" అని కామికి కర్తవ్యత్వముచేత కర్మవిధానంతప్ప మరియొకప్రకారం ఉపపత్తిలేకపోవుటచేత కర్మయే అపూర్వద్వారముగా ఫలసాధనముగా ఫలసాధనమని తెలియబడుచున్నది

354 పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్ (3-2-40)

అర్థము - పూర్వం - పూర్వం చెప్పబడిన, హేతువ్యపదేశాత్ - బ్రహ్మకు జగత్కారణత్వం చెప్పటచే, బాదరాయణః - పరమపురుషుడే ఫలప్రదుడని బాదరాయణులు తెలియుదురు తు శబ్దము పక్షమునకు వ్యావృత్తిజనకము పూర్వమందు చెప్పబడిన పరమపురుషునికే ఫలప్రద త్వమును శ్రేష్ఠులైన బాదరాయణులు తెలియుదురు ఎట్లన్న హేతువ్యపదే శాత్ - "వాయుమేవ స్వేనభాగధేయేనోపధావతి స ఏవైనం భూతిం గమయతి" అని వాయ్వాది స్వరూపముచేతనుండెడు పరమపురుషునికే ఫలప్రదత్వముయొక్క వ్యపదేశము "యోవాయౌ తిష్ఠన్" అని అతడే వాయువునందుండెడువాడని తెలియబడుచున్నది "తదేవాగ్నిస్తద్వాయు స్తత్సూర్యస్తదుచంద్రమా " అని దీనిపరిత్యాగమందపూర్వమునకు ఫలసా ధనత్వకల్పనంచేసిన యెడల శ్రుతమునకు హానియు అశ్రుతమునకు కల్పనయుననగును విధిచే అపేక్షితమైన ఫలసాధనత్వముయొక్కక్రమము వాక్యశేషముచేత తెలియబడినదైనను ఫలసాధనత్వప్రకార - కల్పనము చేయడముయుక్తముకాదు ఎట్లైతే రాత్రియందజ్ఞాదులందు అధికారకల్ప నమో అట్లేయని అర్థము

అధికరణ సంగ్రహము - యాగదానహోమోపాసనాది వైదికకర్మములు క్షణధ్వంసములైనను తజ్జన్యాపూర్వద్వారాభోగాపవర్గరూపసర్వఫలసాధనము లనిశంకించి కర్తవ్యతయా అవగతయా - గోపాసనాదులకున్ను ఫలప్ర దుడు పరమపురుషుడేయని శ్రుతిస్మృతిసిద్ధమైనందుచేత పరమపురు షుడే ఫలప్రదుడని నిర్ణయించబడినది

తృతీయాధ్యాయమున ద్వితీయపాదము ముగిసెను

# తృతీయాధ్యాయము - తృతీయపాదము

83 సర్వవేదాంతప్రత్యయాధికరణము (3-3-1)

355 సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్ (3-3-1)

అర్థము - సర్వవేదాంత - సమస్తవేదాంతశ్రుతులందు, ప్రత్యయం - ప్రతిపాదితమైనది, చోదనాద్యవిశేషాత్ - చోదనము మొదలైనవానికి విశేషములేకపోవుటవలన ఒక్కటనే తెలియవలయును సమస్తవేదాంతము లయందు వినబడేదహరవిద్య ఒక్కటాలేకవిద్యాంతరమా అని సంశయము అవిశేషపునశ్శ్రవణమునకు ప్రకరణాంతరమునకున్ను విద్యాభేదమందు హేతుత్వమువల్ల విద్యాంతరమనిపూర్వపక్షము చోదనఫలసంయోగరూపమైన ఆఖ్యగలవాటికి విశేషములేకపోవుటవల్ల తెలిసేవానివల్ల తిరిగి శ్రవణమునకు ఉపపత్తిగల్గుటచే అంతమాత్రం చేతనే ప్రకరణాంతరత్వములేనిదానివల్ల విద్యలకు ఏకత్వమని

సిద్ధాంతము - విద్యలయందుగుణములయొక్క ఉపక్రమోపసంహారచింతనకొరకు మరోశాఖ యొక్కఅధికరణమునందుచెప్పబడినన్యాయమందు సిద్ధమైనఫలముస్థిరముచేయబడినది

సూత్రార్థము - సమస్తవేదాంతములచేతప్రత్యయమైనది ఒకటైనదహరాద్యుపాసనమే ఎట్లన్న చోదనాదులవలనవిశేషములేకపోవుటచే

356 భేదాన్నేతిచేదేకస్యామపి (3-3-2)

అర్థము - భేదాత్ - భేదముతెలియుటవల్ల, నేతిచేత్ - విద్యలకైక్యములేదని చెప్పగూడదు, ఏకస్యామపి - ఒక్కటైనవిద్యయున్నందున అవిశేషపునశ్రుతిచే విద్యాభేదముతెలియుటవల్ల విద్యకైక్యములేదని చెప్పగూడదు ఒకవిద్యయందును మరోశాఖయందు ప్రతిపత్తిభేదమువల్ల తిరిగిమధ్య ప్రయోజనముగల్గినదేగాని విద్యాభేదములేదు

తాత్పర్యము - శ్రుత్యాదివిద్యలకు భేదముండుటచే విద్యలకు భేదము
గలదు లేదని శంకించి ఒక్కవిద్యయందే శాఖాంతరముల్లో అధ్యేతృభేద
మువల్ల భేదమేకాని విద్యాభేదములేదు "తేషామేవైతాం బ్రహ్మవిద్యాం
వదేత శిరోవ్రతం విధివద్యైస్తుచీర్ణం" అని అథర్వణికులకు శిరోవ్రతము
యొక్క విద్యోపదేశమందు అంగత్వనియమదర్శనము విద్యాభేదమును
చూపుచున్నది విద్యలకు ఐక్యమంటే అథర్వణికులకేయను నియమము
ఉపపన్నముకానేరదు అనిఆసంకచేసి చెప్పుచున్నారు

**357 స్వాధ్యాయస్య తథాత్వేహిసమాచారేఽధికారాచ్చ సవవచ్చతన్నియమ (3-3-3)**

అర్థము - స్వాధ్యాయస్య - స్వాధ్యాయమునకు, తథాత్వేహి - దాని
వల్లపుట్టినసంస్కారప్రాప్తి ఉండినచో దానినియమము, సమాచారే -
గ్రంథవిశేషమందు అధికారాచ్చ - అధికారంవల్ల, సవవత్ - సవహో
...మము మొదలైనవానివలె తన్నియమ - అచ్చట ఆ నియమము సంభవిం
చును శిరోవ్రతము విద్యకంగముగాదు మరేమన్న స్వాధ్యాయస్య తథా
త్వే హి - స్వాధ్యాయమునకు దానివల్ల పుట్టిన సంస్కారప్రాప్తియుండి
పక్షమున దానినియమము "నైతత్ అచీర్ణవ్రతో ధీయతే" అని అధ్యయన
సంబంధమువల్ల గ్రంథవిశేషమందు "ఇదమపి వేదవ్రతేన వ్యాఖ్యాతం"
అని వేదవ్రతత్వము తెలియుటచే "బ్రహ్మవిద్యాం"అనగా వేదవిద్యయని
అర్థము సవవచ్చ తన్నియమ ఏప్రకారం సవహోమములు సప్తసూ
ర్యులు మొదలుగా గల్గిన విశతౌదనపర్యంతములైన అథర్వణిక ఏకాగ్నిసం
బంధులచ్చట ఏమగుచున్నవో ఆ ప్రకారమే ఇదినూ అథర్వణవేదసంబం
ధిత్వముచేత అచ్చటనేయాచున్నవి

**358 దర్శయతి చ (3-3-4)**

అర్థము - దర్శయతిచ - శ్రుతులయందిపంగతి తెలియబడు చున్నది ఉపాసనకుసమస్తవేదాంత ప్రత్యయమును శ్రుతిచూపించుచున్నది ఛాందోగ్యములో దహరవిద్యయందు "తస్మిన్యదంత " అనిచెప్పబడిన అపహతపాప్మత్వాదిగుణాష్టకములను తైత్తిరీయమందు ముఖ్యముగా "తస్మిన్ యదంతస్తదుపాసితవ్యమ్" అనిచెప్పబడినదిగనుక ఉభయస్థల ముందును విద్యకైక్యము సంభవించుచున్నది

359 ఉపసంహారోఽర్థాభేదాద్విధిశేషవత్సమానేచ (3-3-5)

అర్థము - అర్థ - ఉపకారమునకు, అభేధాత్ - భేధము లేకపోవుట వలన, విధిశేషవత్ - విధిశేషత్వము చేత చేయబడిన గుణమునకు వలే, సమానేచ - దహరాద్యుపాసనము సమానమౌచునుండగా, ఉపసంహార - ఉపసంహారము చేయదగినది ఆప్రకారము సమస్త వేదాన్తములందు దహరవిద్యయొక్క యుపాసనము సమానమైన పక్షము ఆయాయుపాసన ములందు ఒక వేదాంతమునందు చెప్పబడిన గుణమునకు అన్య వేదాం తమందుపసంహారము కర్తవ్యము ఏమనగా అర్థభేధాత్ - ఆవిద్యకంగ మౌటవలన యుపకారమునకు అభేధముండును (విధిశేషవత్) ఒక వేదాం తమునందే వైశ్వానర విద్యాదివిధి నిషేధముచే చెప్పబడిన గుణమునకు దాని యుపకారముకొరకు యుపసంహారమగును అప్రకారమే మరియొక వేదాంతమందునుఆవిద్యకు అంగముకావడం అందు విశేషము లేకపో వుట వలన యుపసంహారముయుక్తము
అధికరణ సంగ్రహము - అనేకశాఖాధీతవైశ్వానరాదివిద్యాదులు చోదనా ద్యవిశేషమువల్ల ఏకమని శాఖాంతరాధికరణన్యాయమును పక్ష్యమాణోక్తో పయుక్తంగా విద్యయందు చు పబడినది

84 అన్యథాత్వధికరణము (3-3-2)

360 అన్యథాత్వం శబ్దాదితిచేన్నావిశేషాత్ (3-3-6)

అర్థము - శబ్దాత్ - శబ్దమువల్ల,అన్యథాత్వం - భేదముసంభవించునని, ఇతిచేన్న - అట్లన రాదు, అవిశేషాత్ - విశేషములేకపోవుటచే ఉద్గీథవిద్య ఛందోగులకున్ను వాజులకున్ను ఉన్నది వాజులకైతే "హంతాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామ" అనియారంభించి ఉద్గీథమందు ప్రాణదృష్టిచేత ఉపాసనముశత్రువులకు పరాభవమును కలుగజేయుచున్నది ఛందోగులకున్ను "తద్ధదేవా ఉద్గీథమాజహ్రురనేనైనానభిభవిష్యామ " అనియారంభించి ఉద్గీథమందుప్రాణదృష్టిచే ఉపాసనమే శత్రుపరాభవముఫలించునని చెప్పబడినది రెండుస్థలములందును విద్యకైక్యమా లేక విద్యలకు భేదమాయని సంశయము చోదనాదులకు విశేషములేకపోవుటచే విద్యకైక్యము అని పూర్వపక్షము

సిద్ధాంతము - ఎట్లైనను రెండుస్థలములందును ఉద్గీథయందు ప్రాణదృష్టిచేత ఉపాసనము అవిశిష్టంగా చెప్పబడినది అయినను ఛందోగులకు "ఓమిత్యేతదక్షరం ఉపాసీత" అని ఉపక్రమించి "ఉద్గీథమాజహ్రురనేనైవాభిభవిష్యామ " అని ఉద్గీథావయవమైన ప్రణవమందు ప్రాణదృష్టిచేత ఉపాసనంచెప్పబడినది వాజులకైతే "హంతాసురాన్యజ్ఞే ఉద్గీథేనాత్యయామ" అనేయుపక్రమంచే సమస్తోద్గీథమందును విశేషంలేకనే ప్రాణదృష్టిచేత ఉపాసనము చెప్పబడినది "అథ హ ఏవాయం ముఖ్య ప్రాణస్తముద్గీథముపాసాంచక్రిర" అని ఛందోగులకు ఉద్గానకర్మయందు ఉద్గీథావయవమైన ప్రణవమందు ప్రాణదృష్టియొక్క విధానమువల్ల వాజసమూహములకైతే "అథ హేమమాసన్యం ప్రాణమూచుస్త్వం న ఉద్గాయేతితథేతిభ్య ఏష ప్రాణ ఉదగాయత్" అని సమస్త ఉద్గీథమునకు కర్తయందు ప్రాణదృష్టియొక్క విధానమువల్ల రెండుచోట్లను రూపభేదంచే సంభవించును

సూత్రార్థము - అన్యథాత్వం శబ్దాదితిచేత్ - ఈ సిద్ధాంతచ్ఛాయచే పరిచోదనముచేసి విశేషాత్ అని పూర్వపక్షినిపరిహారముచేయుచున్నారు

అథ హ య ఏవాయంముఖ్య ప్రాణ తముద్గీథముపాసాంచక్రిరే", "అథ

హేమమూపవ్యం ప్రాణమూచుస్త్వం ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయాత్" అనియొకచోట ఉద్గీథమందు ప్రాణదృష్టి శబ్దంవల్లను, రూప మునకు భేదముసంభవించుచున్నదని చెప్పినయెడల రూపభేదము సంభ వించదు ఎట్లన్న అవిశేషాత్ - ఉపక్రమమందు విశేషములేకనే "ఉద్గీథే నాత్యయామ ఉద్గీథమాజహ్రుస్తేనైనానభిభవిష్యామ " అని ఉద్గీథముచే ఉపాస్యత్వప్రతీతయుండుటచే "త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయతి" అని కర్మయందే ఉద్గీథమందు కర్తృత్వము ఉపచరిం పబడుననియుక్తము లేనిపక్షము ఉపక్రమమునకు విరోధముకల్గును

361 నవా ప్రకరణభేదాత్పరో వరీయస్త్వాదివత్ (3–3-7)

అర్థము - ప్రకరణభేదాత్ - ప్రకరణభేదమువల్ల, నవా - ఈ అర్థము సంభవించదు, పరోవరీయస్త్వాదివత్ - పరోవరీయస్త్వము మొదలైన గుణవిశిష్టదృష్టివిధానంవల్ల ఉపాస్యము యొక్క ఐక్యమువల్ల విద్యైక్యమ ననది ఏదికలదో అదిలేదు ఎందువల్లనంటే [ప్రకరణభేదాత్] ఛాందోగ్య మందు "ఓమిత్యేతదక్షరం ఉద్గీథముపాసీత" అని ఉద్గీథమునకు అవయవ భూత ప్రణవమును ఉపాస్యంబుగచెప్పి "ఉద్గీథమాజహ్రుః" అనువాక్యము వల్ల ఉద్గీథమునకు అవయవభూతప్రణవమే చెప్పబడినదని ఉద్గీథశబ్దము చేత తెలియబడుచున్నది వాజసనేయక మునందైతే విశేషంలేకనే "ఉద్గీ థేనాత్యయామ" అని ఉపక్రమంవల్ల సమస్తమైన ఉద్గీథమే ఉపాస్యమని చెప్పబడినది ఆ కారణంవల్ల ఉద్గీథమందు ప్రాణదృష్టికి విశేషంలేకపో యినను రూపభేదంవల్ల విద్యలకు భేదంగల్గును [పరోవరీయస్త్వాదివత్] ఏ ప్రకారమొకశాఖయందే ఉద్గీథమునకవయవమైన ప్రణవమందు పరమా త్మదృష్టిని చేయుటసామ్యమైయుండినను హిరణ్మయపురుషదృష్టివిధా నంవల్ల పరోవరీయస్త్వాదిరూపమైన గుణవిశిష్టదృష్టివిధానము అంతర్గాన మనే రూపభేదమో ఆ ప్రకారమెచ్చటను ఇట్లు ప్రకరణభేదంచేత ఉపక్ర మందొక్కచోట ఉద్గీథావయవమునకు విషయత్వంచేతను మరోచోట సమ

స్తమైన ఉద్గీథమే విషయమనియు ఉపాసనభేదం సిద్ధమౌచుండగా ఉప సంహారమందుండెడు కర్మవిషయము కర్తృవిషయమైన ప్రాణదృష్టివిధానము యథాశ్రుతమగువల్ల అవస్థితముగానేయుండునని అభిప్రాయము

362 సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తితు తదపి (3-3-8)

అర్థము - సంజ్ఞాత - సంజ్ఞకు ఏకత్వంవల్ల, తత్ - విధేయవిద్యకేకత్వంచెప్పినను తదపి - సంజ్ఞకు ఏకత్వమున్న, అస్తితు - విధేయ భేదమునందునను యున్నది ఉద్గీథవిద్యయని సంజ్ఞకు ఏకత్వంవల్ల విధేయవిద్యకేకత్వంచెప్పినపక్షము, తత్ - ఆ సంజ్ఞకేకత్వము విధేయభేమందునను, అస్తితు - ఉన్నదని అర్థము ఏ ప్రకారం నిత్యాగ్నిహోత్రమందు అయనాగ్నిహోత్రమందును ఛాందోగ్యప్రథమప్రపాఠకమందు చేయబడిన అనేకవిద్యలందు ఉద్గీథవిద్యయని సంజ్ఞ జ్ఞకేకత్వమున్నదో

363 వ్యాప్తేశ్చ సమంజసమ్ (3-3-9)

అర్థము - వ్యాప్తేశ్చ - ఉపాస్యత్వవ్యాప్తివల్ల, సమంజసం - యోగ్యము ప్రథమప్రపాఠకం నందు ఉపక్రమమందున్నట్లు ఉత్తరములైన ఉద్గీథవిద్యలందు ఉద్గీథావయవమైన ప్రణవమునకే ఉపాస్యత్వంయొక్క వ్యాప్తికి మధ్యమందెడుదానికి "తద్ధదేవా ఉద్గీథమాజహ్రుః" అని ఉద్గీథ శబ్దమునకు ప్రణవవిషయత్వమే సమంజసము

అధికరణ సంగ్రహము - ఛాందోగ్యవాజసనేయములందు శ్రుతమైన ఉద్గీథవిద్యయందు ప్రాణదృష్ట్యుపాస్తి చోదనాద్యవిశేషముచేత ఏకమని శంకించి ఒకచోట ఉద్గీథావయవమైన ప్రణవమందు ప్రాణదృష్టియును వేరొకచోట కృత్స్నోద్గీథమందు ప్రాణదృష్టియైయుండుటచే రూపభేదాద్విద్యాభేదమని నిర్ణయించబడినది

85 సర్వాభేదాధికరణము (3-3-3)

364 సర్వాభేదాదన్యత్రేమే (3-3-10)

అర్థము - సర్వ - సమస్తమునకు, అభేదాత్ - భేదములేకపోవుట వల్ల, అన్యత్ర - మరో విద్యయందు, ఇమే - ఇది ఉన్నది "యోహవై జ్యేష్ఠంచ శ్రేష్ఠంచ వేద్యజ్యేష్ఠశ్చ హవైశ్రేష్ఠశ్చ భవతి ప్రాణోవావజ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ" అని ఛందోగులకు కౌషీతకులకు ప్రాణవిద్యచెప్పబడినది అచ్చట ఛాందోగ్యమందు, వాజసనేయమందు సమస్తమందు సామ్యముండుటచే ప్రాణవిద్యకు ఏకత్వమని కౌషీతకీ ప్రాణవిద్యకు దానికి భేదముండునా లేదాయని సంశయము భేదము ఉన్నదని పూర్వపక్షము ఎట్లైనను అనిచోట్లను జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యమైనగుణముగలప్రాణమే ఉపాసన చేయదగినది ఐనను ఛందోగులకు వాజసనేయులకు జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యమైనగుణముగలప్రాణానికి వాగాదులనుపొందిన వశిష్ఠత్వము మొదలైన గుణములసంబంధమున్ను శబ్దంవల్లే తెలుస్తోంది కౌషీతకులకైతే అట్లుగాదు రూపభేదంవల్ల విద్యలకు భేదమున్నది

సిద్ధాంతము - కౌషీతకీ ప్రాణవిద్యయందు వాగాదులను పొందిన వశిష్ఠత్వాదిగుణములయొక్క సంబంధమును ప్రాణశబ్దంవల్ల చెప్పబడలేదు అట్లైనను అచ్చట ప్రాణానికి జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యంను చెప్పుట వాగాదులస్థితికిని తత్కార్యములకు ప్రాణాధీనత్వంచేతనని తదవశిష్టమని వాగాదులను పొందిన వశిష్ఠత్వాదులకును ప్రాణహేతుకత్వానుసంధానంచేతవినా జ్యైష్ఠ్యశ్రైష్ఠ్య అనుసంధానముపపన్నంకాదని కౌషీతకీ ప్రాణవిద్యయందు వాగాదులనుపొందినవశిష్ఠత్వాదులకు సంబంధిరైన ప్రాణమే ఉపాసనచేయుతగినదని రూపానికి అభేదమైన విద్యకైక్యంచెప్పబడినది

సూత్రార్థము - [సర్వాభేదాదన్యత్రేమే] అన్యత్ర - కౌషీతకీప్రాణవిద్యలో ఈ వశిష్ఠత్వాదులు ఉండవేయున్నవి ఎందువల్లనంటే సర్వాభేదాత్ - ప్రాణజ్యేష్ఠశ్రైష్ఠ్యయుపపాదనప్రకారమైన సమస్తమునకు అచ్చట భేదం లేకపోవవుటచే వాగాదులస్థితికిని కార్యమునకు ప్రాణము హేతువుగనుక ప్రాణాన్ని జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యంగా ఉపపాదనచేయుబడింది కనుకవాగాదులను

పొందిన కార్యసామర్థ్యరూపవిశిష్టత్వాదులయొక్కసంబంధిత్వం ప్రాణాని కందుముచెప్పబడినదనియర్థము

అధికరణ సంగ్రహము - వాజసనేయఛాందోగ్యములలోను కౌషీతకిబ్రాహ్మణమునందు శ్రుతమైన ప్రాణోపాసనము రూపభేదంచే భిన్నముకావలయును ఛాందోగ్యవాజసనేయముల్లో జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యగుణకమయిన ప్రాణుని వాగాదిగతవశిష్ఠత్వాదిగుణసంబంధిత్వము వినబడుట వలన కౌషీతకిబ్రాహ్మణమునందది వినబడలేదని శంకించి, కౌషీతకమునందు వినబడు ప్రాణునియొక్క జ్యైష్ఠ్యశ్రైష్ఠ్యములు వాగాదిగతవశిష్ఠత్వాదిగుణానుసంధానమునకును సూచనమౌటచే దానియందును వాగాదిగతవశిష్ఠత్వాదిగుసంబంధము ప్రాణునికి సిద్ధించుటచే రూపైక్యమని నిర్ణయించబడినది

**86 ఆనందాద్యధికరణము (3-3-4)**

**365 ఆనందాదయ ప్రధానస్య (3-3-11)**

అర్థము - ప్రధానస్య - బ్రహ్మమునకు సమస్త విద్యలయందేకత్వము వలన ఆనందాదయ - ఆనందము మొదలైన సమస్తమందుపసంహారము చేయదగినది జ్ఞానానందామలత్వ అనంతత్వ రూపములైన బ్రహ్మస్వరూపమును చెప్పెడు గుణములు సమస్త విద్యలయందును ఉపసంహారము చేయదగినవా కాదా యని సంశయము ఉపసంహారముచేయదగినదికాదని పూర్వపక్షము ప్రకరణమందు చెప్పబడినవానికి ఉపసంహారమందు ప్రమాణములేకపోవుటచే బ్రహ్మగుణములకసంఖ్యేయత్వంవల్లను ఉపసంహారమందు శక్తిలేకపోవుటవల్లను

సిద్ధాంతము - జ్ఞానానందాదిగుణములకు బ్రహ్మస్వరూపమునుప్రతిపాదనచేసే సామర్థ్యంచేత ఆ గుణములువినా బ్రహ్మస్వరూపానుసంధానమునకు ఉపపత్తిసంభవింపకపోవుటచే సమస్త విద్యలయందును ఉపసంహారముచేయదగినది

సూత్రార్థము - "సర్వాభేదాదిత్యతోఽభేదాదితివర్తయతే" అనుసూత్రమం దుండెదు అభేదాత్ అనపపదమును అధ్యాహారముచేయతగినది ఆనందము మొదలైనగుణములు అన్నిచోట్లను ఉపసంహారంచేయదగినవి ప్రధానస్య - గుణవంతుడైనబ్రహ్మకు సమస్తవిద్యలందును అభేదంచే సమస్తమైనపరవిద్యలందుబ్రహ్మ యొక్కటియే అనియనుసంధానముచేయతగినది ఏ గుణాలు వినా బ్రహ్మస్వరూపంను అనుసంధించుటకు అవశ్యకమానో ఆ జ్ఞానానందాదులనుసంధానం చేయతగినవియని అర్థము

366 ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే (3-3-12)

అర్థము - ప్రియశిరస్త్వ - ప్రియశిరస్త్వము మొదలైనవాటికి, అప్రాప్తి - ప్రాప్తిలేదు, భేదే - శిర పక్షభేదముగలది స్వరూపమౌచుండగా, ఉపచయాపచయౌహి - వృద్ధిక్షయములు సంభవించును ఆనందాదులప్రాప్తియందును "తస్య ప్రియమేవ శిర మోదో దక్షిణ పక్ష " అని ప్రియశిరస్త్వాదులకు ప్రాప్తిగల్గదు వానికి బ్రహ్మస్వరూపగుణత్వంలేకపోవుటచే బ్రహ్మయొక్క శిర పక్షాదులచేత భేదముకల్గినటువంటిది స్వరూపమౌచుండగా బ్రహ్మకు వృద్ధిక్షీణత్వములు సంభవించనితర్వాత "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "ఆనందోఽజర" అనేశ్రుతులకు విరోధం సంభవించును ప్రియస్త్వాదులకంంంటే ఆనందాదిగుణములకు విశేషమును చెప్పుచున్నారు

367 ఇతరేత్వర్థసామాన్యాత్ (3-3-13)

అర్థము - ఇతరే - ఆనందము మొదలైనవి, అర్థసామాన్యాత్ - బ్రహ్మస్వరూపసామాన్యంచే సమానములు ఇతరే - ఆనందాదిగుణములు, అర్థసామాన్యాత్ - బ్రహ్మస్వరూపసామాన్యంచే సమస్తస్థలములందవర్తించుచున్నది బ్రహ్మయొక్క స్వరూపనిరూపకములైన ధర్మములకనుక బ్రహ్మస్వరూపంతో అవిసమానములు ప్రియస్త్వాదులు మొదలై

సదర్మములు బ్రహ్మస్వరూపం నుచెప్పేదివిగాకపోయినను ఎందుకుచె
ప్పరన్న చెప్పుచున్నారు

368 ఆధ్యానాయ ప్రయోజనాభావాత్ (3-3-14)
అర్థము - ఆధ్యానాయ - అనుచింతనముకొరకు, ప్రయోజనాభావాత్
- మరియొకప్రయోజనం లేకపోవుటచే ధ్యానయానముకొరకు దానినిచెప్ప
డంతప్ప మరోప్రయోజనంలేకపోవుటచే, అనగా "బ్రహ్మవిదాప్నోతిప
రమ్" అని తెలుసుకొనేవరకు యోగ్యముగా ఉపదేశముచేయబడినబ్రహ్మ
ఆనందస్వరూపమైనది ప్రియమోదాదులరూపంచే విభాగంచేసి శిర పక్షా
దులుగా తెల్సుకొని బుద్ధియందు ధ్యానముచేయుటకొరకని అర్థము

369 ఆత్మశబ్దాచ్చ (3-3-15)
అర్థము - ఆత్మశబ్దాచ్చ - ఆత్మశబ్దానికి శ్రవణంవల్లను "అన్యోఽన్తర
ఆత్మా ఆనందమయ" అని ఆత్మశబ్దంవల్ల ప్రియశిరస్త్వం మొదలైన
బ్రహ్మస్వరూపధర్మాలుకావు శిర పక్షాదులున్ను ఆత్మధర్మాలుకావు
తాత్పర్యము - ఆత్మశబ్దమువల్ల ప్రియశిరస్త్వాదులు బ్రహ్మస్వరూపధ
ర్మాలుకావు శిర పక్షాదులు ఆత్మధర్మాలుకావు

370 ఆత్మగృహీతిరితరవదుత్తరాత్ (3-3-16)
అర్థము - ఇతరవదుత్తరాత్ - మరోశ్రుతియందు పరమాత్మను గ్రహిం
చునట్లు, ఆత్మ గృహీతి - ఆత్మశబ్దంచేతపరమాత్మగ్రహించబడును
"అన్యోఽంతరఆత్మా ఆనందమయ" అని ఆత్మశబ్దంచేత పరమాత్మకే
గ్రహణము ఇతరమువలె "ఆత్మా వా ఇదమేకమేవ అగ్ర ఆసీత్" అని
ఆత్మశబ్దంచేత ఏ ప్రకారం పరమాత్మకు గ్రహణమో అప్రకారం ఇదియే
ప్రకారమని తెలియబడుచున్నదనిన, ఉత్తరాత్ - దానికి సమానార్థకమైన
ఉత్తరంవల్ల "సోఽకామయత ప్రజాయేయేతి" అనేవాక్యంవల్ల

**371 అన్వయాదితిచేత్స్యాదవధారణాత్ (3-3-17)**

**అర్థము** - అన్వయాత్ - అన్వయంవల్లనిర్ణయంగలదు ఇతిచేత్ అనియంటే, అవధారణాత్ - నిశ్చయంవల్ల, స్యాత్ - కాను పూర్వమందు "అన్యోంతరాత్మా ప్రాణమయ" ఇత్యాదివాక్యము లందు ఆత్మ స్వాత్మశబ్దములకు అన్వయమువల్ల ఏ ప్రకారం ఉత్తరవాక్యమువల్లనిశ్చయమంటే "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత" అనిప్రకృతుడైన ఆత్మకే ఆనందమయమే కొనగాగల ప్రాణమయాదులందు ఆత్మశబ్దంచేత తెలియుటవల్ల నిశ్చయమౌచున్నది ఆ కారణం చేత ప్రియశిరస్త్వాదులకు ఆత్మధర్మత్వముమబట్టి జ్ఞానానందాదులకాత్మస్వరూపమును చెప్పెడి ధర్మత్వమువల్ల వానికో సర్వత్ర ఉపసంహారము

**తాత్పర్యము** - శ్రుతియందాత్మశబ్దాన్వయమువల్ల ఉత్తరవాక్యనిర్ణయమెటులౌననిశంకించి ఉత్తర వాక్యమందాత్మశబ్దంచేత ప్రాణమయాదులందవధారణమువల్ల నిర్ణయమౌను

**అధికరణ సంగ్రహము** - సత్యజ్ఞానత్వాదిగుణములు ప్రకరణాధీనములైనందున సర్వవిద్యల యందును అనుపసంహార్యంబులనిశంకించి బ్రహ్మస్వరూపమువలె సత్యజ్ఞానత్వాదిగుణములు ప్రకరణాధీనములైనను సర్వవిద్యానుయాయులని నిర్ణయించబడినది

**87 కార్యాఖ్యానాధికరణము (3-3-5)**

**372 కార్యాఖ్యానాదపూర్వమ్ (3-3-18)**

ఛాందోగ్యవాజసనేయములందు శేష్ఠమై శ్రేష్ఠమైనప్రాణమును ఉపాస్యము చేసి "స హోవాచ కింమే వాసోభవిష్యతీత్యాప" అనియుదకములకు ప్రాణవాస్త్వముచెప్పి "తస్మాద్వా ఏతదశిష్యంత పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భి పరిదధతిలంభుకోహవా వాసోభవత్యనగ్నోభవతి" అని ఛాందోగ్యమునందును అప్పులకు ప్రాణవాంస్త్వంచెప్పి "తస్మాదేవం విదశిష్యన్నాచామేదశిత్వా చాచామేదేత మేవతదనమనగ్నంకురుత" అని ఆచమనమనే

ప్రాణమును అనగ్నముగాచేయుబడియని అర్థము ఇచ్చ ఆచమనముకంటే ముందుగానే ఆచమనముప్రాణవిద్యాంగం చేయుబడుచున్నదా లేదా, ఆచమనముచేయుటకు యోగ్యమైన అపాదులకు ప్రాణవాంస్త్వానుసంధానం విధిచేయ బడుచున్నదాయని సంశయము ఆచామేత్ అని ఆచమన ముందు విధిప్రత్యయంయొక్క శ్రవణంవల్ల ప్రాప్తాదాచమనంవల్ల మరోఆచమనము ప్రాణవిద్యకంగముగా చేయుబడుచున్నదని పూర్వపక్షము

సిద్ధాంతము - "అశిత్వాచాచామేత్" అని ఆచమనమిచ్చుటచెప్పబడుచున్నది ఆచమనమునకు యోగ్యమైన అపాదులకిచ్చుట ప్రాణవానసత్వము యొక్క అనుసందానమైతే "ఏతమేవతదన మనగ్నంకురుత" అనితోచుచున్నది ఇచ్చుట ఆచమనమైతే స్మృతిచేత ఆచారప్రాప్తమైనది "అనగ్నంకురుత" అని అనువాదరూపంగా తోచుచున్నది ఇచ్చుట ఆచమనాంతరమునకు కల్పనంవల్ల ఆచమనంచేసేయోగ్యమైన జలమునకు ప్రాణవానస్త్వంయొక్క అనుసంధానము అప్రాప్తమని విధిచేయుబడుచున్నదనియుక్తము "తదనమనగ్నంకురుత" అనెడువాక్కులు అపూరత్వమువలన, "విధిర్వాస్యాదపూర్వత్వాత్" యనే న్యాయముచే విధివచనమౌచున్నది

సూత్రార్థము - అపూర్వం - అప్రాప్తమైన జలమునకు ప్రాణవానస్త్వానుసందానం చేయ దగినది ప్రాప్తమైన ఆచమనము చేయుదగినదికాదు, ఎందుకంటే [కార్యాఖ్యానాత్] కార్యస్య - అప్రాప్తార్థమైనయర్థము అఖ్యముచేయుటము శాస్త్రమునకు స్వభావమౌటచేయని తెలియును అధికరణ సంగ్రహము - ఛాందోగ్యవాజసనేయముల్లో శ్రుతమైనప్రాణవిద్యయందు స్మృత్యాచార ప్రాప్తవచనముకంటే విద్యాగతయా ఆచమనానంతరంవిధించబడుచున్నదనిశంకించి ఆచమనీయ జలాదుల్లో ప్రాణవానస్త్వానుసందానం అంగతయా విధించబడుచున్నదేగాని ఆచమనానంతర విధానపరముగాదని నిర్ణయించబడినది

**373 సమానవివంచాభేదాత్ (3-3-19)**

## అర్థతాత్పర్యములు

అర్థము - సమాన - మనోమయత్వంమొదలైనవిసమానమౌచుండగా విద్యకు ఏకత్వము, వివంచాభేదాత్ - వశిత్వాదులుమొదలైనగుణములచే అభేదమువల్ల, వాజసనేయమందు అగ్ని రహస్యములో బృహదారణ్యకమందు శాండిల్యవిద్యచెప్పబడినది అగ్నిరహస్యంలైతే "స ఆత్మానముపాసీత మనోమయం ప్రాణశరీరం భారూపం సత్యసంకల్పమాకాశమాత్మానమ్" అని బృహదారణ్యకమందును "మనోమయోయం పురుషోభాస్సత్యంతస్మిన్నంతర్హృదయే యథావ్రీహిర్వాయవోవాస ఏష సర్వస్యేశానస్సర్వస్యాధిపతిస్సర్వమిదం ప్రశాస్తితి" ఇచ్చట విద్యలకు భేదమా లేదాయని సంశయము ఒకస్థలమందు సత్యసంకల్పత్వమధికంగా వినబడినది మరోచోట వశిత్వాదులు మొదలైన గుణములు వినబడినవిగనుక రూపభేదంవల్ల విద్యాభేదముచెప్పదగినదనిపూర్వపక్షము

సిద్ధాంతము - ఉభయత్రను మనోమయత్వంసమానమౌచుండగా వశిత్వానికి సత్యసంకల్పత్వం యొక్క విస్తారరూపత్వంచే దానితోయుభయభేదంవల్ల రూపభేదంవలె లేదని విద్యైక్యము

సూత్రార్థము - మనోమత్వాదులు మొదలైనవి సమానమౌచుండగా విద్యలకైక్యము వివంచ అభేదత్వాత్ - వశిత్వాదిగుణాలచే అభేదంవల్ల వశిత్వమనగా సత్యసంకల్పత్వంయొక్క వితతి

అధికరణ సంగ్రహము - వాజసనేయకాగ్నిరహస్యమందును, బృహదారణ్యకమందును శ్రుతమైన శాండిల్యవిద్యయొక్క స్థలమందు సత్యసంకల్పత్వముశ్రుతమై స్థలాంతరమందు వశిత్వాదులు శ్రుతమౌటచే రూపభేదాద్భిన్నమని శంకించి వశిత్వాదులు సత్యసంకల్పత్వ విచ్ఛిత్తిరై రూపభేదములేనందున విద్యైక్యమని నిర్ణయించబడినది

89 సంబంధాధికరణము (3-3-6)

374 సంబంధాదేవమన్యత్రాపి (3-3-20)

అర్థము - ఏవం - ఈ ప్రకారం, అన్యత్రాపి - మరోచోట, సంబంధాత్ - స్థానసంబంధంచే రూపభేదంలేదు, విద్యైక్యము బృహదారణ్యకమందు "య ఏష ఏతస్మిన్మండలే పురుషో యశ్చాయం దక్షిణేక్షన్" అనియుపక్రమించి సూర్యమండలమందు నేత్రమందును ఆ పరబ్రహ్మకు వ్యాహృతి శరీరత్వంచే ఉపాస్యత్వంచెప్పి "తస్యోపనిషదహమిత్యధ్యాత్మం" అని రెండు రహస్యనామాలున్ను ఉపాసనశేషత్వంచే చెప్పబడుచున్నది అవి యథాశ్రుతస్థానంలో నియతములా లేక రెండుస్థానములందు ఒక్కరూపంకే ఉపాస్యత్వంవల్ల విద్యైక్యమని నియమంలేకనే నామములని పూర్వపక్షము అక్ష్యాదిత్యస్థానసంబంధరూపమైన ఆకారభేదంచే రూపభేదమని విద్యాభేదంవల్ల రెండునామధేయములు నియమమని సిద్ధాంతము

సూత్రార్థము - ఏప్రకారం మనోమయత్వంమొదలైన గుణవిశిష్టునికొకనికేయుపాస్యత్వంచేత రెండుచోట్లను విద్యైకత్వమో అదేప్రకారం వేరోచోట అక్ష్యాదిత్యాధారంగాగల ఒకవస్తువుకే స్థానద్వయసంబంధంచే రూపభేదంలేదని విద్యైక్యంవల్ల రెండునామములని నియతములు

తాత్పర్యము - శ్రుతియందు అధిదైవతాధ్యాత్మనామాలు పరబ్రహ్మయందుచెప్పబడుచున్నవి దు అవి స్థానద్వయమందును ఏకరూపమునకేయుపాస్యత్వంచెప్పుటచే విద్యైక్యమనిశంకించి అక్ష్యాదిత్యస్థానరూపాకారభేదంచే రూపభేదమని రెండునామములు నియతములనిసిద్ధాంతము

**375 నవా విశేషాత్ (3-3-21)**

అర్థము - విశేషాత్ - రెండుచోట్లను రూపమునకు విశేషంచెప్పుటచే, నవా - ఇది యుక్తంగాదు విద్యైక్యంవల్ల రెండుచోట్లను రెండునామములు నియతములుకావు ఎట్లన్న విశేషాత్ - రెండుచోట్లరూపంవివక్షచేయబడుచున్నది ఒకచోట మూర్ధాదిరూపస్థాన సంబంధియనియు ఇతరత్ర అక్షిస్థానసంబంధంగల్గినది బ్రహ్మయని రూపభేదంవల్ల విద్యాభేదం అని నామధేయములు నియతములు కావుయను అర్థము సమీచినముకాదు

ఎందువల్లనంటే విశేషాత్ - రెండుచోట్లను రూపము వివక్షచేయబడుచున్నది ఒకస్థలమందు సూర్యాదిరూపస్థాన సంబంధియనియు ఇతరత్ర అక్షిస్థానసంబంధంగల్గినది బ్రహ్మమని రూపభేదంవల్ల విద్యాభేదం అవి నామధేయములు నియతములు

376 దర్శయతి చ (3-3-22)

అర్థము - శ్రుతియందు ఇదేయర్థము దర్శనమౌచున్నది విద్యాభేదంచేత గుణములయొక్క అనుపసంహారమును చూపించుచున్నది "తస్యైతస్య తదేవంరూపం యదముష్యరూపం" ఇత్యాదుల్లో రూపములకు అతిదేశంచేస్వత అప్రాప్తియందును అతిదేశంచేత ప్రాప్తియందపేక్ష అధికరణ సంగ్రహము - ఆదిత్యమండలమందును, అక్షియందును, శ్రుతమైన సత్యశబ్దవాచ్య బ్రహ్మయొక్క వ్యాహృతిశరీరత్వోపాసనం తుల్యమౌటచే అహం అహ అమ రహస్యనామాలు రెండుచోట్లను అనియమేన అన్వితములౌచున్నవని శంకించి అక్ష్యాదిత్యస్థానసంబంధిత్వాకార - భేదంచేత రూపము భిన్నమైవిద్యభేదించుటచే ఉభయనామములు విద్యాద్వయనియతములని నిర్ణయించబడినది

90 సంభృత్యధికరణము (3-3-7)

377 సంభృతిద్యువ్యాప్త్యపిచాత (3-3-23)

అర్థము - అత - ఆకారణంవల్ల, ద్యువ్యాప్తి - అంతరిక్షము మొదలైనవానియందు వ్యాప్తి రూపమైనగుణసమూహంవల్ల నియతమైనది తైత్తిరీయకములో నారాయణానువాకంలో కొన్ని మంత్రాలందు "బ్రహ్మజ్యేష్ఠావీర్యా సంభృతాని బ్రహ్మాగ్రేజ్యేష్ఠందివమాతతానబ్రహ్మభూతానాం ప్రథమోత జజ్ఞే తేనార్హతి బ్రహ్మణాస్పర్ధితుంక" అని బ్రహ్మయందు జ్యేష్ఠమైన గుణములకు అంతరిక్షవ్యాప్తియనెడు గుణసమూహములుచెప్పబడినవి ఈ గుణసమూహాలకు సమస్తవిద్య లయందు ఉపసంహారమూ లేక స్థానవిశేష

పాపనలయందునియమమూయనినంశయం ఆరంభంచేయకనే చెప్పు టచే ఆగుణాలకుపమస్తములందు ఉపసంహారమని పూర్వపక్షము

సిద్ధాంతము - ఎట్టివను స్థానవిశేషసంబంధంగల ఉపాసనమును ఆరంభించి ఇవి చెప్పబడలేదు అల్పస్థానములందు ఉపసంహారముసంభవించ కపోవుటచే దానిసాహచర్యంవల్ల ఇతరములకును అల్పస్థానమందు చేయ బడిన విద్యలయందు ఉపసంహారములేదు

సూత్రార్థము - సంభృతిద్యువ్యాప్తిఽ - సమాహారద్వంద్వముచేత ఏక వద్భావము సంభృతి మొదలైన గుణసమూహము ఈ కారణంవల్ల స్థాన విశేషసంబంధనియమంచే నియతమైనవి సమస్త స్థలములందుపసంహార మునకు యోగ్యంకాదు అంతరిక్షమందు వ్యాప్తియైతే స్వసామర్థ్యంకంటే అల్పస్థానానర్హంబుగ దానికి ఇతరస్థానానికి నియతమైనది సంభృతిరూప గుణమున్న దాని సాహచర్యంవల్ల అటులనే

అధికరణ సంగ్రహము - తైత్తిరీయమందు ఆవారభ్యాధీతమైన సంభృతి ద్యువ్యాప్త్యాదిగుణాలు సర్వవిద్యలందును ఉపసంహార్యంబులని శంకించి అల్పస్థానగోచరాలైన విద్యలందుద్యువ్యాప్తి గుణములు ఉపసంహర్తుం అశక్యంబులౌటచే అల్పస్థానవిషయములైన దహరాది విద్యలందు అనుప సంహార్యములని నిర్ణయించబడినది

91 పురుషవిద్యాధికరణము (3-3-8)

378 పురుషవిద్యాయామపి చేతరేషామనామ్నానాత్ (3-3-24)

అర్థము - పురుషవిద్యాయామపి - పురుషవిద్యయందు రెండుచోట్లను రూపభేదంవల్ల విద్యాభేదమున్ను, ఇతరేషాం - ఇతరశాఖలయందు చెప్పబడినదానికి, అనామ్నానాత్ - ఇతర శాఖలందు కథనంలేకపోవు టచే తైత్తిరీయకమందు పురుషవిద్య చెప్పబడినది "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానశ్శ్రద్ధాపత్నీశరీరమ్"ఇత్యాదుల్లో ఛాందోగ్యము నందును "పురుషోవావయజ్ఞస్తస్య యాని చతుర్వింశతి వర్షాణి" అనియూ

రంభించి వినబడుచున్నది ఇక్కడ విద్యభేదమా లేదాయని సంశయము పురుషవిద్యయని ఏకనామముండుటవల్ల తైత్తిరీయకమందు ఫలసంబంధంచెప్పకపోవుటచే విద్యైక్యమని పూర్వపక్షము

**సిద్ధాంతము** - పరమపురుషవిద్యయనే నామధేయమొక్కటైనను యజ్ఞత్రయకల్పనయొక్క ప్రకారభేదంచేత యజమానుడు పత్న్యాదికల్పనభేదంవల్ల తైత్తిరీయకమందు పూర్వానువాకంను పొందిన "బ్రహ్మణో మహిమానమాప్నోతి" అని బ్రహ్మపలమునకే సన్నిధానముండుటచే ఆ ఫలమునకు తదంగతయా తత్ఫలముచేత ఫలభేదంవల్ల విద్యాభేదము

**సూత్రార్థము** - పరమపురుషవిద్యయందు రెండుచోట్ల రూపభేదంవల్ల విద్యలకు భేదమున్నది ఎట్లన్న ఇతరేషామనామ్నానాత్ - ఇతరశాఖలయందు చెప్పబడినవానికి మరోశాఖయందు చెప్పకపోవుటచే ఛాందోగ్యమందు, తైత్తిరీయకమందు చెప్పబడినయజమానుడు పత్నిమొదలైనవానిని సవనముల్లో చెప్పకపోవుటచే తైత్తిరీయకమందును ఛాందోగ్యమందును చెప్పబడిన యజ్ఞావయవములను చెప్పకపోవుటవల్లననియర్థము తైత్తిరీయకమందు "ఆత్మా యజమాన శ్రద్ధాపత్నీ" అని యజమానాది కల్పనము "యత్ప్రాయం ప్రాతర్మధ్యందినంచ తాని సవనాని" అని సవనత్రయకల్పనమును, ఛాంద్యోగ్యమందు అపేక్షత్వాదులకు దీక్షత్వాదికల్పనమున్న పురుషాయుస్సుకు మూడువిభాగములుగావిభాగించి సవనత్రయమును కల్పనముచేసియున్నది కనుక యజ్ఞావయవకల్పనముయొక్క ప్రకారంభేదంవల్ల రూపభేదంస్పష్టము ఆ ప్రకారమే ఫలము ఇతరేషాం అని ఫలమునకు గ్రహణము

**అధికరణ సంగ్రహణము** - తైత్తిరీయమందు, ఛాందోగ్యమందును శ్రుతమైన పురుషవిద్య సంజ్ఞైక్యంచే ఏకమని శంకించి సవనత్రయ యజమానపత్న్యాదికల్పనప్రకారభేదప్రయుక్తరూప భేదంచేతను శతాయుష్ట్వమోక్షప్రాప్తిరూపఫలభేదంచేతను భిన్నమని నిర్ణయింపబడినది

92 వేదాద్యధికరణము (3-3-9)

379 వేదాద్యర్థభేదాత్ (3-3-25)

అర్థము - వేదాద్యర్థభేదాత్ - వేదాదులయొక్క అర్థభేదంవల్ల అథర్వ ణులు, తైత్తిరీయులు, ఐతరేయులు మొదలగువారు ఉపనిషదారంభ ముందు "శుక్రం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య", "శన్నో మిత్రశ్శంవరుణః", "సహనావవతు" ఇత్యాదిమంత్రములను మహా వ్రతములందు అధ్యయ నము చేయుదురు దీనికి విద్యాంగత్వం గలదా లేదాయని సంశయము సన్నిధి చెప్పుటలే విద్యాంగత్వమని పూర్వపక్షము

సిద్ధాంతము - "శుక్రం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య" ఇత్యాది మంత్ర సామర్థ్యంవల్ల మహా వ్రతాదులైన కర్మలకు శ్రుత్యాదులతోగూడ అభిచా రము, ద్వాదశాహము మొదలైనవానియందు వినియోగమువలె "శన్నోమి త్రశ్శంవరుణః", "సహనావవతు" ఇత్యాదుల్లో మంత్రములకు "ఋతంవది ష్యామి సత్యం వదిష్యామి", "తేజస్వినావధీతమస్తు" అని మంత్రసామ ర్థ్యంవల్ల దానియొక్క అధ్యయనమందు వినియోగమేగాని విద్యాంగత్వం లేదు

సూత్రార్థము - [వేదాద్యర్థభేదాత్] వేదాద్యర్థభేదంవల్ల "సత్యం వది ష్యామి", "తేజస్వినా - వధీతమస్తు" ఇతి, "శంనో మిత్ర" ఇత్యాది మంత్రములకును అధ్యయనసంబంధరూపమైన అర్థభేదంవల్ల విద్యాంగ త్వంలేదని అభిప్రాయము అందువల్ల "శంనో మిత్ర" మొదలైన మంత్ర ములే అధికరణమునకు విషయము

అధికరణ సంగ్రహము - ఉపనిషదారంభంలో అధీతములైన "శంనో మిత్ర" ఇత్యాదిమంత్రములును ప్రవర్గ్యాది కర్మలును విద్యాసన్నిధిసమామ్నాన ముచే విద్యాంగములని శంకించి అర్థసామర్థ్యంచేత అభిచారాధ్యయనా దుల్లో వినియుక్తములౌటచే విద్యాంగములు కావని నిర్ణయించబడినది

93 హాన్యధికరణము (3-3-9)

380 హానౌతు ఉపాయనశబ్దశేషత్వాత్కుశాచ్ఛందస్స్తుత్యుపగానవత్తదుక్తమ్ (3-3-26)

అర్థము - హానౌ - కేవలమోచనము, కేవలోపాయనము వినబడుచుండగా, ఉపాయనశబ్ద - ఉపాయనశబ్దమునకు, శేషత్వాత్ - హానివాక్య శేషత్వంవల్ల పరస్పరంసముచ్చయంకాదగినది, కుశా - కుశాయనెడివాక్యము, స్తుతి - స్తుతివాక్యము, ఛంద - ఛంద అనెడిశబ్దము, ఉపగాన - ఉపగానవాక్యము, వత్ - వీటివలె పరస్పరసముచ్చయము కాదగినదని, తదుక్తం - అటులచెప్పబడినది బ్రహ్మను పొందెడు విద్వాంసునికి పుణ్యపాపములత్యాగము రెండు శాఖలందు వినబడినది విడువబడిన పుణ్యపాపములకు మరోచోట ప్రవేశము ఒకశాఖయందు వినబడినది విమోచనము, ప్రవేశము ఈ రెండున్ను ఒకశాఖయందు వినబడినది "తదా విద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజన పరమం సామ్యముపైతి",

"అశ్వ ఇవ రోమాని విధూయ పాపం
చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య।
ధూత్వా శరీరమకృతం కృతాత్మా
బ్రహ్మ లోకమభిసంభవామి"

అని కేవలమోచనము "తస్య పుత్రాదాయ ముపయంతి సుహృదస్సాధ కృత్యాం ద్విషంత పాపకృత్యామ్" అని కేవలము ప్రవేశము "తత్సుకృత దుష్కృతే విధూనుతే తస్య ప్రియాజ్ఞతయస్సుకృతముపయంతి అప్రియః దుష్కృతమ్" అని రెండు చెప్పబడినది కేవలము హానిచింతనమున్ను ఉపాయచింతనమున్ను ఈ యుభయచింతనము సమస్తవిద్యలయందు వికల్పముచేత అనుష్ఠానమునకు యోగ్యమా లేక సముచ్చయముచేతనా అని సంశయము ఆయా ప్రకారం చెప్పబడినదానికి ప్రయోజనముకొరకు వికల్పమని పూర్వపక్షము

సిద్ధాంతము - పుణ్యపాపప్రవేశమునకు విమోచనాపేక్షచేత మరియొకశాఖయందుండెడు ప్రవేశ వాక్యమునకు శాఖాంతరమందుండెడు విమోచన వాక్యశేషత్వంవల్ల వాక్యద్వయంచే ఏకార్థము చేయుటవల్ల సముచ్చయము ఒకశాఖయందు రెండుచెప్పుట ప్రతిపత్తృభేదముచేత పరిహరింపబడుచున్నది

సూత్రార్థము - [హానౌత్వితి] తు శబ్దము పక్షవ్యావృత్తిచేయుచున్నది హానాయని ప్రదర్శనార్థము కేవలవిమోచనము, కేవలోపాయనము వినబడినదైనను ఈ రెంటికి పరస్పర సముచ్చయము అవశ్యముకాదగినది ఎట్లన్న ఉపాయనశబ్దశేషత్వాత్ - ఉపాయనశబ్దమునకు హానివాక్యశేషత్వం వల్లయని అర్థము వినబడిన పుణ్యపాపములకు ప్రవేశస్థానవాచిత్వం వల్ల ఉపాయనవాక్యమునకు హానివాక్యశేషిత్వంతెలియబడినది ప్రదేశాంతరమందు చెప్పబడిన వాక్యానికి ప్రదేశాంతరమందు ఆమ్నాతమైన వాక్యశేషత్వంగా దృష్టాంతమును చెప్పేవారు [కుశాచ్ఛందస్స్తుత్యుపగానవదితి] ఏ ప్రకారం "వానస్పత్యా కుశా" అని ప్రదేశాంతరంలో ఆమ్నాతమైన వాక్యమునకు "ఔదుంబర్యః కుశా" అని తద్విశేషవాచకమైన ప్రదేశాంతరమందు ఉండెడిదానిని ఏ ప్రకారము "దేవాసురాణాం ఛందోభి" అని ప్రకరణాంతమందు సామాన్యంగా చెప్పబడినదానికి "దేవచ్ఛందాంసి పూర్వమ్" అని తత్క్రమవిశేషవాచియైన మరియొక దేశమందుండెడిదాని ఏ ప్రకారము "హిరణ్యేన షోడశినస్తోత్రముపాకరోతి" అని స్థలాంతరం నందుండెడి దానికి తత్కాలవిశేషవాచకంగా "సమయావిషితే సూర్యే షోడశినస్తోత్రముపా - కరోతి"అని మరియొకచోట ఉండెడుదానిని "ఋత్విజఉపగాయంతి" అని మరోచోటుండెడి దానికి "నాధ్వర్యురుపగాయేత్" అని దానిపర్యుదాసరూపమైన మరోచోటుండెడుదానిని ఈ ప్రకారం ఉపాయనవాక్యమునకు వాక్యశేషత్వంచే గతిసంభవిస్తుండగా

వికల్పము యుక్తంగాదు ఈ యర్థం పూర్వకాండలో చెప్పబడినది "అపితు వాక్యశేషస్యాదన్యాయ్యత్వాదివికల్పస్య" ఈ యర్థాలచేత
అధికరణ సంగ్రహము - పుణ్యపాపములయొక్క హానిచింతనయు ఉపాయనచింతనయు విద్యాంగత్వేన అన్వయించునపుడు వికల్పేన అన్వయించవలెననిశంకించి హాన్యుపాయనములు రెండు ఏకవిషయములౌటచేత సముచ్చయించవలసినదని నిర్ణయించబడినది

94 సాంపరాయాధికరణము (3-3-10)

381 సాంపరాయే తర్తవ్యాభావాత్తథాహ్యన్యే (3-3-27)

అర్థము - సాంపరాయే - దేహవియోగకాలమందు, తర్తవ్యాభావాత్ - దాటదగినకర్మ లేకపోవుటచే చింతించదగినదని, తథాహ్యన్యే - కొన్ని శాఖలాప్రకారం చెప్పును సుకృత దుష్కృతములకు హానిచింతనము దేహవియోగకాలమందు ఏకదేశక్షయమును పొందును మార్గమందు మిగిలినదని ఉభయస్థలములందును చేయతగినదా లేక దేహవియోగకాలమందే సర్వనాశనమును పొందునాయని సంశయము ఉభయస్థలములందును శ్రుతివల్ల దేవయాన మార్గముచేత పోవడానికి అన్యథాయుపపత్తిలేదానివల్ల రెండుచోట్లను అని పూర్వపక్షము "అశ్వ ఇవ రోమాణి విధూయపాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోకం" అని దేహవియోగకాలమందు "స ఆగచ్ఛతి విరజాం నదీం తత్సుకృత దుష్కృతే విధూనుతే" ఇతి మార్గమందు హాని చెప్పుటచేత దేహవియోగకాలంనందుసర్వకర్మ క్షయమైన అనంతరమందే దేవయానంచేత గమనసాధనమైనకర్మ సంభవించదు

సిద్ధాంతము - "తస్య తావదేవచిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే" దేహవియోగాత్ ఊర్ధ్వముఖబ్రహ్మప్రాప్తివ్యతిరేకంచే అనుభవించుటకు యోగ్యమైన పుణ్యపాపాలు లేకపోవుటచే "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం" ఇత్యాదులచే ఏకార్థత్వం సంభవించుటచే మార్గమందు చెప్పబడి

నదైనను "తత్సుకృదుష్కృతే విధూనుత" అనువాక్యము దేహవియోగకాల మందే సంగమంచేయుటకు యోగ్యమని దేహవియోగకాలమందే త్యాగ హానిచింతనంసర్వకర్మక్షయము ఐనను విద్యయొక్క సామర్థ్యంవల్ల దేవ యానంగలమార్గంచేత గమనముయునవన్నమౌను విద్య వ్యత సూక్ష్మశ రీరమునకు ఆరంభం కాకపోయినను సుఖదుఖాదులయనుభవమునకు సాధనమైనస్థూలశరీరంయొక్క సమస్తకర్మలకు విశ్లేషక్షయమైనయనం తరం తనకుఫలభూత మైన బ్రహ్మప్రాప్తిచేయుటకొరకు దేవయానంగల మార్గంచేత పొందించుటకొరకు సూక్ష్మశరీరమును స్థాపనచేయుచున్నది

సూత్రార్థము - సాంపరాయే - దేహవియోగకాలమందే, చింతనీయం - చింతచేసుకొనుటకు యోగ్యమైనటువంటిది ఎట్లన్న, తర్తవ్యాభావాత్ - దేహవియోగమునకంటే అనంతరమందు బ్రహ్మప్రాప్తియొక్క వ్యతిరేకం చేత దాటదగినభోగములేపోవుటవల్ల ఇదేప్రకారం కొన్నిశాఖలు చెప్పు చున్నవి "తస్య తావదేవచిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే" అని "అశరీరం వా వసంతం న ప్రియాప్రియే స్పృశత" అని

తాత్పర్యము - శ్రుతుల్లో సాంపరాయమందు సుకృతదుష్కృతములు నశించునా లేక మార్గమందు నశించునాయని సంశయము దేహవియోగ మునకంటే తరువాత బ్రహ్మప్రాప్తి వ్యతిరిక్తపుణ్యపాపఫలాభావంవల్ల దేహ వియోగకాలమందే సర్వకర్మక్షయమౌను

382 ఛందత ఉభయావిరోధాత్ (3-3-28)

అర్థము - ఉభయ - రెండుశ్రుతులకు, అవిరోధాత్ - విరోధంలేకపో వుటచే, ఛందత - ఇష్టానుసారం సుకృతదుష్కృతేయనెడి వాక్యమున యించతగినది ఈ ప్రకారం అర్థంయొక్క స్వభావంచేత దేహవియోగ కాలమందే విశ్లేషకర్మక్షయముధరింపబడినదాచుంతగా "తత్సుకృత దుష్కృతే విధూనత" అని వాక్యఖండం ఇవిరెంటికి విరోధంకానట్టుగా బుద్ధివల్లనయించదగినది "అశ్వ ఇవ రోమాని విధూయ పాపంధూత్వా

శరీరమశృతమ్", "తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అని ఉభయశ్రుతులకు విరోధంలేకపోవుటచే అనంతరశ్రుతి లోనూ "ఏవం దేవయానం పంథానం" అని ప్రథమశ్రుతిఖండనమువల్ల పూర్వానుగమము చేయదగినదని అర్థము ఇచ్చట విధించుచున్నారు

383 గతేరర్థవత్త్వముభయథాన్యథాహి విరోధ (3-3-29)

అర్థము - గతే - దేవయానంచే గమనశ్రుతికి, ఉభయథా - దేహవి యోగకాలమందు రెండు విధములైన కర్మక్షయమందు, అన్యథాహి - సూక్ష్మశరీరమునకారంభము, విరోధ - విరోధం అగుటచే, అర్థవత్త్వం - ప్రయోజనవత్త్వమౌను దేవయానంచేత గతిశ్రవణంవల్ల ప్రయోజనం గల దేహవియోగకాలమందు మార్గమందుభయథా కర్మమక్షయమైయుండినను అన్యథా దేహ వియోగకాలమందే సర్వకర్మక్షయమైనపక్షము సూక్ష్మశరీర మునకారంభం లేకపోవుటచేత స్థితికి అనుపపత్తిసంభవించును కనుక దేవయానముచేత గమనము చెప్పెడి శ్రుతివిద్ధమౌను పరిహరించుచు న్నారు

384 ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్ (3-3-30)

అర్థము - తల్లక్షణ - అకర్మలబ్ధమైన అర్థప్రయోజనమునకు, ఉపలబ్ధే - ప్రాప్తివల్ల, లోకవత్ - లోకమందువలె, ఉపపన్న - దేవయానమార్గమున పన్నమౌను భగవామని ఉపాసనచేసినవారికి దేహవియోగకాలమందు సమస్తకర్మక్షయమైనతరువాత దేవయానమార్గం ఉపపన్నమగును ఎందు వల్లనంటే [తల్లక్షణార్థోపలబ్ధే] తల్లక్షణార్థ - తజ్జాతీయమైనయర్థం అకర్మ లభ్యమైన అర్థంయొక్క ప్రాప్తియని అర్థము అకర్మలబ్ధమైనయర్థము బ్రహ్మోపాసన చేసినవారికి లభ్యమౌచున్నది "ససర్వాత్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారోభవతి" ఇత్యాదుల్లో [లోకవత్] ఎట్లు లోక

మందు రాజాలననుసరించుచు సామాన్యపురుషులకు అసాధారణము అతి రమణీయములైన అనేకవస్తువులయొక్క ప్రాప్తిగల్గునో అదేప్రకారం సర్వజ్ఞుడై సత్యసంకల్పముగల మహోదారుడైన పరబ్రహ్మను ఉపాసనచేసెడి వారికి సమస్తముసంపన్నంబగుననియర్థము

తాత్పర్యము - భగవదుపాసనచేయువారికి దేహవియోగకాలమందు సర్వకర్మక్షయముండే దేవయానము ఉపపన్నమగును ఎట్లన్న అకర్మలభ్యమైన అర్థంయొక్క ప్రాప్తివల్ల పొందబడు చున్నది ఎట్లన్న రాజాశ్రయులైనవారికి ఇతరపురుషాసాధారణమైన అతిరమణీయార్థసిద్ధివలెనే పరబ్రహ్మోపాసనచేసినవారికి దేహపాతసమయంలో సర్వకర్మక్షయంకల్గుటచే దేహపాతమున కంటే అనంతరమందు కర్మఫలానుభవంలేదని చెప్పుటయుపపన్నముకానేరదు జ్ఞానులైనను వశిష్ఠాదులకు కర్మఫలరూప దేహాంతరంయొక్క సంయోగమున్నను పుత్రజన్మవిపత్త్యాదులందు సుఖదుఃఖానుభవం చూడబడుచున్నదని ఆశంకచేసి చెప్పుచున్నారు

385 యావదధికారమవస్థితిరాధికారికాణామ్ (3-3-31)

అర్థము - అధికారిణాం - అధికారిపురుషులకు, యావదధికారం - అధికారసమాప్తివరకు, అవస్థితి - అధికారమందుండడంగల్గును ఏ జ్ఞానులకు దేహపాతముకంటే అనంతరమర్చిరాది మొదలైనగతిప్రాప్తి మానో ఆ జ్ఞానులకు దేహపాతమునకంటే తర్వాత దాటదగినకర్మఫల భోగము లేకపోవుటవల్ల దేహపాతసమయమునందే సర్వకర్మక్షయమని చెప్పబడినది ఆ అధికారులైన వశిష్ఠాదులకధికారసమాప్తియందు అర్చిరాదిగతియెన్నడుగల్గునో అంతవరకు అధికారం ఉండడమే అధికారమునకు హేతుభూతమైన కర్మకు ఫలదానముకొరకు ఆరబ్ధముండుటచే జ్ఞానికిన్నారంభింపబడిన కర్మఫలానుభవంచేతనే క్షీణమౌను

తాత్పర్యము - వశిష్ఠాదులు అధికారపురుషులౌటచే అధికారసమాప్తి పర్యంతం అర్చిరాదిగతిలేదు

మరేమన్న అధికారమందే స్థితి జ్ఞానులకైతే ఆరబ్ధకర్మ ఫలానుభవంచేతనే క్షీణమౌను

అధికరణ సంగ్రహము - చింతనీయమైన సుకృతదుష్కృతహానోపాయ ములు దేహవియోగ కాలమందు నియమేన రావడంలేదని శంకించి దేహ వియోగవంతరం అనుభావ్యసుఖదుఖాలు లేనందున దేహవియోగకాల మందు నియమేన వచ్చుచున్నదని నిర్ణయించబడినది

95 అనియమాధికరణము (3-3-11)

386 అనియమస్సర్వేషామవిరోధశ్శబ్దానుమానాభ్యామ్ (3 3-32)

అర్థము - సర్వేషాం - సమస్తులకు అర్చిరాదిగతిచేతనే బ్రహ్మప్రాప్తి గమక, అనియమః - నియమములేదు ఎందువల్లననగా శబ్దానుమానాభ్యాం - శ్రుతిస్మృతులవల్ల, అవిరోధ - విరోధంలేదు ఏయుపాసనలయందు ఉపకోసలాదులకు అర్చిరాదికమైన గతిచెప్పబడియున్నదో దానియందు న్నవారికి దానిచేత బ్రహ్మప్రాప్తియూ లేక బ్రహ్మోపాసననిష్ఠులందరికీ సంభవించునాయని సంశయము తన్నిష్ఠులకేనని పూర్వపక్షము ఇతరు లకు ఆ గతిచేత బ్రహ్మప్రాప్తి యందు ప్రమాణంలేకపోవుటవల్ల పంచాగ్ని విద్యయందు సాధారణమైన ఏ వాక్కుగలదో ఆ వాక్కు ఉపకోసలాదివిష యమేనని నిశ్చయింపబడుచున్నది లేనియెడల ఉపకోసలాదులందు చెప్పడానికి వ్యర్థత్వంసంభవించును

సిద్ధాంతము - పంచాగ్నివిద్యయందు "య ఏవం ఏతద్విదు యేచ ఇమేఽరణ్యే శ్రద్ధాముపాసతే తే అర్చిషమభిసంభవంతి" అని సామాన్యంగా సర్వవిషయకమైన గతిశ్రవణము ఉపకోసలాదులకు చెప్పబడినదానిని బాధపెట్టుటకు సమర్థంగాదు సంకోచపెట్టుటయులేదు విద్యలన్నిటికొరకై అనువాదనచేత ఉపపత్తిగల్గును అందుచే సమస్తులు ఆ మార్గంచేతనే బ్రహ్మప్రాప్తిగల్గును

సూత్రార్థము - అనియమస్సర్వేషాం - సమస్తులకు అవిశేషముచే అదే మార్గంచేత బ్రహ్మప్రాప్తి కలదు ఎందువల్లనంటే, అవిరోధాచ్ఛబ్దానుమానాభ్యాం - ఆ ప్రకారంచెప్పినపక్షము శ్రుతిస్మృతులకు విరోధంలేదు శ్రుతులు "యేచేమేఽరణ్యే" ఇవి మొదలైనవి పంచాగ్నివిద్యయందు దృష్టాంతం చెప్పబడినవి స్మృతులు "అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల" ఇవి మొదలైనవి

[illegible] సంగ్రహము - ఏ ఉపాసనసన్నిధానమర్చిరాదిగతిశ్రుతమైయు [illegible] ఉపాసకునకే అర్చిరాదిమార్గం నియతమనిశంకించి సర్వోపాసనవిష్ణు [illegible] అర్చిరాదిమార్గం సాధారణంగా శ్రుతివిహితమగుటచే సమస్తుల [illegible] నియతమని నిర్ణయము

96 అక్షరధ్యధికరణము (3-3-12)

387 అక్షరధియాం త్వవరోధస్సామాన్యతద్భావాభ్యాం ఔపసదవత్తదుక్తమ్ (3-3-33)

అర్థము అక్షర - అక్షరసంబంధమైన, ధియాం - అక్షరత్వాదిబుద్ధు లను, అవరోధ - సర్వ విద్యలయందనుసరణం, సామాన్యం - బ్రహ్మకు [illegible]నత్వంవల్ల తద్భావాభ్యాం - గుణస్వరూపంవల్ల, ఔపసదవత్ - [illegible] మైన మంత్రమువలె తదుక్తం - ప్రథమకాండలో చెప్పబడినది [illegible] దారణ్యకమందు "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్య [illegible] మనస్వహ్రస్వమ్" అని వినబడుచున్నది అల్లే అథర్వణమందును [illegible] యయా తదక్షరమధిగమ్యతే యత్తత్ అద్రేశ్యమగ్రాహ్యమ్" [illegible] ఈ అస్థూలత్వము మొదలైన గుణాలకు సమస్తమైన బ్రహ్మ [illegible] లేక ఎచ్చటవినబడినవో అచ్చటేనాయని సంశ [illegible] విద్యావిశేష రూపముగా వినబడినవానికి సర్వవిద్యాసాధారణత్వము [illegible] ఎచ్చటవినబడినవో అచ్చటనే నియతముగానుండునని [illegible]

[illegible] - అస్థూలత్వాదిగుణాలకు ఆనందాదులవలె బ్రహ్మస్వరూ [illegible] అనుసంధాన అంతర్భావంవల్ల అన్నిచోట్లనూ ఉపసంహారము

కేవలమానందాదులచేతనే బ్రహ్మస్వరూపము ప్రత్యగాత్మకంటే వ్యావృత్తంగాదు ఆజీవునికదే స్వరూపముండును అస్థూలత్వాదులతో గూడిన ఆనందాదులతో బ్రహ్మకు ప్రత్యగాత్మవ్యావృత్తమైనయాకారము ఎట్లైనను స్వభావంగా జీవాత్మ స్థూలత్వాద్యచేతనధర్మములకు సంబంధిగాకపోయినను తత్సంబంధిత్వమునకర్హత్వముండనే యున్నది దానికర్హుడౌటచే పూర్వమందు దానిసంబంధంగల్గియుండెను అందువల్ల బ్రహ్మకు దానికసర్హమైన స్వరూపానుసంధానతయా అస్థూలత్వాదులు అన్నిచోట్లను అనుసంధానమునకు యోగ్యము

సూత్రార్థము - అక్షరధియాం - అక్షరసంబంధమైన అస్థూలత్వాదిబుద్ధులకు సర్వవిద్యలందును, అవరోధ - సంగ్రహణము ఎందుచేతనన్న [సామాన్యతద్భావాభ్యామ్] బ్రహ్మకు అంతటను సమానత్వంచేత బ్రహ్మానుసంధానమందంతర్భావమువల్ల ఈ సామాన్యతద్భావగుణములకు ప్రధానముగాననుసరించియుండతమే స్వభావము [ఔపసదవత్] ఎట్ల జామదగ్న్యచతూరాత్రపురోడాశములకు గుణభూతమైన 'అగ్నేర్హోత్రం వేత్వి" అనేమంత్రం సామవేదమందుండగా సామవేదస్వరంచే నియతమైనను ప్రధానభూతమైనయుపసదనువర్తియౌటచే యాజుర్వైదికత్వంవల్ల ఉపసత్తుకు యాజుర్వైదికమైన ఉపాసుత్వంయొక్కసంబంధంగలదో తద్వదక్షరవిద్యలో సంబంధిత్వంచే చెప్పబడినదౌటచే యావిద్య నియతమైనను ప్రధానముగననుసరించిచెప్పడి స్వభావంగలదౌటచే సర్వవిద్యలందు సంబంధియైనదానికి ప్రథమకాండయందు చెప్పబడినది "గుణముఖ్యవ్యతిక్రమే తదర్థత్వాత్" అని ఇచ్చట చెప్పబడెను

**388 ఇయదామననాత్ (3-3-34)**

అర్థము - ఆమననాత్ - బ్రహ్మానుసంధానరూపహేతువువల్ల, ఇయత్ - అస్థూలత్వాది విశేషితమైన ఆనందాదులేయనుసంధనముచేయదగినది ఇయత్ - అస్థూలత్వాదులచే కూడిన ఆనందదులే అన్నిచోట్లను

అనుసంధానమునకు యోగ్యము ఎట్లన్న ఆమనవార్థేతో - అమననం అభిముఖ్యంచేత, మననము - బ్రహ్మానుసంధానము బ్రహ్మస్వరూప అనుసంధానము దేనిచేతనినా ఉపపన్నముకానేరదోదాన్నె సర్వత్రానుసం ధానం చేయదగినది అన్యమైనది అచ్చటచ్చట ఉండుననియర్థము అధికరణ సంగ్రహము - ప్రపంచప్రత్యనీకతారూపములైన అస్థూలత్వాది ధర్మములు విద్యాంతరరూపభూతగుణములకు విద్యాంతరరూపత్వేప్రమా ణములేనందున ఆనందత్వాదుల వలె స్వరూపనిరూపకంకానందున సర్వ విద్యానుయాయిరూపంకాదు అక్షరవిద్యారూపమాత్రం అయుండునని శంకించి ఆనందత్వాదులవలె చిదచిదాత్మకప్రపంచధర్మభూతస్థూలత్వాది విపరీతమైన అస్థూలత్వాదులున్ను స్వరూపనిరూపకమౌటచేత సర్వవిద్యా నుయాయులని నిర్ణయించబడినది

97 అంతరత్వాధికరణము (3-3-13)

389 అంతరాభూతగ్రామవత్స్వాత్మనోన్యథాభేదానుపపత్తిరితి చేన్నోపదేశ వత్ (3-3-35)

అర్థము - అంతరా - సర్వాంతర అనెడిఉషస్తిప్రశ్న, భూతగ్రామవ త్స్వాత్మనః జీవునికి అని అంగీకరించదగినది, భేదానుపపత్తి - లేకపోయిన ఎడల ప్రశ్నము భేదమునకనుపపత్తియని, ఇతి చేన్న - ఇట్లనగూడదు, ఉపదేశ వత్ - ఉపదేశమువలె ప్రతివచనభేదమునకనుపపత్తిగల్గును బృహదార ణ్యకములో ఉషస్తిప్రశ్నకు ప్రతివచనమందు "యః ప్రాణేనప్రాణితిసత ఆత్మా సర్వాంతరో యోపానేనాపానితి సతఆత్మా" ఇత్యాదులు "అతోన్య దార్త"అనువరకు చెప్పబడినది

అట్లేయనంతరం కహోళప్రశ్నప్రతివచనము "యోశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుం అత్యేతి ఏతం హైతమాత్మానంవిదిత్వ" ఇత్యాది "అతోన్యదార్తం" అనువరకు ఈ రెండు చోట్లను విద్యకొక టాయి లేక విద్యాభేదమాయని సంశయము పూర్వపక్షమందు ప్రాణాదు

లకు హేతువు ప్రత్యగాత్మా ఉత్తరస్థలమందు అశనాయాదులనతిక్రమిం చిన పరమాత్మయని ఉపాస్యమునకు భేదంవల్ల విద్యలకు భేదమని పూర్వపక్షము

సిద్ధాంతము - యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ యఆత్మాసర్వాంతర తస్మై వ్యాకక్షస్వ" అని రెండుచోట్లను ప్రశ్నకు పరమాత్మవిషయత్వముండుట వల్ల ఏకరూపంగలదానిచే సమస్తమైన ప్రాణులయొక్క ప్రాణము అపా నము దీనియందు హేతుత్వంకు అశనాయాదులనతిక్రమించిన భావము నకు ప్రతివచనద్వయంచే తెలియబడినయర్థానికి పరమాత్మయొకని యందే ఉపాస్యం సంభవించుటవల్ల విద్యకు భేదంలేదు

సూత్రార్థము - నడుమ "య ఆత్మా సర్వాంతర ఆత్మా" అని ఉషస్తిప్రశ్న యందు భూతగ్రామం వలె ఆత్మకు ప్రత్యగాత్మకని అంగీకరించదగినది లేనిరెండల ప్రశ్నప్రతివచనభేదంవల్ల అనుపపత్తియనిన ప్రత్యగాత్మ పర మాత్మవిషయకమైనది ఈ ప్రశ్నద్వయంగాదు ఈ రెండు ఉత్తరముల చేత పరమాత్మయొక్కనియందే ముఖ్యోపాస్యం సంభవించుచున్నది [ఉపదేశాత్] "స్థల్లోస్మ్యత తమాదిదేశమప్రాక్ష్య" అనిప్రసక్తమైన సద్విద్య లోనే "భగవాంస్త్వేవమేతద్బ్రవీతి" అని "భూయ ఏవమా భగవాన్విజ్ఞాప యత్" మొదలైన ఆవృత్తిప్రతివచనములభేదము మునకు మాహాత్మ్యవిశే షము ప్రతిపాదనచేయుచున్నది ఇచ్చటనదేప్రకారము అడుగబడిన వారికి భేదపూర్వకప్రతివచనముయొక్క ప్రకారభేదంవల్ల విద్యాభేదంవర్ణన చేయుటకవశ్యమనే శంకకు సమాధానంచెప్పుచున్నారు

390 వ్యతిహారో విశింషంతి హీతరవత్ (3-3-36)

అర్థము - వ్యతిహార - ప్రతివచనమునుపొందునట్లుసంబంధంచేయదగి నది, ఇతరవత్ - సద్విద్యయందువలె, విశింషంతి హి - రెండుచో ట్లను యాజ్ఞవల్క్యప్రతివచనంబ్రహ్మనే స్తోత్రం చేయును "యదేవసాక్షా దపరోక్షాద్బ్రహ్మ య ఆత్మాసర్వాంతర" అనిప్రశ్నించు వారిద్దరి ప్రశ్న

లకు ఏకరూపత్వంచేత ఏకవిషయత్వంనిశ్చయింపబడినదాచుండగా ఈ ఉషస్తికహోళులకు ప్రతివచనంనుపొందినబుద్ధికి పరస్పరక్రియనుచేయదగినది ప్రాణనాదిహేతుత్వబుద్ధిసర్వాంతర విషయమని కహోళువికార్యము అశనాయాదులనతిక్రమించినవాడనెడిబుద్ధి ఉషస్తిచేత చేయ బడినది రెండుచోట్లను యాజ్ఞవల్క్యులవాక్యము ఏకమాన సర్వాంతర ఉపాస్యమని విశేషంగా చెప్పుచున్నది [అతరవత్] ఏప్రకారం భిన్నమైన సద్విద్యయందు సమస్తములైనప్రత్యుత్తరాలు అధికకరుణాశాలిరైన బ్రహ్మవిషయంలో ఆప్రకారము సద్విద్యయందును ఉపాస్యమునకు ప్రశ్నప్రతివచనావృత్తియౌచుండగా ఏ ప్రకారం తెలియబడుచున్నదనగా చెప్పుచున్నారు

391 సైవహి సత్యాదయ (3-3-37)

అర్థము - సైవ - ఆ పరదేవతయే అనువర్తించును, హి - ఏ కారణంవల్ల, సత్యాదయ - సత్యత్వాదులు సమస్తములందు సంహారంచేయబడునో "సేయం తద్దైక్షత" ఇత్యాదుల్లో అపర దేవతయొకటే అనువర్తించును "ఐతదాత్మ్యమిదంసర్వం తత్సత్యం స ఆత్మా తత్వమసి" అని ఆదేశత్వం సమస్తప్రతివచనమందు ఉపసంహారం చేయబడుచున్నది

అధికరణ సంగ్రహము - ఉషస్తికహోళప్రశ్నప్రతివచనముల్లో ప్రాణనాదిహేతుత్వాశయనాద్యతీతత్వరూపోపాస్యాకారభేదంచేత విద్యాభేదమంవిశంకించి ఉభయప్రశ్నమునకు పరమాత్మ విషయమందు భేదంలేనందున ప్రతివచనద్వయగతమైన ఆకారద్వయమున్ను పరమాత్మని యందున పన్నమాటచేత విద్యాభేదంలేదని నిర్ణయించబడినది

98 కామాద్యధికరణము (3-3-14)

392 కామాదీతరత్ర తత్రదాయతనాదిభ్య (3-3-38)

అర్థము - ఇతరత్ర - వాజసనేయకమందు, తత్రచ - ఛాందోగ్యమందు, కామాది - సత్యకామత్వం మొదలైనదేరూపము, ఆయతనాదిభ్యః హృదయాయతనత్వం మొదలైనగుణాలవల్ల ఛాందోగ్యమందు "అథ యదిద మస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకంవేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశస్త స్మిన్యదంతస్తదన్వేష్టవ్యమ్" అనియుపక్రమించి "తద్య ఇహాత్మానమను విద్య వ్రజంతి ఏతాంశ్చ సత్యాన్కామాంస్తేషాం సర్వేషు లోకేషుకామ చారో భవతి" అని, వాజసనేయకమందు "య ఏషోఽంతర్హృదయ ఆకాశస్త స్మిన్ఛేతే సర్వస్యవశీ సర్వస్యేశాన" ఇత్యాదులు రెండుచోట్లను విద్యకైక్యమా లేక భేదమాయని సంశయము రూపభేదంచే విద్యలకు భేదమని పూర్వపక్షము ఎట్లైనను రెండుచోట్లను పరమాత్మేయుపాస్యనయోగ్యుడు ఐనను ఒకచోట ఆకాశశబ్దవాచ్యుడు ఐనపరమాత్మ ఉపాస్యుడు, ఇతరత్ర ఆకాశమందు శయనించియుండెడు పరమాత్మయని రూప భిన్నమగు చున్నది

సిద్ధాంతము - హృదయమే ఆయతనంగాగల సత్యసంకల్పత్వసత్యకామ త్వాదులచే అభేదంవల్ల రెండుచోట్లను తద్విశిష్టుడైన పరమాత్మేయుపా స్యుడని రూపభేదంలేకపోవుటచే విద్యలకు ఏకత్వము ఛాందోగ్యమంధు "దహరోఽస్మిన్నంతర ఆకాశస్తస్మిన్యదంతస్తదన్వేష్టవ్యమ్" అని ఆరంభించి "కిం తదత్రవిద్యత" అని పరిచోదనంచేసి "తస్మిన్కామాస్సమమా హితా", "ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు" అనియారం భించి "సత్యకామస్సత్యసంకల్ప" అనిచెప్పి తద్య ఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్కామాన్" అని ఆకాశశబ్ద నిర్దిష్టుడుపరమాత్మ, ఆతనియంతర్గములైనవి సత్యకామత్వసత్యసంకల్పత్వాపహతపాప్మత్వం మొదలైనగుణములు అందువల్ల హృదయాయతనుడైనపరమాత్మ సత్యకా మత్వాదివిశిష్టుడుగా ఉపాసనచేయదగినవాడని వాక్యంచేత నిర్ణయించబడి నది వాజసనేయకమందు "యఏషోఽంతర్హృద య ఆకాశస్తస్మిన్ శేతే సర్వ స్యవశీ" అనిచెప్పినయెడల వశిత్వమునకు సత్యసంకల్పత్వరూప విశేష

తయా ఆ పరమాత్మ హృదయాయతనసత్యసంకల్పత్వవిశిష్టుడుగా ఉపాసనచేయదగినది ఆ కారణాన్నిబట్టి దహరవిద్యయొక్క పత్యభిజ్ఞానము వల్ల అపరమాత్మ సత్యసంకల్పత్వాది గుణాష్టకావిశిష్టముగా ఉపాసనచేయదగినదని నిశ్చయింపబడినది ఈ విధంగా నిశ్చయించిన అనంతరం ఆకాశమందు శయానమని ఆకాశశబ్దహృదయపుండరీకవర్తియైన ఆకాశవాచకమని రూపమునకభేదంవల్ల విద్యకేకత్వము

సూత్రార్థము - [కామాదీతరత్ర తత్రచ]వాజసనేయఛాందోగ్యములందుసత్యకామత్వంమొదలైనదే రూపము ఎట్లన్న ఆయతనాదిభ్య - హృదయాయతనత్వసత్యసంకల్పత్వవిశేషరూపములైన వశిత్వాదులవల్ల దానికి సహచారియులైన సత్యాకామాదులకు జ్ఞానంకల్గుటచే "పరంజ్యోతి ఉపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యే", "అభయం వై బ్రహ్మభవతి" అని బ్రహ్మప్రాప్తి రూపమైనఫలమొక్కటని విద్యకేకత్వము

"మనసైవానుద్రష్టవ్యంనేహనానాస్తికించన" ఇత్యాదుల్లో పూర్వప్రకృతమైన "స ఏష నేతి నేతి" అని ముందుచెప్పబోవుటవల్ల "సర్వస్యవశీ సర్వస్యేశాన " ఇత్యాదుల్లో తెలియబడిన విశేషణములకు బ్రహ్మస్వరూపం సంభవించదుగనుక ఎట్లు సత్యకామత్వం మొదలైనవానికి మోక్షసాధనోపాసనరూపత్వమనగా చెప్పుచున్నారు

393 ఆదరాదలోప (3-3-39)

అర్థము - ఆదరాత్ - ఆదరంచే చెప్పుటవల్ల, అలోప - వశిత్వంమొదలైన గుణలోపంలేదు వశిత్వంమొదలైనవానికి మరియొప్రమాణంచేత తెలియబడని రూపంగలదానికి శ్రుతియొకటిచేత సమధిగమ్యమైన దానికి ఆదరంచే చెప్పుటచే లోపంలేదు అనగా అప్రతిషేధం అనియర్థము దానికిని బ్రహ్మగుణత్వం అవశ్యంగా ఆశ్రయించదగినది విశేషరహితమైన నిషేధమైతే సకలేతరప్రాప్తవిశేషరూపములైన వస్తువిశేషత

ములు నానాత్వమునకు నిషేధము సమస్తమునకు బ్రహ్మకార్యత్వంచేత బ్రహ్మాత్మకత్వముండుటవల్లయని అభిప్రాయము

సగుణోపాసనకు "స యది త్రిలోకకామో భవతి" అని సాంసారిక మైన ఫలముగోచరించుటచే మోక్షఫలత్వము సంభవించదనెడి పూర్వపక్ష మునకు సమాధానం చెప్పుచున్నారు

394 ఉపస్థితేऽతస్తద్వచనాత్ (3-3-40)

అర్థము - ఉపస్థితే - బ్రహ్మ ఉపసంపత్తియగుచుండగా అత - అకార ణంవల్ల, తద్వచనాత్ - పితృలోకప్రాప్తిచెప్పబడుట

ఉపస్థితి - ఉపస్థానము బ్రహ్మోపసంపత్తి ఉపస్థితే బ్రహ్మోప సంపన్నులైనవారు అగుచుండగా అత - ఆ హేతువువల్ల, తద్వచనాత్ - పితృలోకాది ప్రాప్తివచనముండుటవల్ల అది సాంసారికఫలంకానేరదు మరేమనగా సాక్షాత్తు ముక్తునిఫలమే "తస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే స ఉత్తమ పురుష స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్ రమమాణ స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా నేప జనంస్మరన్నిదం శరీరమ్" అని "సస్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" అనియు నివృత్తావిద్య గలజీవునికి స్వరూపంచేత అభి నిష్పన్నునికే చెప్పబడుచున్నది ఆకారణంవల్ల బ్రహ్మసంపత్తి హేతుక త్వము క్రీడాదులుగా తెలియబడుచున్నది

అధికరణ సంగ్రహము - ఛాందోగ్యమందు వాజసనేయములందు శ్రుత మైన దహరవిద్య అపహతపాప్మత్వవశిత్వాద్యుపాస్యాకారభేదంచేతభిన్న మనిశంకించి వశిత్వాదిగుణములు సత్య సంకల్పత్వాంతర్గతమౌటచేత ఉపాస్యాకారభేదంలేనందునవిద్య అభిన్నమని నిర్ణయించబడినది

99 తన్నిర్ధారణా నియమాధికరణము (3-3-15)

395 తన్నిర్ధారణా నియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలమ్ (3-3-41)

అర్థము - తత్ - ఉద్గీథంయొక్క, నిర్ధారణ - ఉపాసనకు, అనియమ - నియమంలేదు, తద్దృష్టే - నియమంలేదనే ప్రత్యక్షంవల్ల, పృథక్ - ప్రత్యేకంగా అప్రతిబంద - ప్రతిబంధరూపరహితమైన , ఫలం - దానికి ఫలముగుఘ.

ఛాందోగ్యమందు - "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" అని కర్మాంగాశ్రయమైన ఉద్గీథ ఉపాసనము వినబడుచున్నది అది ఆ కర్మ యందు పర్ణతాదువవలె నియమంచేత ఉపాదేయమా లేక గోదహనము వలె అనియమంచేత చేయదగినదాయని సంశయము కర్మాంగాశ్రయ త్వంచేత పర్ణమొదలైనవానివలె అద్వారంగా నిరూఢమైన కార్యంగాగలదౌ టచే "యదేవ విద్యయాకరోతి శ్రద్ధయోపనిదాతదేవ వీర్యవత్తరం భవతి" అని వర్తమానవిర్దేశానికి భిన్నఫలప్రతిపాదకత్వం సంభవించదుగనుక క్రత్వర్థంకొరకు నియమంచేత అంగీకరిచదగినది అని పూర్వపక్షము

సిద్ధాంతము - "తేనోభౌకురుతోయశ్చైతదేవం వేద యశ్చ న వేద" అని ఉద్గీథోపాసనం అవిద్వాంసునికి క్రత్వనుష్ఠానము కనబడుటచే క్రతుఫల మైన స్వర్గాదులకంటే భిన్నమైన వీర్యసామర్థ్యవత్త్వఫలముకల్గినది ఈ ఉపాసనమని గోదోహనాదులవలె అనియమము వర్తమాననిర్దేశమందును అధికారాంతరము నిశ్చయమౌటుండగా రాత్రిసత్రమువలె క్రతువుకధిక వీర్యవత్తరత్వము ఈ యుపాసనకును ఫలమని కల్పించదగినది

సూత్రార్థము - తన్నిర్ధారణా నియమ - నిర్ధారణం నిశ్చయముచే బుద్ధి దారణము, ఉపాసనమనియర్థము, తస్య - ఉద్గీథోపాసనకు నియమము లేదు ఎందువల్లనంటే తద్దృష్టే తేనోభౌకురుత అని అనియమదర్శనము వల్ల దీనిఫలము ప్రత్యేకమైనది అది అప్రతిబంధ రూపము వీర్యవత్త రము అనగా ప్రబలమైన మరియొక కర్మయొక్క ఫలంచేత ఈ కర్మఫ లంకు ప్రతిబంధకము లేకపోవుట అవిలంబితత్వమని అర్థము

అధికరణ సంగ్రహము - ఉద్గీథాద్యుపాసనములు కర్మాంగభూతోద్గీథాద్యా శ్రయములౌటచేత కర్మల్లో నియమేన ఉపసంహార్యములని శంకించి గోదో

హవాదులవలె కామ్యములగుటచేత నియమేన అనుపసంహార్యములని నిర్ణయించబడినది

**100 ప్రధానాధికరణము (3-3-16)**

**396 ప్రధానవదేవ తదుక్తమ్ (3-3-42)**

అర్థము - ప్రధానవదేవ - దానమువలె ఆవృత్తిచేయదగినది
మాత్రార్థము - సర్వపరవిద్యోపాస్యములయొక్క నిర్ధారమమందు లింగ భూయస్త్వమువల్ల ఆయా చిహ్నభూతములైన వాక్యములకు ఆధిక్యం... యని అర్థము ఆ వాక్యములు ప్రకరణముకంటె బలీయమైనవి అదియు పూర్వకాండయందు "శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానామ్" సమవాయమందు పరమునకు దౌర్బల్యము అర్థవిప్రకర్షాత్ అనువాక్యంచేతగూడా చెప్పబడినది ఇట్లు సర్వోపాస్యనిర్ధారణము నిశ్చయింపడినదైనను దహరవిద్యయందు ఇతరే ఉపాస్యతని పద్మకోశప్రతీకాశం అని హృదయాదులను చెప్పుటయుక్తమని అభిప్రాయము
అధికరణ సంగ్రహము - నారాయణానువాకము పూర్వశ్రుతదహరవిద్యోపాస్యవిశేషనిర్ధారకం అని శంకించి ప్రకరణముకంటే బలవత్తరమైన లింగ భూయస్త్వముచేత సర్వవిద్యోపాస్యవిశేష నిర్ధారణమని నిర్ణయించబడినది

**101 లింగభూయస్త్వాధికరణము (3-3-17)**

**397 లింగభూయస్త్వాత్తద్ధిబలీయస్తదపి (3-3-43)**

అర్థము - లింగ - హేతువాక్యములు, భూయస్త్వాత్ - ఆధిక్యంవల్ల, తత్ - ఆవాక్యము, బలీయ - ప్రకరణముకంటే బలబలవత్తరము, తదపి - అదియు పూర్వకాండయందు చెప్పబడినది తైత్తిరీయమందు చెప్పబడిన "సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వసంభువమ్। విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్" అని మొదలుకొని "యోఽక్షరర పర...

స్వారట్" అనువరకూ ఈ ఉపాసనచేత నిశ్చయింపబడినది ఇది పూర్వా నువాకమందు చెప్పబడిన దహరవిద్యయందుపాసనచేయతగిన విశేషనిర్ధారణార్థమా లేక సర్వవేదాంతముల యందు చెప్పబడిన సమస్తపరవిద్యలనుబట్టి ఉపాస్యమైన విశేషార్థముగానున్నదాయని సంశయము దహరవిద్యకానంతర్యంవల్ల దానియందుపాస్యమైన విశేషనిర్ధారణమని పూర్వపక్షము "సహస్రశీర్షం దేవం" అని ద్వితీయయొక్క నిర్దేశమునకు అనంతరమందు చెప్పబడిన ఉపాసనముయొక్క సంబంధమునకే యుక్తత్వమువల్ల

సిద్ధాంతము - పరంబ్రహ్మపరతత్త్వపరంజ్యోతి పరమాత్మాక్షరశివ ...ంబుశబ్దములచే సమస్త పరవిద్యలందుపాసనచేయతగినవాడని అనువ... ...నేసి వాక్యముచేతనే వానికి నారాయణత్వ విధానంవల్ల దానికి ప్రకర...వల్ల బలియమూటచే విద్యోపాస్యనిర్ధారణార్థమనినిశ్చయింపబడు ... "...హస్రశీర్షమ్' అని ద్వితీయయొక్క నిర్దేశము పూర్వమందుం ...ఉపాసనచేసెడు వానితో సంబంధము పొందుచున్నదని కాదు "తస్మి...లత తదుపాసితవ్యమ్" అని కృత్యప్రత్యయముచే కర్మచెప్పబడిన ... అప్పుడు ద్వితీయమునకు నిర్దేశము రానేరదు "నారాయణ పర", ...వ్యాప్య నారాయణ స్థిత" "పరమాత్మా వ్యవస్థిత" ఇత్యాదులచే ఏకార్థత్వంచే ప్రథమార్థమందు ద్వితీయ వచ్చినది

సూత్రార్థము - సర్వపరవిద్యోపాస్యములయొక్క నిర్ధారణమందు లింగభూయస్త్వమువల్ల ఆయా చిహ్నభూతములైన వాక్యములకు ఆధిక్యంవల్ల ... అర్థము ఆ వాక్యములు ప్రకరణం కంటే బలియమైనవి అది పూర్వకాండయందు 'శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానామ్" అని సమవాయమందు పరమునకు దౌర్బల్యము అర్థవిప్రకర్షాత్ అనేవాక్యంచే చెప్పబడినది ఇట్లు సర్వోపాస్యనిర్ధారణము నిశ్చయింపబడినదైనను దహరవిద్యయందు ఇతదేయుపాస్యుడని "పద్మకోశప్రతీకాశమ్" అని హృదయాద...ంన చెప్పటయుక్తమౌనని అభిప్రాయము

అధికరణ సంగ్రహము - నారాయణానువాకం పూర్వప్రకృతదహరవిద్యోపాస్య విశేషనిర్ధారకమని శంకించి ప్రకరణాదప్యలవత్తరమైన లింగభూయస్త్వము చేత సర్వవిద్యోపాస్యవిశేషనిర్ధారణమని నిర్ణయింపబడినది

102 పూర్వవికల్పాధికరణము (3-3-18)

398. పూర్వవికల్ప ప్రకరణాత్స్యాత్క్రియామానసవత్ (3-3-44)

అర్థము - స్యాత్క్రియా - మనశ్చితాదులు క్రియామయక్రత్వంగభూతము లగును ప్రకరణాత్ - ప్రకరణమువల్ల, మానసవత్ - మానసగ్రహణ మువలె, పూర్వవికల్ప -పూర్వఇష్టకచితము తో వికల్పము వాజసనేయ మందు అగ్నిరహస్యంలో "మనశ్చిత్తోవాక్చిత ప్రాణచితశ్చక్షుశ్చిత" ఇత్యా దుల్లో మనశ్చితాదులైన అగ్నులు విద్యారూపములుగా వినబడుచున్నవి ఇవి క్రియా రూపమైన క్రతువుకంగములా విద్యారూపములైన క్రతువుకంగ ములాయని సంశయము ఈప్రకరణమందు విద్యామయమైన క్రతువుకు సంబంధియైన గ్రహస్తోత్రము మొదలైనవానికి దర్శనముండినను క్రతు వుకు విధానములేకపోవుటచే మరియొకఫలప్రతీతిలేకపోవుటచే పూర్వంలో "అసద్వా ఇదమగ్ర ఆసీత్" ఇత్యాదులచే ఇష్టమైన అగ్నికి ప్రకృతత్వంవల్ల మనశ్చితాదులందు వానియొక్క "తేషామేకైక ఏవతావాన్యా వానసాపూ ర్వమ్" అని ఆయా కార్యములయొక్క అతిదేశంచే ఇష్టకచితమైన అగ్నిచే వీనికి వికల్పప్రతీతివల్ల శేషభూతమైన క్రియాస్వరూపమైన క్రత్వనుప్రవేశ ముచే దానికంగభూతములని పూర్వపక్షము

సిద్ధాంతము - "తే హైతే విద్యాచిత ఏవ విద్యయా హైవ త ఏవం విద శ్చితాభవంతి" అని మనశ్చితాదులకు సంపాదకమైన అగ్నిభావముచే విద్యారూపత్వమైనను "తే హైతే విద్యాచిత ఏవ" అనియవధారణశ్రుతి విద్యామయమైన క్రతువుకంగములేయని వీనికి విద్యారూపత్వజ్ఞానమే అర్థ ముగాగలదని నిశ్చయమువల్ల సమీపస్థములైన మానసములకు గ్రహ స్తోత్రంవల్ల క్రతువందములైన వాక్యములచేత చెప్పబడువీనిచే క్రతువ

ర్శనమౌచుండగా "వచనానిత్య పూర్వత్వాత్" అను న్యాయమునుబట్టి మనమ్నా మొదలైనవానికి శేషభూతము విద్యాస్వరూపమైన క్రతువు యొక్క విధికల్పనం చేయబడుచున్నది "శేషామేవైక ఏవ తావాన్యావా నబా పూర్వ" అని అతిదేశన ఇష్టకచితాగ్నికి వ్యశేషిభూతమైన క్రతుద్వార ముచే యేది ఫలమో అదే వీనికి వ్యశేషిభూతమైన విద్యాస్వరూపమైన క్రతుద్వారముగా ఫలమని నిశ్చయింపబడుచున్నది గావున విద్యమయ క్రతువుకు అంగభూతములే మనశ్చితాదులుగదా

సూత్రార్థము - మనశ్చితాది క్రియాస్యాత్ - క్రియామయమైన క్రతువు కంగభూతమనియర్థం ఎట్లన్న ప్రకరణాత్ - పూర్వమందుప్రకృతమైన ఇష్టఖచితమైన అవ్యభిచరితక్రతుసంబంధమైన దానిచే గృహీతమౌటచే దానకంగభూతములైన వీనికి అగ్నిత్వంవల్ల ఆ ఇష్టఖచితమైన దానిచేత వికల్పము విద్యారూపమైన వీనికి క్రియారూపమైన కర్మకు భావమందు విరోధము కాదు ద్వాదశాహమునకు అంగమైన మానసగ్రహమువలె

399 అతిదేశాచ్చ (3-3-45)

అర్థము - అతిదేశాచ్చ - ఇష్టచితకారర్యాతిదేశమువల్ల "శేషామేవైక ఏవతావాన్యావానబా పూర్వ" అని వీనియందు ఇష్టకచితకార్యాతిదేశంవల్ల వీనికి విద్యావికల్పము తోచుచున్నది దానిచేత అవికల్పము చెప్పబడినదై దానికి శేషభూతమైన క్రత్వంగముచేత వినా ఉపపన్నం కానేరదు ఆ కార ణంచే దానికి అంగభూతములగును

400 విద్యైవతు నిర్ధారణాద్దర్శనాచ్చ (3-3-46)

అర్థము - నిర్ధారణాత్ - నిశ్చయమువల్ల, దర్శనాచ్చ - ప్రత్యక్షము వల్ల, విద్యైవ - మనశ్చితాదులు విద్యామయక్రత్వంగభూతములు తు శబ్దము పక్షవ్యావృత్తి చేయుచున్నది మనశ్చితాదులు విద్యరయే విద్యామ యమైన క్రత్వంభూతములనియర్థము ఎట్లన్న నిర్ధారణాత్ - వానికి

విద్యారూపత్వము సిద్ధించపోయినను "తే హై తే విద్యాచిత ఏవ" అని నిర్ధారణము విద్యామయమైన క్రత్వంగభావముచే వీనికి విద్యామయత్వం ఖ్యాపనముకొరకు అచ్చటనే విద్యమయమైన క్రతువుకు దర్శనమువల్ల దానికంగత్వమే వీనికి చూడబడుచున్నది విద్యామయమైన క్రతువు " మనస్సైషు గ్రహా అగృహ్యంత మనసాఽస్తువంత మనసా సంశస" ఇత్యాదుల్లో ఇచ్చట విద్యామయమైన క్రతువుయందు విధిపదమునకు శ్రవణం లేకపోవుటచే, ఫలసంబంధప్రతీతి లేకపోవుటచే ప్రకరణంచేత ఇష్టకచిదాగ్నినిబట్టి ఉపస్థాపితమైన క్రత్వంగము తోచకపోవుటచే, విద్యామయక్రత్వంగము బాధపెట్టుచున్నదని శంకించి చెప్పచున్నారు

401 శ్రుత్యాది బలీయస్త్వాచ్చ న బాధ (3-3-47)

అర్థము - శ్రుత్యాది - శ్రుతిమొదలైనవానికి, బలీయస్త్వాత్ - ప్రకరణంకంటె బలవత్తరంచే, న బాధ - బాధలేదు శ్రుతిమొదలగువానికి ప్రకరణంకంటె బలీయస్త్వముచే శ్రుతిచే తెలియబడిన విద్యామయమైన క్రతువుయందన్వయమునకు ప్రకరణంచే బాధ రానేరదు శ్రుతి ఐతే "తే హై తే విద్యాచిత ఏవ" అని వానిని వివరించుచున్నది "విద్యయా హైవైత ఏవం విదశ్చితా భవంతి" అని లింగవాక్యములు భాష్యమందు చూపించబడినవి ఈప్రకారం తెలిపినవారు మనశ్చక్షురాది వ్యాపారమందు అగ్నిత్వం సంపాదనచేయువారికి మనశ్చిదాదులు విద్యచేత ప్రధానముగా అగ్నికి కల్గుచున్నదని అర్థము "మనస్సైషు గ్రహా అగృహ్యన్త" ఇత్యాదుల్లో విధిపదమునకు శ్రవణంలేకపోవుటచే విద్యామయమైన క్రతువుకు విధిసంభవించదనియు అందుచే అన్వయంసంభవించదనుఆశంకకు సమాధానం చెప్పుచున్నారు

402 అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరపృథక్త్వవద్దృష్టయశ్చ తదుక్తమ్ (3-3-48)

అర్థము - అనుబంధాదిభ్యః - యజ్ఞానుబంధులు మొదలైనవానివల్ల, ప్రజ్ఞాంతరపృథక్త్వవత్ - దహరవిద్యలు మొదలైనవానికి పృథక్త్వమందు భేదము నిశ్చయింపబడుచున్నది దృష్టశ్చ - చూడబడువాని యందును, తదుక్తం - చెప్పబడియున్నది గ్రహస్తోత్రశస్త్రములచేత యజ్ఞానుబంధులైవానిబట్టి ఇష్టకచితాన్వయంగల క్రతువుకంటే అచ్చటవిధింపబడు విద్యామయమైన యాగానికి భేదము తెలియబడుచున్నది ప్రజ్ఞాంతరపృథక్త్వవత్ - ఏ ప్రకారం ప్రజ్ఞాంతరాల్లో దహరవిద్యమొదలైనవానికి పృథక్త్వహేతువునుబట్టి పృథక్త్వమో అదిశబ్దంవల్ల పూర్వం చెప్పబడిన శ్రుత్యాదులు గ్రహింపబడుచున్నవి శ్రుత్యాదులమసంబంధం చేత విద్యామయమైన క్రతువిధికల్పించతగినదనియర్థము అనువాదస్వరూపమైనదానియందు కల్పనచేయబడెడి విధి చూడబడినది "యదేవ విద్యయా కరోతి" ఇత్యాదుల్లో చెప్పబడినది "వచనానిత్వపూర్వత్వాత్" అని ఎచ్చట అతిదేశంవల్ల ఇష్టకచితయజ్ఞమునకు శేషీభూతమైన క్రతువుయొదు అన్వయం అంగీకరించతగినదని చెప్పబడినదో అచ్చట చెప్పచున్నారు

403 న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహి లోకాపత్తి (3-3-49)

అర్థము - సామాన్యాత్ - సామాన్యశబ్దంవల్ల, ఉపలబ్ధే - ప్రత్యక్షమునకు, న - కాదు, మృత్యువత్ - మృత్యుశబ్దంవలె, లోకాపత్తి - లోకప్రాప్తియు, న హి - లేదు అవశ్యంగా అతిదేశంచేత ఇష్టకచితమైన అగ్నితుల్యదేశత్వమందున్న ఆశ్రయించదగినదికాదు సామాన్యమైన ఏదో ఒకదానిచేత అతిదేశమునకు ప్రాప్తికల్గుటచే "స ఏష ఏవ మృత్యుర్య ఏష ఏతస్మిన్మండలే పురుష" అన్నట్లు ఫలసామాన్యంచే అతిదేశమాచున్నది మృత్యులోకాపత్తిని అతిదేశముచేయబడేదిలేదు మరేమంటే మృత్యువువలె సంహారకత్వమే

404 పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధ (3-3-50)

అర్థము - పరేణ - బ్రహ్మణముచే, శబ్దస్య - మనశ్చితాద్యభిధాయి శబ్దమునకు, తాద్విధ్యం - విద్యామయప్రతిపాదకత్వంతెలియబడును అనుబంధ - సంబంధము, భూయస్త్వాత్ - అధిక్యంవల్ల, క్రియతే - చెయబడును పరేణ చ - బ్రాహ్మణముచేతను దీనికి మనశ్చితాదులు చెప్పెడి శబ్దమునకు తాద్విధ్యం - తద్విధత్వము విద్యామయప్రతిపాద కత్వము తెలియబడుచున్నది ఇతరబ్రాహ్మణంచే "అయం వావలోక ఏషోఽగ్నిచితస్తస్యైవ ఏవ" ఇత్యాదులచేత విద్యప్రత్యేకఫలంగలదని విధిం చబడుచున్నది అగ్నిరహస్యమందు క్రియామయములే విధింపబడుచున్న దను నియమములేదనియర్థము క్రియాప్రకరణమందు ఈ మనశ్చితదు లకు సంబంధం సంపాదనీయములైన అగ్ని అంగములకు ఇచ్చటాధిక్యం వల్ల చేయబడుచున్నది ఆ కారణంచే విద్యమయక్రతువుకు అంగభూత ములైనవే మనశ్చితాదులైన అగ్నులు

అధికరణ సంగ్రహము - మనశ్చితాదులైన సాంపాదికాగ్నులు క్రియామయ క్రతువులు ప్రకృతం అగుటచే తదన్వయులై క్రియామయఫలములని శంకించి విద్యామయక్రతువున్ను ప్రకృతమౌటచే విద్యామయక్రత్వన్వయ త్వేన విద్యామయములని నిర్ణయింపబడినవి

103 శరీరేభావాధికరణము (3-3-19)

405 ఏక ఆత్మనశ్శరీరేభావాత్ (3-3-51)

అర్థము - ఏకే - కొన్నిశాఖలు, ఆత్మన - ఆత్మస్వరూపంను అనుసం ధానం చేయదగినదని తెలియజేయును శరీరే - దేహమందుండెడి ఆత్మను, భావాత్ - ఆ ప్రకారం భావించుటచే ప్రత్యాగాత్మకు ఆత్మగా పరమాత్మ ఉపాస్యుడని చెప్పబడుచున్నది "ఆత్మేతిత్వూపగచ్ఛంతి" అని అచ్చట ప్రత్యగాత్మశరీరమందుండెడి వానియొక్క కర్తృత్వభోక్తృత్వము లతో కూడిన రూపానుసంధానానికి యోగ్యమా లేక ప్రజాపతివాక్యమందు

చెప్పబడిన అపహతపాప్మత్వాది గుణాలుగల యథాస్థితమైన రూపాను సంధానంచేయదగినదా యని సంశయము శరీరమందు ఉండెడివానిరూప మెటువంటిదో దాన్నే అనుసంధానం చేయదగినదని పూర్వపక్షము కర్మవి ధులందున్నట్లు ఉపాసనాదివిధులందును అంతమాత్రంచేతనే సాధనా నుష్ఠానఫలానుభవానికి సంభవముండుటచే "యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి" అనియు, "తం యథా యథోపాసత" అనేదానిచే ఏకార్థంగ లదౌటచే పరమాత్మవిషయమగును

సిద్ధాంతము - "తత్త్వమసి", "స త ఆత్మాంతర్యామ్యమృత " అని ప్రత్య గాత్మకు ఆత్మగా పరమాత్మయుపాసనచేయదగినవాడని ప్రత్యగాత్మస్వ రూపమున్నూ ఉపాస్యమందంతర్గతమైనది "పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యత" అని యథావస్థితమైన ఆత్మస్వరూపం గలవానికే బ్రహ్మానుభవంఫలమనెడిదానివల్ల "యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి" అనునది పరమాత్మవిషయమైనదికాదు మరేమంటే ప్రత్యగాత్మ భూతోపాస్యవిషయం అని ప్రజాపతివాక్యమందు చెప్పబడిన యథావస్థిత మైన స్వరూపమే అనుసంధానానికి యోగ్యము లేనిపక్షమున ప్రాప్యోపా స్యములకు ప్రకారభేదంచే "యథాక్రతురస్మిన్" అనేది శ్రుతి విరుద్ధము గును "యజేత స్వర్గకామ" ఇత్యాది కర్మవిధియందు కర్తృస్వరూపం యొక్క అనుసంధానం సాధనాంతర్గతము కాదని విశేషము

సూత్రార్థము - కర్తృత్వాదివిశిష్టమైన ఆత్మస్వరూపమే అనుసంధానం చేయదగినదని కొన్ని శాఖల్లో తెలియబడుచున్నది ఎందుకంటే శరీరమం దుండెడు ఉపాసనార్హమైన ఆత్మకు అట్టి భావం కలిగియుండుటచే

406 వ్యతిరేకస్తద్భావభావిత్వాన్నతూపలబ్ధివత్ (3-3-52)

అర్థము - బ్రహ్మప్రాప్తివలె, తద్భావభావిత్వాత్ - వ్యతిరిక్తస్వరూపప్రా ప్తివల్లయువిభావం న - కర్తృత్వవిశిష్టము అనుసంధానంచేయతగినది

కాదు కర్తృత్వాదివిశిష్టమైన వస్తువున అనుసంధించతగినదికాదు మరే మంటే సాంసారికస్వరూపంవల్ల ముక్తస్వరూపంగలవానికి ఏది వ్యతిరే కమో అది అనుసంధానం చేయతగినది ఎందుకంటే ఆ ప్రకారం ఉపాస నాభావభావిత్వం వల్ల వ్యతిరిక్తమైన స్వరూపప్రాప్తివల్ల "యధా క్రతురస్మిన్ లోకేపురుషో భవతి" అని చెప్పబడినది ఉపలబ్ధివత్ - ఎట్లైతే బ్రహ్మోపలబ్ధి యథావస్థితమైన బ్రహ్మానుసంధానంతో కూడినవానికగునో అప్రకారమే ఆత్మ యొక్క ప్రాప్తియు

అధికరణ సంగ్రహము - పరవిద్యల్లోనూ ఉపాస్యకోట్యనుప్రవిష్ట మైన జీవస్వరూపమందు జ్ఞాతృత్వకర్తృత్వాంశముమాత్రము ఉపాస్యకారకమని శంకించి ప్రాప్యదశలోనుండెడు వాటినంతయు అనుసంధేయమౌటచే అప హతపాప్మత్వాదులున్ను ఉపాస్యాకారమని నిర్ణయించబడినది

104 అఙ్గావబద్ధాధికరణము (3-3-20)

407 అఙ్గావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్ (3-3-53)

అర్థము - అఙ్గావబద్ధాస్తు - అఙ్గబద్ధములైన ఉపాసనలైతే, న శాఖాసు - అదే శాఖలయందు ఉండెడివికావు, ప్రతివేదం - అన్నిశాఖలయందు ఉండెడివికావు "ఓమిత్యేదతక్షరముద్గీథముపాసీత" అని ఉద్గీథది క్రత్వంగా శ్రయములైన ఉపాసనలు వినబడుచున్నది అవి ఏ శాఖలందు వినబడు చున్నవో వానియందే నుండెడివా లేక సమస్తశాఖలందు సంబంధములా యని సంశయము శాఖలందు స్వరభేదంవల్ల ప్రతిశాఖయందును ఉద్గీథ భేదంచేత ఎచ్చట వినబడుచున్నవో అచ్చటనుండునది ఉద్గీథాదులసాన్ని ధ్యమువల్ల దానితో అన్వితములైయుండునని పూర్వపక్షము

సిద్ధాంతము - ఎట్లైతే ఉద్గీథవ్యక్తికి భేదముండినను అట్లు అచ్చటచ్చట ఉద్గీథజాతీయత్వముచే సంబంధంవల్ల సమస్తములకు ఉద్గీథజాతీయత్వ మందు విశేషము లేకపోవుటవల్ల ఉద్గీథ ఉపాసనయనెడి శ్రుతియే సర్వ సంబంధమని సర్వశాఖలయందును కన్పడుచున్నది

సూత్రార్థము - అంగావబద్ధాదులైన ఉపాసనలు ఆ శాఖయందు వ్యవస్థితములు కావు మరేమనిన ప్రతివేదం - సమస్తశాఖలందును కట్టబడుచున్నదనియర్థము హి - హేతు వాచకము ఏ కారణమువలన ఉద్గీథజాతీయత్వమందు విశేషంలేకపోవుటచే సర్వబంధమో అందువల్ల యని అర్థము

408 మంత్రాదివద్వావిరోధః (3-3-54)

అర్థము - మంత్రాదివత్ - మంత్రమువలె, అవిరోధ - విరోధములేదు వా శబ్దము చకారార్థకము ఒక్కొక్కశాఖయందు చెప్పబడిన క్రత్వంగభూతములైన మంత్రాదులు ఏ ప్రకారమో సర్వశాఖలందును క్రతువొకటియగుటచేత సమస్తస్థలమందు సంబంధవిరోధం పొందదో ఆ ప్రకారమే విరోధం లేదు

అధికరణ సంగ్రహము - ఉద్గీథాద్యుపాసనములు స్వరభేదంచేత ఉద్గీథాదులు వేదభిన్నంగా నుండుటవల్ల వ్యవస్థితములని శంకించి భిన్నస్వరసంతములైన సర్వోద్గీథములున్ను "ఉద్గీథముపాసీత" అనుచోట సామాన్యత ఉపాసనావిషయంగా చెప్పుటచే ఉపాసనములకు వ్యవస్థలేకనే సర్వోద్గీథసంబంధమున్నదని నిర్ణయించబడినది

105 భూమ్న జ్యాయస్త్వాధికరణము (3-3-21)

409 భూమ్న క్రతువజ్జ్యాయస్త్వం తథా హి దర్శయతి (3-3-55)

అర్థము - భూమ్న - సమస్తోపాసనమునకు, జ్యాయస్త్వం - అధిక్యముండును, క్రతువత్త్వం - క్రతువువలె, తథా - ఆప్రకారము, దర్శయతి - శ్రుతిచూపించును వైశ్వానర విద్యయందు స్వర్గలోక ఆదిత్యవాయువు ఆకాశభూములే అవయవములుగాగల వైశ్వానర స్వరూపమైన ఆత్మ ఉపాసన చేయతగినవాడని వినబడినది అచ్చట వ్యస్తునియొక్క ఉపాసన చేయుతగినదా లేక వ్యస్తవస్తువుయొక్క వ్యస్తసమస్తులయొక్క ఉపాసన చేయుతగినదా లేక సమస్తుయొక్కవాయని సంశయము "కావమన్యవకం

త్వమాత్మానముపాస్స ఇతి దివమేవ భగవో రాజన్" ఇత్యాదుల్లో స్వర్లోకమునుండి పృథివికొవరైయునవానికి వైశ్వానరస్వరూపపరబ్రహ్మయొక్క శిరస్సునుండు పాదముకొనవరకు అవయవత్వముచెప్పిఆయా స్థలమందు వ్యస్తమునకే ఉపాసనఫలము విహితమని చెప్పినపిమ్మట "యస్త్వేతమేవం ప్రాదేశమాత్రం అభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే" అని పూర్వము చెప్పబడినదానికి సమానముగా ఉపసంహారమునడము యుక్తము అందువలన వ్యస్తమునే ఉపాసనము చేయతగినదని మొదటి పక్షము సమస్తోపాసనకు "సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి" అని వ్యస్తోపాసనఫలంకంటే ఫలాంతరం చెప్పటముబట్టి వ్యస్త సమస్తపదములకు ఉపాసనచేయతగినదని రెండవపక్షము

సిద్ధాంతము - "ఆత్మానం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి" అనియారంభించి వైశ్వానరాత్మ స్వర్గాది పృథివ్యంతవస్తువులకు మూర్ధాది పాదాంతావయవత్వంమచెప్పి "యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే" అని ఉపసంహారంవల్ల ఐక్యమై త్రిలోకశరీరకుడై వైశ్వానరాత్మస్వరూపుడైన పరబ్రహ్మయొక్క ఉపాసనము విధించి ఫలమున్ను "సర్వేష్వాత్మస్వన్నమత్తి" అనియు, తద్యథేషీకతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మాన ప్రదూయంత" అనియు సమస్తాత్మలకు విశేషంలేకనే భోగ్యభూతుడైన పరబ్రహ్మను అనుభవింపచేయుచున్నది తద్విరోధులైన సమస్త పాపములను దహింపచేయుచున్నదని చెప్పియున్నదని తెలియబడుచున్నది అందుచే ఏకవాక్యంసంభవించుటచేత సమస్తంయొక్క ఉపాసనచేయతగినది, వ్యస్తవాదములైతే స్వర్లోకాదులకు మూర్ధాది అవయవత్వజ్ఞానార్థం ఆయా స్థలమందు ఫలవాదం "వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్పుత్రే జాతే యదష్టాకపాలో భవతి" అని చూడదగినది

సూత్రార్థము - భూమ్నోజ్యాయస్త్వం - సమస్తోపాసనకు శ్రేష్ఠత్వము ప్రామాణికత్వమని అర్థము ఏకవాక్యత్వావగతే - వ్యస్తవాదము క్రతువు వలె చూడదగినది "వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేద్యదష్టకపాలమ్" అని క్రతువన్నట్లు అర్థము అవిధంగా తెలియజేయుచున్నది సమస్తోపాసనమునకు శ్రేష్ఠ్యముగలదని శ్రుతి చెప్పుచున్నది "మూర్ధా తే వ్యపతిష్యద్యన్మాంనా గమిష్య" ఇత్యాదులచే వ్యస్తోపాసనకర్థను చెప్పుచున్నది

అధికరణ సంగ్రహము - వైశ్వానరోపాసనమందు స్వర్లోకాదిత్యవాయ్వాకాశపృథివ్యవయవుడు అయిన వైశ్వానరుడు ఉపాస్యతయా శ్రుతుడైయుంటున్నాడు అచ్చోటు ఉపమన్యవాదులను గురించి కేకయుడు స్వర్లోకాదులలో నొకమునే ఉపాస్యముగా చెప్పుటచే వ్యస్తమే ఉపాస్యంగా సమస్తోపాసనకు సర్వాత్మవర్తియైన బ్రహ్మానుభవమును ఫలంగా చెప్పుటచేత సమస్తవ్యస్తములు రెండున్నుకూడా ఉపాస్యములని శంకించి ఉపక్రమోపసంహారముల్లో సమస్తోపాసనమువిధించుటచేత వ్యస్తోపాసనమందు తద్విధికి తాత్పర్యంలేనందున సమస్తమే ఉపాస్యమని నిర్ణయించబడినది

106 శబ్దాది భేదాధికరణము (3-3-22)

410 నానాశబ్దాది భేదాత్ (3-3-56)

అర్థము - నానా - సద్విద్యలు మొదలైనవి అనేకములు, శబ్దాదిభేదాత్ - శబ్దాదులకు భేదంవల్ల సద్విద్య, దహరవిద్య, శాండిల్యవిద్య, భూమవిద్య మొదలైన బ్రహ్మోపాసనరూపములై బ్రహ్మప్రాప్తిఫలములైనవి ఏకవిద్యయా లేక అనే విద్యలాయని సంశయము బ్రహ్మోపాసనకు ఫలమేకముగాయుండుటచే "వేద", "ఉపాసీత" యని పర్యాయపదములుండుటచే ఏకవిద్యయని పూర్వపక్షము బ్రహ్మకు ఏకత్వముండినను జగదేకకారణత్వాపహతపాప్మత్వాది అనుబంధభేదహేతువువల్ల పూర్వకాండయందు చెప్పబడిన అనుబంధభేదహేతువులనుబట్టి శబ్దాంతరములనుబట్టి అనుబంధభేదములని సిద్ధాంతము శబ్దాంతరములచేత అచ్చట చెప్పబడినవా

నిచేత విద్యాభేదం సిద్ధమైనను తిరిగి ఇక్కడచెప్పుట బ్రహ్మప్రాప్తిహేతువు లైన వేదాంతమందు చెప్పబడినజ్ఞానము విధేయంకాదనే కుదృష్టులనిరా సముకొరకు

సూత్రార్థము - సద్విద్య, దహరవిద్య, భూమవిద్య మొదలైనవి నానా భూతములు బ్రహ్మకు ఏకత్వముండినను సద్యాపమపహతపాప్మత్వాది శబ్దములకు భేదముండుటచే ఆదిశబ్దంచే అభ్యాసము సంఖ్యగుణప్రక్రియ నామధేయములను గ్రహింపబడుచున్నవి

అధికరణ సంగ్రహము - దహరశాండిల్యాది విద్యలకు భేదంలేదు ఉపాస్య బ్రహ్మమున్ను తత్ ప్రాప్తిఫలరూపమున్ను ఏకరూపమౌటచేతననిశంకించి జగదేకకారణత్వాపహతపాప్మత్వాది అనుబంధభేదమువల్ల విద్య అనేకము లని నిర్ణయింపబడినది

108 వికల్పాధికరణము (3-3-23)

411 వికల్పో విశిష్టఫలత్వాత్ (3-3-57)

అర్థము - వికల్ప - సమస్తవిద్యలకు వికల్పము, అవశిష్టఫలత్వాత్ అఖండబ్రహ్మఫలకం వలన సద్విద్యభూమవిద్యాదులకు బ్రహ్మప్రాప్తిజన కము ఏకపురుషునియందు సముచ్చయం అగుచున్నదా లేదాయని సంశ యము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసజ్యోతిష్టోమాదులకు స్వర్గైకఫల ముగా అచ్చట అధికాపేక్షగా ఏకపురుషునియందే సముచ్చయమెట్లుచూ డబడునో ఆ ప్రకారమచ్చట బ్రహ్మానుభవమునకు భూయస్త్వాపేక్షచేత ఒకపురుషునియందే సముచ్చయము సంభవిస్తున్నదని పూర్వపక్షము దేశ మువలన కాలమువలన స్వరూపమువలన అవచ్ఛిన్నము కాని ఆనందస్వ రూపమైన బ్రహ్మానుభవమే సమస్తములైన పరవిద్యకు ఫలము అట్టి ఏక విద్య చేతనే పొందబడుచుండగా ఒకపురుషునియందు మరియొకవిద్యకు సముచ్చయములేదు ప్రయోజనం లేకపోవుటచే సమస్తములకు వికల్ప మని సిద్ధాంతము

**412** కామ్యాస్తు యథా కామం సముచ్చీయేరన్న వా పూర్వహేత్వభావాత్ (3-3-58)

అర్థము - కామ్యాస్తు - కామ్యకర్మలైతే, యథాకామం - కామమును అతిక్రమించనట్లుగా, సముచ్చీయేరన్ - వికల్పసముచ్చయములను పొందును, పూర్వహేత్వభావాత్ - చెప్పబడిన హేతువులేకపోవుటచే బ్రహ్మప్రాప్తికంటే వ్యతిరిక్తఫలజనకములైన విద్యలు కామ్యములు అవి యైతే యథా కామముగా సముచ్చయము పొందును వికల్పమును పొందును పూర్వకారణములేనిదానివల్ల ఆ ఫలమునకపరిమితత్వము లేక పోవుటచే భూయస్త్వాపేక్షచేత సముచ్చయము సంభవిస్తుందనియర్థము

అధికరణ సంగ్రహము - అగ్నిహోత్రదర్శపూర్ణమాసాదులు స్వర్గైకఫలము లుగానుండినను తద్భూయస్త్వాపేక్షగల పురుషునియందు సముచ్చయ ముగలిగియుండినటుల బ్రహ్మానుభవ భూయస్త్వాపేక్షయుండిన పురుషుని యందు బ్రహ్మవిద్యలకు సముచ్చయము గూడునని శంకించి బ్రహ్మాను భవమందు తారతమ్యములేనందున తారతమ్యముగల స్వర్గసాధనీభూత జ్యోతిష్టోమన్యాయమిచ్చట ప్రసరించనందున సముచ్చయముకూడదని పరి హరింపబడినది

**108** యథాశ్రయభావాధికరణము (3-3-23)

**413** అంగేషు యథాశ్రయభావ (3-3-59)

అర్థము - అంగేషు - ఉద్గీథాదులందాశ్రితములైన ఉపాసనలకు, యథా - ఏ ప్రకారం, ఆశ్రయభావ - అంగత్వమా కర్మాంగమునకాశ్రయములైన ఉద్గీథాదులయుపాసనకు గోదోహనాదులవలె అధికారాంతరత్వంచేత పూర్వంచెప్పబడిన ఉపాదాననియమము సంభవించుచున్నదా లేదాయని సంశయము సంభవించదని పూర్వపక్షము "ఉద్గీథముపాసీత" అనెడి ఉపాసనవిధియందు ఫలాంతరమునకు శ్రవణంలేకపోవుటచే తెలియబడిన ఉద్గీథసంబంధమైన క్రతువుకంగత్వం చెప్పటమందు విరోధంలేకపోవుట

చేతను  ఈ ప్రకారం విధివాక్యంచేతనే క్రత్వంగభావం తెలియబడుచుండగా "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదాతదేవ వీర్యవత్తరం భవతి" తేనోభౌ కురుత" అనియు వర్తమాన నిర్దేశము "న స పాపం శ్లోకం శ్రుణోతి" అన్నట్లు అర్థవాదమాత్రమేయగును

సిద్ధాంతము - "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అని విద్యలకు క్రతువుయొక్క వీర్యవత్తరంగురించి సాక్షాత్తుగా సాధనత్వభావం తెలియబడుచున్నది  ఈ ప్రకారం ఫలసాధనత్వంచేత తెలియబడిన విద్యనాశ్రయించి ఫలమును చేయుచున్నదా లేదాయను అపేక్షయందు "ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత" అని ఉద్గీథమునాశ్రయించి కుర్యాత్ - అని క్రత్వంగమైన ఉద్గీథకు ఆశ్రయత్వంమాత్రమే తోచుచున్నది ఆ కారణంచే ఫలాంతరహేతువుచే తెలియబడినదానికి క్రత్వంగమూ ఉపపన్నంకాదని గోదోహనాదులవలె ఉపాదానమునకు నియమము విధించదు "యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపం శ్లోకం శ్రుణోతి" అనుచోట పర్ణతకు జుహూసంబంధంకంటే పూర్వం పాపశ్లోకశ్రవణంగురించి సాక్షాత్తుగా సాధనాభావం వినబడదిలేదు పర్ణతాసంబంధంగల పురుషుని యొక్క సంబంధం మాత్రమే వినబడినది అది "పర్ణమయీజుహూ" అను శ్రుతిచే ప్రథమమందు తెలియబడిన క్రత్వంగమును అర్థగించదు అర్థవాదమాత్రమని విశేషము

సూత్రార్థము - అంగేషు - ఉద్గీథాదులందాశ్రితములైన ఉపాసనలకు ఏ రీతిన ఆశ్రయత్వమో అట్లే ఉద్గీథాదులవలె అంగత్వం గోదోహనాదులవలె ఆ వాక్యమందు ఫల సంబంధమునకు శ్రవణం లేకపోవుటచే అంగభావంవిరుద్ధం కాదనియర్థము

**414 శిష్టేశ్చ (3-3-60)**

అర్థము - శిష్టేశ్చ - శాసనమువలన శిష్టి - శాసనము, విధానమని యర్థము "ఉద్గీథముపాసీత" అని విధానమందు వర్తమాననిర్దేశంవల్ల తెలి

యుబడినసంబంధంకంటే పూర్వమందు ఉద్గీథసంబంధం తెలియబడినదని దాని అంగభావము విరోధమును పొందదు అందువలన ఉపాదానమునకు నియమములగును

415 సమాహారాత్ (3-3-61)

అర్థము - సమాహారాత్ - సమాహరతి యనెడు వాక్యమువలన ఈ కారణంవలన "హోతృషదనాద్ధైవాపి దురుద్గీథమనుసమాహరతి" అని ఉద్గీథభేదనముయొక్క త్యాగమందు అన్యంచేత సమాధానంచెప్పినదై వేదనమునకు ఉపాదాననియమమును చూపుచున్నది దురుద్గీథం వేదవిహీనమైన ఉద్గీథము

416 గుణసాధారణ్యశ్రుతేశ్చ (3-3-62)

అర్థము - గుణ - ప్రణవగుణత్వంచేత తెలియబడినదానికి, సాధారణ్య - సాధారణ్యత్వము, శ్రుతేశ్చ - శ్రవణంవల్ల దీనివల్ల ఉపాదానం యొక్క నియమంతెలియుచున్నది ప్రణవ గుణత్వంచేత తెలియబడిన యుపాసనకు సాధారణ్యం వినబడుచున్నది "తేనేయం త్రయీ విద్యా వర్తతే ఓమిత్యాశ్రావయత్యోమితి శంసత్యోమిత్యుద్గాయతి" అని వేద - ప్రకృతమైనదానికి బోధకత్వంవల్ల ఉపాసనసహితమైన దానియందు ప్రణవము అన్నిచోట్లనూ సంచరిస్తుంది అందువలన ప్రణవమునకు సహభావనియమదర్శనమువల్ల ఉపాదాననియమం నిశ్చయింపబడుచున్నది

417 న వా తత్సహభావాశ్రుతే (3-3-63)

అర్థము - నవా - అంగీకారనియమంలేదు, తత్సహభావ - క్రత్వంగభావమునకు, అశ్రుతే - వినబడకపోవుటచే ఉపాదాననియమములేదు తత్సహభావాశ్రుతే - క్రత్వంగభావమునకు శ్రవణం లేకపోవుటచే అని యర్థము క్రత్వంగభావమనగా సహభావము "యదేవ విద్యయా కరోతి

తదేవ వీర్యవత్తరం భవతి" అని వీర్యవత్తరమునకు సాధనముగా తెలియబడినవిద్యకు క్రత్వంగంచేత వినియోగం సంభవించును అట్టి అంగభావము ఏర్పడేదిలేదు ఏ స్థలమందు సాక్షాత్తుగా ఫలసాధనత్వము ప్రతిపాదనచేయబడుచున్నదో అచ్చట ఫలసాధనత్వము ప్రథమంగా తోచుచున్నది వానికి క్రత్వంగంచేత వినియోగం సంభవించదని అభిప్రాయము

**418 దర్శనాచ్చ (3-3-64)**

అర్థము - దర్శనాచ్చ - వేదనాభావప్రత్యక్షమువలన "ఏవం విద్ధ వా బ్రహ్మయజ్ఞం యజమానం సర్వాంశ్చ ఋత్విజోऽభిరక్షతి" అని బ్రహ్మయొక్క వేదనముచే యజ్ఞమునకు, యజమానునికి ఋత్విక్కులకు సంరక్షణమును చెప్పుచూ ఇతరులకు వేదనాభావమును చూపించుచున్నది అది ఉద్గీథోపాసనకు అంగత్వము లేకపోవుటయందే ఉపపన్నముగును కనుక ఉపాదానంయొక్క అనియమము విదితము

అధికరణ సంగ్రహము - నిరూపించిన ఉద్గీథాద్యుపాసనయొక్క కామ్యతయా అనియతికి హేతువైన ఫలసాధనత్వము నిరూపణచేయబడినది ఇట్లు షట్త్రింశత్యధికరణాత్మకమైన ఈ పాదమందు ద్వితీయతృతీయ పంచమ, సప్తదశ, వింశషడ్వింశాధికరణములలో సంగతివి విశేషంవల్ల క్షుద్రోపాసనలు నిరూపింపబడినవి అవశిష్టాధికరణవింశతియందు బ్రహ్మోపాసనప్రకారము నిరూపణమైనది ఇందునను ధర్మిస్వరూపమువలే స్వరూపనిరూపకములైన జ్ఞానానందాదులు ప్రపంచప్రత్యనీకతారూపమైన అస్థూలత్వాదుగుణములు సర్వవిద్యానుయాయుపాసనములు చతుర్థాధికరణములో నిర్ణయమైన ఏకోనవింశతియందు లింగభూయస్త్వమువలన నారాయణానువాకప్రతిపాద్యుడయిన దేవతా విశేషమే తత్త్వవిద్యా ప్రతినియతా గుణవిశిష్టుడై సర్వవిద్యావేద్యుడౌతాడని నిర్ణయించబడినది అవశిష్టసప్తదశ అధికరణములలోనూ గుణోపసంహారాదు ఫలక విద్యాభేదాభేదములు నిరూపింపబడినది

తృతీయాధ్యాయమున తృతీయపాదము ముగిసినది

# తృతీయాధ్యాయము - చతుర్థపాదము

109 పురుషార్థాధికరణము (3-4-1)

419 పురుషార్థో౽తశ్శబ్దాదితి బాదరాయణః (3-4-1)

అర్థము - అతః - విద్యవల్ల, పురుషార్థః శబ్దాత్ - వేదంవల్ల, ఇతి - అని బాదరాయణః - బాదరాయణుడు చెప్పుచున్నారు విద్యవల్ల పురుషార్థమా లేక కర్మవల్లనాయని సంశయము విద్యకు కర్మాంగత్వముండుటచే కర్మములబ్ధి సంభవించునని పూర్వపక్షము కర్మలయందు కర్తృభూతమైన ప్రత్యగాత్మనో యాధాత్మ్యప్రతిపాదనపరములు వేదాంతవాక్యములు విద్యకు కర్మాంగత్వమెట్లన్న "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం" అని శ్రుతియందవగతమౌచున్నది ఈ శ్రుతికిప్రకృతమైన ఉద్గీథోపాసనము విషయమని చెప్పుట శక్యంకాదు "యదేవ విద్యయా కరోతి" అనే శ్రుతిచే సర్వకర్మలయందును విద్యకు వినియోగం సంభవింపంచును శ్రుతిప్రకరణముకంటే బలీయమైనది విద్యర్పుకు కర్మాంగత్వమే ప్రకారంసంభవించునంటే "తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ" అని సామానాధికరణ్యంచేత, కర్మాంగభూతమైన కర్తృయధాత్మ్యమనుసంధానం ద్వారా విద్యకు కర్మాంగత్వమని తెలియుచున్నది అందువల్ల కర్తృవు యొక్క సంస్కారరూపత్వమువలన బ్రహ్మవిద్యకు కర్మవలనే పురుషార్థము అచ్చటచ్చట ఫలశ్రుతి అర్థవాదమగును విద్యకు కర్మాంగత్వంచేత అనేకలింగములు వేదాంతములందు చూడబడినవి

సిద్ధాంతము - కర్మలయందు కర్తయైన ప్రత్యగాత్మకర్థాంతరభూతుడై తనసంకల్పంవలన చేయబడిన జగదుత్పత్తివిభవలయలీలలే వినోదంగాగల నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతా అనంతజ్ఞానానందైకస్వరూపంగల సర్వేశ్వరుడై సత్యసంకల్పుడై కరణములకధిపుడై ప్రత్యగాత్మకు ప్రభువై తెలియుటకు యోగ్యుడైనవాని జ్ఞానరూపమైన విద్యకు "బ్రహ్మవిదాప్నోతి

పరమ్" ఇత్యాదులందు బ్రహ్మప్రాప్తియేఫలమని చెప్పుటవల్ల అదే ఫలము సంభవించును "యదేవ విద్యయా కరోతి" అని శ్రుతియందు ప్రసిద్ధంగా నిర్దేశించుటచేత ప్రసిద్ధియందు ప్రకృతమైన ఉద్గీథోపాసనవిశేషవిషా "తత్వమసి" అని సామానాధికరణ్యము తచ్ఛబ్దముచేత చెప్పబడిన స్వసంకల్పమువలన చేయబడిన జగజ్జన్మ స్థితిధ్వంసములుగల పర బ్రహ్మమునకు జీవస్వరూపపరత్వమును లేదు మరేమంటే జగత్కారణ బ్రహ్మమునకు జీవశరీరకత్వముచే జీవుని ఆత్మత్వపరమైనదని "అధికం తు భేదనిర్దేశాత్" అను సూత్రమందు స్ఫుటంగా చెప్పబడినది య ఆత్మని తిష్ఠన్", "యస్యాత్మా శరీరమ్" అనియు ప్రత్యగాత్మకాత్మత్వము పరబ్రహ్మమని శ్రుత్యంతరములందు వ్యక్తము

సూత్రార్థము - పురుషార్థోఽత - విద్యవలన, ఎట్లన్న "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది శబ్దములవలన

420 శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమిని (3-4-2)

అర్థము - శేషత్వాత్ - కర్మశేషత్వంవల్ల, పురుషార్థవాద - పురుషార్థ మునుచెప్పుట అర్థవాదము, యథా - ఏ ప్రకారం, అన్యేషు - ద్రవ్య సంస్కారములందని, జైమిని - జైమిన్యాచార్యులు చెప్పుదురు "తత్త్వ మసి" ఇత్యాది సామానాధికరణ్యముచేత బ్రహ్మమునకు కర్మలందు కర్తృ స్వరూపత్వముతెలియుటచే విద్యకు కర్తృత్వసంస్కారద్వారా కర్మశేషత్వ మువలన అచ్చట పురుషార్థముయొక్క వాదము అర్థవాదంమాత్రమే ఏ ప్రకారమన్యములైన ద్రవ్యసంస్కారము మొదలైనవానియందని జైమిన్యా చార్యులు చెప్పుదురో

421 ఆచారదర్శనాత్ (3-4-3)

అర్థము - ఆచారదర్శనాత్ - కర్మప్రధానంగా బ్రహ్మవేత్తలయాచార ప్రత్యక్షమువలన ఈ కారణమువలన విద్యకర్మాంగము బ్రహ్మవేత్త

లయాచారము కర్మప్రధానంగా చూడబడుచున్నది ఏ ప్రకారం బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులైన అశ్వపతియైన కేకయుడు "యక్ష్యమాణో హ వై భగవన్తోహమస్మి" అని చెప్పెనో "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయ " అనియు స్మరింపబడెనో ఈ హేతువుల్ల ప్రాప్తి చంప్పబడినదని చెప్పుచున్నారు

422 తచ్ఛ్రుతే (3-4-4)

అర్థము - తచ్ఛ్రుతే - ఈ అర్థమును శ్రుతిచెప్పుచున్నది "యదేవ విద్యయా కరోతి" ఇత్యాది శ్రుతులచే విద్యకు కర్మాంగత్వము తెలియబడు చున్నది దుర్బలప్రకరణముచే శ్రుతివిద్యావిషయమైన ఉద్గీథవిషయోపాసనమందు వ్యవస్థాపనచేయలేదిలేదు

423 సమన్వారమ్భణాత్ (3-4-5)

అర్థము - సమను - సమన్వారభతే యని శ్రుతియందు చెప్పబడిన సామానాధికరణ్యమును, ఆరమ్భణాత్ - ఉపక్రమమువలన "తం విద్యాకర్మణీ సమన్వారభతే" అని విద్యాకర్మలు ఒకపురుషునియందు సాహిత్యమున్నందున విద్యకు కర్మాగత్వమేయగుచున్నది

424 తద్వతో విధానాత్ (3-4-6)

అర్థము - తద్వత - విద్యావంతునికే, విధానాత్ - కర్మవిధానంచెప్పబడును విద్యావంతునికి కర్మవిధానంవల్ల విద్య కర్మాగమగును "ఆచార్యకులాద్వేదమధీత్య యథా విధానం గురో: కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుమ్బే " ఇత్యాదులచేత అధ్యయనవంతునకు కర్మను విధించినదై అర్థముయొక్క అవబోధపర్యంతము అధ్యయనమునకు విద్యవల్లనే కర్మలను విధించుచున్నదని తెలియుచున్నది

425 నియమాచ్చ (3-4-7)

అర్థము - నియమాచ్చ - కర్మయందే నియమప్రత్యక్షములన "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమా" అని ఆత్మవేత్తల ఆయుస్సు వరకు కర్మలయందే నియమదర్శనముండుటచే పురుషార్థము సంభవించును విద్యవల్ల సంభవించదని తెలియుచున్నది అందువలన విద్యకు కర్మ అంగము

426 అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్ (3-4-8)

అర్థము - అధికోపదేశాత్ - జీవునికంటె అధికుడైన బ్రహ్మమునకేఫల సాధనత్వోపదేశంవల్ల, బాదరాయణస్య - బాదరాయణులవారియొక్క మతము, ఏవం - విద్యవలన పురుషార్థమని, తద్దర్శనాత్ - ఈ అర్థము శ్రుతులయందు ప్రత్యక్షమగును కుశలము పశ్రమును వ్యావృత్తి చేయుచున్నది బాదరాయణస్యైవం విద్యవల్లనే ఫలమని బాదరాయణుని మతము ఎట్లన్న అధికోపదేశాత్ - కర్మలయందు కర్తయైన ప్రత్యగాత్మకంటె అధికుడై అర్థాన్తరభూతుడైన బ్రహ్మకే వేదనభూతమైన విద్యకు ఫలసాధనత్వోపదేశమువలన, దర్శనాత్ - విద్యకు అధికవిషయత్వము వేదాంత వాక్యములయందు చూడబడుచున్నది ఇదే ప్రకారమే "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి", "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" ఇత్యాదుల్లో బహుభవనసంకల్పపూర్వకసృష్ట్యాదులకు కర్తయైన పరేశ్వరునికి కరణాధిపుడైన జీవునికి అధిపతియైనవానికి అనవధికాతిశయమై జ్ఞానానందస్వరూపమై నిఖిలహేయప్రత్యనీకమైన వేద్యునకు బ్రహ్మవిద్యాప్రాప్తిఫలముగా గలదని విధానంచేయబడినది

427 తుల్యం తు దర్శనమ్ (3-4-9)

అర్థము - దర్శనం - బ్రహ్మవేత్తలాచారప్రత్యక్షము, తుల్యం - సమానమైనది విద్యకు ప్రధానత్వము చెప్పినపక్షము బ్రహ్మవేత్తల

యాచారప్రత్యక్షము సమానముగానుండును కర్మలకు అనాచారదర్శనమున్నూ ఉన్నదనియర్థము "ఋషయ కావషేయా కిమర్థావయ మధ్యేష్యామహే కిమర్థావయం యక్ష్యామహే" ఇత్యాదులందు కర్మానుష్ఠానప్రత్యక్షమైతే ఫలాభిసంధిరహితమైన కర్మకు విద్యాంగత్వముండుటవలన త్యాగమైతే ఫలాభిసంధియుక్త కర్మకు విద్యయందు విరోధిత్వముండునని అభిప్రాయము

**428 అసార్వత్రికీ (3-4-10)**

అర్థము - అసార్వత్రికీ - సర్వత్ర సంభవించచెడిది కాదు "యదేవ విద్యయా కరోతి" అను శ్రుతి సర్వవిద్యకు కర్మాంగత్వమును విధించుచున్నదనుటము అసంగతము ఇచ్చట విద్యాశబ్దముచేత చెప్పబడుచున్నదంటే సార్వత్రికము కాదు మరేమనిన ఉద్గీథవిద్యయే దేనిని చేయుచున్నదదో అది విద్యచేతచేయుని పదములకు అన్వయముకాదు మరేమనిన ఏది విద్యచేత చేయునో అదే వీర్యవత్తరము విద్యచేత తెలియబడినది మరియొకస్థలమందు తెలియబడినదానియొక్క బలిష్ఠత్వమునుగురించి కారణత్వము తెలియబడుచున్నది "యదేవ" అని ప్రసిద్ధంగా నిర్దేశముండుటచే వేరొచోట తెలియదమంటే "ఉద్గీథముపాసీత" అని సన్నిహితమైన ఉద్గీథవిద్యా అన్వయము

**429 విభాగశ్శతవత్ (3-4-11)**

అర్థము - శతవత్ - మూడురత్నములు ప్రాప్తమగునట్లు, విభాగ - విభాగము తెలియబడును "తం విద్యాకర్మణీ సమన్వారభేతే" అనుచోట విద్యయున్ను తనఫలముకొరకు కర్మయును తనసంబంధమైన ఫలముకొరకు, అన్వారభతే - ఉపక్రమింపబడుచున్నదని విభాగము తెలియుతగినది ఎట్లైతే విద్యాకర్మలకు భిన్నఫలత్వము చెప్పబడినదో శతవత్ - ఎట్లైతే భూమిని రత్నమును విక్రయముచేయువానిని రెండుశతములనుపరించున

నిచెప్పి క్షేత్రమైన భూమికి ఒకశతమనియు రత్నముకొరకు ఒకశతమ
నియు విభాగము తెలియబడుచున్నదో అట్లేనని తెలియవలయును
తాత్పర్యము - శ్రుతియందు విద్యాకర్మలకు ప్రత్యేకంగా ఫలవిభాగం
చూడబడినది ఎట్లన్న క్షేత్రరత్నములను విక్రయించెడువానిని శతద్వయ
మనుసరించుచున్నదనే స్థలమందు శతము క్షేత్రార్థమనియును శతమురత్నార్థమనియు విభాగముతెలియబడుచున్నదో అట్లేనని తాత్పర్యము

## 430 అధ్యయనమాత్రవత (3-4-12)

అర్థము - అధ్యయనమాత్రవత - అధ్యయనమాత్రమే కలవానికి కర్మ చెప్పబడును "వేదమధీత్య" అని వేదమును అధ్యయనముచేసినవానికి కర్మవిధానంవల్ల దీనిచేత విద్యకు కర్మాంగత్వములేదు అధ్యయనవిధియైతే న్యాసమువలన నియమపూర్వకముగా అక్షరసమూహముయొక్క గ్రహణమాత్రమే పర్యవసానముకలిందును గ్రహింపబడిన స్వాధ్యాయమునకు ఫలముగల అర్థముయొక్క జ్ఞానప్రత్యక్షమువలన దానినిర్ణయఫలముగల మీమాంసాశ్రవణమందు అధ్యయనముచేయబడిన వేదముగల పురుషుడు తానే ప్రవర్తించును అర్థమునకు జ్ఞానపర్యంతముందినను అర్థజ్ఞానముకంటే అర్థాంతరభూతమైన స్మృతిప్రత్యయముయొక్క ఆవృత్తిరూపమైన "ఉపాసిత" అనే శాస్త్రవిహితవిద్య కర్మకు అంగముకాదు

## 431 నావిశేషాత్ (3-4-13)

అర్థము - అవిశేషాత్ - విద్వాంసునుకేయని విశేషములేకపోవుటచే, న - కర్మయందు విద్వాంసునికి నియమము సంభవించదు "కుర్వన్నేవేహ కర్మాణి" అని బ్రహ్మవేత్తలయొక్క ఆయుష్పుకు కర్మయందు నియమము సంభవించదు అవిశేషాత్ - విశేషములేకుండుటవలన విద్వాంసునికి అని విశేషము లేకపోవుటవలన ఎట్లన్న ఆ విద్వాంసునికి కాకపోని

విద్వాంసునికైతే అప్రయాణమువరకు ఉపాసనప్రవృత్తి ప్రత్యక్షమువలన అర్థస్వభావమును బట్టి విద్వాంసునికనవి అభిప్రాయము

432 స్తుతయేऽనుమతిర్వా (3-4-14)

అర్థము - స్తుతయే - విద్యాస్తుతికొరకు, అనుమతిర్వా - కర్మసమ్మతియగును వాక్యము అవధారణార్థము " ఈ శావాస్యమిదం సర్వమ్" అని విద్యాప్రకరణమువలన విద్యస్తుతికొరకు కర్మసమ్మతియే విద్యామాహాత్మ్యమువలన సర్వకాలములందును కర్మలను చేయుచూ ఉండినను వానిచే పూయబడని విద్య స్తోత్రంచేయబడుచున్నది వాక్యశేషమందైతే "న కర్మణా లిప్యతే నర " అని వినబడుచున్నది

433 కామకారేణ చైకే (3-4-15)

అర్థము - ఏకే - కొన్ని శాఖలు, కామకారేణ - స్వేచ్ఛచేతను కొన్ని శాఖలు కామకారముచేత విద్యావిష్ఠులైన పురుషునికి గార్హస్థ్యత్యాగమును చెప్పుచున్నది "కిం ప్రజయా కరిష్యామో యేషాం నో యమాత్మాऽయంలోక" అని గార్హస్థ్యకర్మత్యాగము చెప్పుచుండుటవలన విద్యయే ప్రధానమని చూపించుచున్నది

434 ఉపమర్దం చ (3-4-16)

అర్థము - ఉపమర్దం చ - సర్వకర్మనాశమున్ను చెప్పుచున్నది విద్యల చేత సర్వకర్మల నాశమున్ను అధ్యయనము చెప్పుచున్నది "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అని అది విద్యకు కర్మాంగత్వమయి ఉండినను సంగతము కానేరదు

435 ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి (3-4-17)

అర్థము - ఊర్ధ్వరేతస్సు చ - ఊర్ధ్వరేతాదులైన ఆశ్రమములందును, శబ్దే హి - వైదికశబ్దమందునను బ్రహ్మవిద్యప్రత్యక్షమువలన ఊర్ధ్వరేతస్సుగల బ్రహ్మవిద్యప్రత్యక్షంచే ఆశ్రమములందు అగ్నిహోత్రము మొదలైన కర్మరహితమువలన విద్య కర్మకంగముకాదు ఆశ్రమములున్నను ఏ కారణంవల్ల వైదికశబ్దమందు అవి చూడబడుచున్నవో "త్రయో ధర్మస్కంధా యత్రోధ్యయనం దానం" అని "రయే చేమేరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" అనుచోట "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంత ప్రవ్రజంతి" అనియు "యావజ్జీవమగ్నిహోత్రం" అను శ్రుతులు అవిరక్తునివిషయము

436 పరామర్శం జైమినిరచోదనాచ్చాప వదతి హి (3-4-18)

అర్థము - అచోదనాత్ - ప్రేరేపణ చేయకపోవుటచే, పరామర్శం - అనువాదము, జైమిని -జైమినులు, అపవదతి - నిషేధించుచున్నదని తెలియుదురు "త్రయో ధర్మస్కంధా" ఇత్యాదుల్లో ఆ ఆశ్రమములకు అచోదనాత్ - ప్రేరణ చేయకపోవుటవలన అవిధానమువలన ఉపాసనా స్తోత్రముకొరకై పరామర్శ చేయుచున్నది అనువాదము జైమిన్యాచార్యులు తెలియుదురు మరియు శ్రుతి ఆశ్రమాంతరమును అపవాదమునుపొంది యున్నది "వీరహా వా ఏష దేవానాం రయోగ్నిముద్వాపయత" ఇత్యాదులు ఆ కారణంచే అవివేదని తాత్పర్యము

437 అనుష్ఠేయం బాదరాయణస్సామ్య శ్రుతే (3-4-19)

అర్థము - సమానత్వం చెప్పెడిశ్రుతులవలన, అనుష్ఠేయం - అనుష్ఠానము చేయతగినదని, బాదరాయణ - బాదరాయణాచార్యులు చెప్పుచున్నారు గృహస్థాశ్రమమువలె మరియొక ఆశ్రమమును అనుసరించతగినదని శ్రేష్ఠులైన బాదరాయణాచార్యులు తెలియుచున్నారు ఎట్లన్న దానికిని

సామ్యబోధకమైన శ్రుతియుండుటవలన "త్రయో ధర్మస్కంధ" మొదలైన ఈ సమస్తఆశ్రమమునకు ఏకరూపము సంకీర్తనమగుచున్నది.

438 విధిర్వాధారణవత్ (3-4-20)

అర్థము - ధారణవత్ - సముత్తులయొక్క ధారణవలె, విధిర్వా - విధియే వా శబ్దము అవధారణార్థకము సమస్తాశ్రమములకు ఇదే విధి ధారణవత్ - ఏ ప్రకారము "అధ స్తాత్సమిధం ధారయన్ననుద్రవేత్ ఉపరి హి దేవేభ్యో ధారయతి" అని అనువాదస్వరూపము ఉంటినను ఉపదేశమందు ధారణకు అప్రాప్తత్వముచేత విధియాశ్రయింపబడుచున్నదో ఆ ప్రకారమిచ్చటను ఆశ్రమములనగును ఆ కారణంచేత ఊర్ధ్వరేతస్సుల యందు విద్యాప్రత్యక్షమువలన విద్యచే పురుషార్థము కలుగును

అధికరణ సంగ్రహము - విద్య కర్మకర్తృభూతాత్మజ్ఞానరూపతయా కర్మాంగము కర్మ మోక్షసాధనమని శంకించి కర్తృభూతాత్మజ్ఞానము కర్మాంగమైనను తద్విలక్షణపరమాత్మ జ్ఞానరూపవిద్య కర్మాంగము కానందునను యజ్ఞదానాదికర్మములు విద్యాంగతయా శ్రుతిసిద్ధమౌటచేత విద్యకర్మాంగముకాదు కర్మమే విద్యాంగమౌటచే విద్య మోక్షసాధనమని నిర్ణయించబడినది

110 స్తుతిమాత్రాధికరణము (3-4-2)

439 స్తుతిమాత్ర మపాదానాదితి చేన్నాపూర్వత్వాత్ (3-4-21)

440 భావశబ్దాచ్చ (3-4-22)

అర్థము - ఉపాదానాత్ ఇతి చేత్ సమానములు ఇతరే - ఆనందాది గుణములు అర్థసామాన్యాత్ - బ్రహ్మస్వరూపసామాన్యంచే సమస్త సకలములందనుర్తించుచున్నది బ్రహ్మయొక్క స్వరూపనిరూపకములైన ధర్మములుకనుక బ్రహ్మస్వరూపంతో అవినమావములు ప్రియస్త్వాదులు మొదలైనధర్మములు బ్రహ్మస్వరూపం నుచెప్పెడివిగాకపోయినను ఎందు

కుచెప్పనియదగినదా లేదా ఉద్గీథాదులయొక్క స్తుతిపమాత్రమాయని సంశయము విధిత్వమందు సిద్ధమైనను గోదోహనాదులవలె నగుచున్నది విధిత్వమే సంభవించుటలేదని పూర్వపక్షము "ఇయమేవ జుహూ స్వర్గలోక ఆహవనీయ" అన్నట్లు కర్మాంగభూతమైన ఉద్గీథాదులసంబంధిత్వంచేత ఉపాదానమువలన రసతమత్వాదులకు దాని స్తుతిమాత్రత్వమే రసతమత్వాదులదృష్టవిధిలేదు

సిద్ధాంతము - జుహ్వాదివిధివలె ఉద్గీథాదివిధికిచ్చుట అసన్నిధానమువలన రసతమత్వమునకు అప్రాప్తినిబట్టి "ఉపాసీత" అని విధిప్రత్యయముచేత స్తుతిమాత్రముకాదు దానిదృ।గ్టివిధియే సూత్రద్వయము వ్యాఖ్యానము చేయుటబడినది

అధికరణ సంగ్రహము - కర్మాంగోద్గీథాదులందు రసతమత్వాదిప్రతిపాదక వాక్యములు జుహ్వాదులను పృథివ్యాద్యాదినా స్తుతించు గణనలో ఉద్గీథస్తుతిపరములని శంకించి జుహ్వాదివిధివలె ఉద్గీథాది విధిసన్నిహితముకానందునను, ఉద్గీథాదులకు రసతమత్వాదులు ప్రమాణాంతరప్రాప్తమౌటచేత స్తుతిపరములుకావు రసతమత్వాది దృష్టివిధాయకములని నిర్ణయించబడినది

111 పారిప్లవాధికరణము (3-4-3)

441 పారిప్లవార్థా ఇతిచేన్న విశేషితత్వాత్ (3-4-23)

అర్థము - పారిప్లవార్థా - పారిప్లవప్రయోగము ప్రయోజనంగాగలదని, ఇతి చేన్న - అనగూడదు, విశేషితత్వాత్ - వినియోగమందు విశేషితత్వము వలన

142 తథాచైక వాక్యోపబంధాత్ (3-4-24)

అర్థము - తథా చ - ఆప్రకారము, ఏకవాక్యోపబంధాత్ - విధివాక్యముచే ఏకవాక్యత్వంచే విద్యర్థమే "ప్రతర్దన హవై దైవోదాసి"

ఇత్యాదులైన వేదాంతములందు ఆఖ్యానవిశేషములు పారిప్లవప్రయోగమే ప్రయోజనముగాగలదా లేక అచ్చటచ్ఛ విద్యావిశేషములప్రతిపాదనమే ప్రయోజనముగాగలదాయని సంశయము "ఆఖ్యానాని శంసంతి" అని పారిప్లవమందు వినియోగమువలన అదే ప్రయోజనముగా గలిగినదని పూర్వపక్షము

సిద్ధాంతము - "ఆఖ్యానాని శంసంతి" అనిచెప్పి, "మనుర్వైవస్వతో రాజా" అని మన్వాదులయొక్క ఆఖ్యానమందు వినియోగమునకు విశేషితత్వమువలన "తం మామాయుర మమృతమిత్యుపాస్స్వ" ఇత్యాది విధి వాక్యములచే ఏకవాక్యత్వమువలన "సోऽరోదీత్" ఇత్యాదులవలె విద్యావిధియే ప్రధానముగాగలదని సూత్రద్వయమందు వ్యాఖ్యానము చేయబడినది

113 అగ్నీంధనాద్యధికరణము (3-4-4)

443 అతఏవ చాగ్నీంధనాద్యనపేక్షా (3-4-25)

అర్థము - అతఏవ చ - విద్యావత్త్వముచెప్పెడిశ్రుతివలనను, అగ్నీంధనాద్యపేక్షా - అగ్న్యాధానాపేక్షలేదు ఊర్ధ్వరేతస్సులైన ఆశ్రమములందు బ్రహ్మవిద్యసంభవించునా లేదా అని సంశయము యజ్ఞాద్యభావమువలన వారికి అదేయంగముగాగల విద్య సంభవించదని పూర్వపక్షము

సిద్ధాంతము - "యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి", "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంత ప్రవ్రజంతి" ఇత్యాదిశ్రుతులచే వారియందు విద్యావత్త్వము తెలియబడుటవలన వారికి అగ్నిహోత్రాద్యనపేక్షవిద్యయునిశ్చితమని నిశ్చయింపబడుచున్నది

సూత్రార్థము - అతఏవ - విద్యయుండునని చెప్పెడు శ్రుతివల్లనే అధావాద్యనపేక్ష వారియందుండు విద్యాగ్నీంధనమున అగ్న్యాధానము

అధికరణ సంగ్రహము -- గృహివ్యతిరిక్తాశ్రమములో యజ్ఞదానాదులు లేనందున తదంగ విద్యానుష్ఠానము వారికిని లేదనిశంకించి యజ్ఞదానాదిరూ

సాంగములు లేకపోయినను తత్తదాశ్రమోచితకర్మలు అంగమై తత్సాధక విద్యకూడునని నిర్ణయించబడినది

## 114 సర్వాపేక్షాధికరణము (3-4-5)

**444 సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతేరశ్వవత్ (3-4-26)**

అర్థము - అశ్వవత్ - గమనసాధనమైన అశ్వమువలె, యజ్ఞాదిశ్రుతే - యజ్ఞాదులు చేయదగినవని చెప్పుడిశ్రుతివలన, సర్వాపేక్షా - సమస్త కర్మాపేక్ష గల్గాను కర్మగలగృహస్థులందు యజ్ఞాదుల అపేక్షగలదాలేక అచ్యుతను కేవలమైనదే విద్యయని సంశయము ఊర్ధ్వరేతస్సులందు యజ్ఞాదులైన కర్మాపేక్షలేనదయ్యే అమృతమును సాధించు చున్నదని చెప్పునపక్షము కర్మనిరపేక్షమాన విద్యకే సాధనత్వమంగీకరించతగినది అట్లైతే గృహస్థులందు కర్మాపేక్షలేనిదయ్యే మోక్షమును సాధించుటకొరకు సమర్థులౌనని పూర్వపక్షము స్వర్గాదులకుసాధకమైన అగ్నిహోత్రాదికర్మ పురుషభేదంచే నానావిధమైన అంగము గలదిగా చూడబడుచున్నది "వివి దిషంతి" అనుశబ్దమందును వేదనేచ్ఛచేత కర్మలను వినియోగం పొందు చున్నది

సిద్ధాంతము - కర్మకులైన గృహస్థులందు యజ్ఞాదిసర్వకర్మాపేక్షగల్గిన నది విద్య ఎట్లన్న యజ్ఞాదిశ్రవణంవల్ల "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" అని యజ్ఞాధులు విద్యయొక్క అంగత్వముచే వినియోగంచేయబడుచున్నది అందువల్ల గృహస్థులందు కర్మాపేక్షగల్గినది విద్య ఇచ్ఛకు చెప్పబడునది ప్రధానముగుటచే "వివిది షంతి" అని చెప్పబడినది జ్ఞానమేయని తెలియబడుచున్నది ఎట్లైతే గమ నసాధనభూతమైన అశ్వమునకు తన పరికరబంధరూపపరికర్మాపేక్షగలదో అట్లే ఊర్ధ్వరేతస్సులందును స్వాశ్రమవిహితమైన కర్మమేపరికరముగునని అట్టిపురుషులందు విద్యాసంబంధము శాస్త్రంవల్ల తెలియబడుచున్నది

శాస్త్రముచే తెలియుటకు యోగ్యమైనదిగా శాస్త్రమునకతిక్రమించనట్లు అంగీకారము చేయతగినది
అధికరణ సంగ్రహము - గృహస్థులకున్ను యజ్ఞాదినిరపేక్షముగా విద్యాను ష్ఠానమని శంకించి యజ్ఞాద్యంగకత్వము శ్రుతిసిద్ధమౌటచేత యజ్ఞాపేక్ష విద్యానుష్ఠామని నిర్ణయించబడినది

115 శమదమాద్యధికరణము (3-4-6)

445 శమదమాద్యుపేతస్స్యాత్తథాపి తు తద్విధేస్తదంగతయా తేషామవశ్యాను ష్ఠేయత్వాత్ (3-4-27)

అర్థము - తథాపి - సమస్తకర్మకు యుక్తులైనను, శమదమాద్యుపేత - శమదమాదులచే కూ డినవాడును, స్యాత్ - అగును, తదంగతయా - విద్యాగందత్వముచే, తద్విధే - శమాదివిధివలన, తేషామపి - శాంత త్వాదులకు, అవశ్యామష్ఠేయత్వాత్ - అవశ్యంగా అనుష్ఠాన యోగ్యత్వం గల్గుటచేత విద్యపరిసమాప్తికొరకు గృస్థులకు శమదమాదులు ఉపాదే యములా కాదాయని సంశయము గృహస్థుల అంతరబాహ్యములైన ఇంద్రియ వ్యాపారరూపమైన కర్మయే అంగంగా కలదగుటవల్ల విద్యకు దానివిపరీతరూపమైన శమదమాదులపరిగ్రహమందు సామర్థ్యము లేకపో వుటవలన కర్మరహితులైన ఊర్ధ్వరేతస్సులందు శమదమాదులయొక్క వినియోగం కలుగుచున్నది ఎట్లు యజ్ఞాదులయొక్క వినియోగం కర్మకు యోగ్యులైన గృహస్థులందుండునో అట్లు అనుపాదేయములు శమదమా దులని పూర్వపక్షము

సిద్ధాంతము - "తస్మాదేవం విద్యాంతోదాంతముపరతస్తితిక్షుస్సమాహి తో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" అని సామాన్యంగా విద్యాంగ తయా వినియోగమువలన గృహస్థులకున్ను ఉపాదేయము కర్మవంతులైన వారికి శమదమాద్యుపాదానముల పరిగ్రహమందు సామర్థ్యంలేదని చెప్పగూడదు శమదమాదులకు భిన్నవిషయకత్వము ఉండుటచే విహిత

ములైన కర్మలయందు కరణములవ్యాపారముండును అవిహితములైన కర్మములందు శమదమాదులు ప్రయోజనశూన్యములగును, అందువలన శమదమాదుల వినియోగము యజ్ఞాదులయొక్క వినియోగమువలె సంకోచం పొందదు
సూత్రార్థము - ఎప్పుడు గృహస్థులు యజ్ఞాదికర్మయుక్తులో అప్పుడే శమదమాదులచే యుక్తులౌదురు ఎట్లన్న "శాంతోదాంత" ఇత్యాదిశమదమాదివిధివల్ల తదంగతయా విద్యయొక్క అంగత్వముచేత విద్యానిష్పత్తికొరకు వానికొరకు అవశ్యానుష్ఠేయత్వాత్ - అవశ్యం అనుష్ఠాన యోగ్యము చిత్తఏకాగ్రహ్యంచేత నిష్పాదనచేయుటకు యోగ్యమౌటవలన శమదమాదులచేతనే విద్యనిష్పత్తిగల్గునని అర్థము యజ్ఞాదికర్మలందు పాపనాశన ద్వారా ఏకాగ్రత్వమును ప్రసాదించుచున్నాకరని అభిప్రాయము
అధికరణ సంగ్రహము - గృహస్థులకు కరణవ్యాపారరూపమైన కర్మానుష్ఠానము తదుపరతిరూపమైన శమదమాదులును విరుద్ధమౌటచే వారలకు శమదమాదులు విద్యాంగతయా అనుపాదేయములని శంకించి నిషిద్ధవిషయ నివృత్తిరూపమైన కర్మలకు విరోధములేనందువల్ల శమదమాదులు విద్యాంగతయా ఉపాదేయములని నిర్ణయింపబడినది

## 116 సర్వాన్నానుమత్యధికరణము (3-4-7)

446 సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయేతద్దర్శనాత్ (3-4-28)
అర్థము - ప్రాణాత్యయే - ప్రాణానపాయకాలమందు, సర్వాన్నానుమతి - సమస్తాన్నభక్షణ సమ్మతి, తద్దర్శనాత్ - ప్రాణాత్యయకాలమందు ప్రత్యక్షమువలన వారలకు ఛాందోగులకు ప్రాణవిద్యయందు "నహవా ఏవం విది కించనానన్నం భవతి" అని సర్వాన్నములయొక్క అనుమతి సంకీర్తనముచేయబడుచున్నది ప్రాణవేత్తలకు సర్వాన్నముల అనుమతి సర్వకాలమందున్నదా లేక ప్రాణాత్యయవిపత్తుయందాయని సంశయము విశేషములేకపోవుట వలన సర్వకాలముయందని పూర్వపక్షము అధికమై

అతిశయమైనశక్తిగల బ్రహ్మవేత్తలకు ఉచ్ఛిష్టభక్షణల పరిగ్రహము ప్రాణ నాశకమైన ప్రాప్తియందే దదర్శనమువలన అల్పశక్తిగల దేహధారికి మరి యేమని ప్రాణాత్యయకాలమందే అని సిద్ధాంతము

సూత్రార్థము - చ శబ్దము అవధారణార్థము ప్రాణవిద - దేహధారికి, సర్వాన్నానుమతి - సర్వాన్నములయొగికారము ప్రాణాత్యయకాలమందే ఎట్లన్న తద్దర్శనాత్ - అతిశయమైనశక్తిగల బ్రహ్మవేత్తలకు ప్రాణాత్య యమందే సర్వాన్నములయొక్క అనుమతియుండును

తాత్పర్యము - బ్రహ్మవేత్తకు సర్వాన్నానుమతి సర్వకాలమందా యని శంకించి ప్రాణాత్యయాపత్తుయందే సర్వాన్నానుమతిగాని ఇతరకాలమందు కాదునియభిప్రాయము

447 అబాధాచ్చ (3-4-29)

అర్థము - బాధలేకపోవుటవలన "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధి సత్త్వశుద్ధౌ ధృవాస్మృతి" అని ఆహారహారశుద్ధివిధికి బాధలేకపోవుటవలన ప్రాణాత్య యకాలమందేను

448 అపి స్మర్యతే (3-4-30)

అర్థము - అపి స్మర్యతే - స్మృతియందును చెప్పబడును

"ప్రాణసంశయమాపన్నో యోఽన్నమత్తి యతస్తత ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥"

అని ప్రాణసంశయకాలమందు సర్వాన్నాదులయొక్క అనుమతి స్మరింప బడుచున్నది

449 శబ్దశ్చాతోఽకామకారే (3-4-31)

అర్థము - అత - ఆ కారణమువలన, అకామకారేశబ్ద - కామకారమునకు ప్రతిషేధకమైన శబ్దమున్ను గలదు ఏ కారణమువలన సర్వాన్నముల

అనుమతి ప్రాణాత్యయమందో అందువలన అకామకారేశబ్దశ్చ - కామకారశబ్దము ఉపపన్నమగుచున్నదనియర్థము కఠవల్లియందు కామకారమునకు ప్రతిషేధమైన శబ్దమున్నది "తస్మాద్బ్రాహ్మణస్సురాం న పిబతి పాప్మనా నోత్సృజా" అని పాపముచేత స్పృశింపబడినవాడు కాకూడదని తలంచి మద్యమునుపానచేయువాడని ఈ శ్రుతికర్థము
అధికరణ సంగ్రహము - ప్రాణవిద్యానిష్ఠునికి సర్వదా సర్వాన్నానుమతి యని శంకించి సర్వాన్నానుమతి ప్రాణాత్యయాపత్తులోతప్ప సర్వదా కూడదని నిర్ణయించబడినది

117 విహితత్వాధికరణము (3-4-8)

450 విహితత్వాచ్చాశ్రమకర్మాపి (3-4-32)

అర్థము - విహితత్వాత్ - జుహుయాత్ అనే విధివలన ఆశ్రమకర్మాపి - ఆశ్రమాంగభూత కర్మములగును యజ్ఞములు విద్యకంగములా లేక ఆశ్రమమునకంగములాయని సంశయము ఆశ్రమమునకేయనిచెప్పినపక్షమందు నిత్యానిత్యసంయోగరూపవిరోధము ప్రసక్తమౌనుగనుక అంగభూతములు కావు కేవలము ఆశ్రమమునకని పూర్వపక్షము
సిద్ధాంతము - ఒక్క వినియోగత్వంచేతనే ఉభయాంగత్వముచెప్పినపక్షమున నిత్యానిత్య సంయోగరూపమైన విరోధము సంభవించును ఇచ్చట "యావజ్జీవమగ్నిహోత్రంజుహుయాత్", "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" అని వినియోగమునకు భేదముండుటచేత విరోధము పరిహరింపబడును ఏ రీతి అగ్నిహోత్రం మొదలైన కర్మలకు జీవనాధికారము కామాధికారము వలె అధికారభేదమునకు స్ఫుటత్వములేకపోవుటచే స్ఫుటీకరణముచేయుటకొరకు తిరిగి ఇక్కడ స్మరింపబడుచున్నది

సూత్రార్థము - "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" ఇత్యాదులచేత కేవలము గృహస్థాశ్రమంలో ఉండెడువారికి జీవననిమిత్తత్వముగా విధిచేయబడినదౌటవలన యజ్ఞాదులు కేవలాశ్రమకర్మలగును

తాత్పర్యము - యజ్ఞాదులు విద్యాంగభూతములా లేక ఆశ్రమాంగభూతములాయనిశంకించి కేవలాశ్రమాంగభూతములని నిర్ణయించబడినది

451 సహకారిత్వేన చ (3-4-33)

అర్థము - సహకారిత్వేన చ - విద్యకు సహకారికారణమౌటచేతను 'తమేతం వేదానువచనేన" ఇత్యాదులందు విద్యకు సాధనంగా చెప్పబడినదౌటవలన విద్యకు సహకారియౌటచేతను యజ్ఞాదికర్మ అనుష్ఠేయమైనది వినియోగంయొక్క భేదంచే విరోధంపరిహరింపబడుచున్నదని అభిప్రాయము

452 సర్వథాపి త ఏవోభయలింగాత్ (3-4-34)

అర్థము - సర్వథాపి - ఉభయస్థలములందు వినియోగముండినను, తఏవ - ఆ యజ్ఞాదులే, ఉభయలింగాత్ - ఉభయస్థలములందున్న, ప్రత్యభిజ్ఞ నరూపముపలన సర్వథాపి - ఉభయస్థలమందు వినియోగముండినను త ఏవ - ఆ యజ్ఞాదులే, ఎట్లన్న ఉభయలింగాత్ - రెండుస్థలములందును ప్రత్యభిజ్ఞానమనెడి హేతువవ్వుటవలన

453 అనభిభవం చ దర్శయతి (3-4-35)

అర్థము - అనభిభవం చ - తిరస్కారాభావమును, దర్శయతి - చూపించుచున్నది 'ధర్మేణ పాపమపనుదతి" ఇత్యాదులందు యజ్ఞాదిధర్మములను చెప్పి వానిచే విద్యకు తిరస్కారము లేదనిచెప్పి పాపకర్మలనుత్పత్తిప్రతిబంధకమును చెప్పుచున్నది అందువలన ఉభయత్ర వినియోగముం

డుటవలన కేవలాశ్రయణముగలవానికిముముక్షువులకును యజ్ఞాదులు అనుష్ఠానయోగ్యములైనవి

అధికరణ సంగ్రహము - విద్యాంగకములైన కర్మలు కేవలాశ్రమాంగములు గాదని నిత్యానిత్య సంయోగవిరోధము ప్రసంగించుటచేతనని శంకించి ఏకవినియోగంచేత ఉభయాంగత్వం పుట్టినప్పటికి నిత్యానిత్యసంయోగవిరోధము ప్రసంగించును ఇచ్చట వినియోగపృథక్త్వేన జీవనాధికారకామనాధికారములవలె విరోధంలేనందువల్ల కేవలాశ్రమాంగమని నిర్ణయించబడినది

118 విధురాధికరణము (3–4–9)

454 అంతరాచాపి తు తద్దృష్టే (3-4-36)

అర్థము - తద్దృష్టే - విద్యాప్రత్యక్షమువలన, అంతరా చాపి తు - ఆశ్రమములు విడిచిన వారికి అధికారమున్నది ఆశ్రమములేని విధురాదులకున్ను బ్రహ్మవిద్యయందు అధికారమున్నదాలేదాయని సంశయము ఆశ్రమధర్మముంచే ఈ ప్రకారము చేయతగినది విద్యకు విధియుండుట వలన ఆ ధర్మములేకపోవుటవలన వారికి అధికారములేదని పూర్వపక్షము

సిద్ధాంతము - ఊర్ధ్వరేతస్సులయందున్నట్లు రైక్వాది అనాశ్రములందును విద్యకు స్థితియుండుటవలన ఆశ్రమశ్రూన్యులైన వారైనను జపము, ఉపవాసము, దానాదులచేత వారికి విద్యానుగ్రహమౌచున్నందువలన అధికారమున్నది

సూత్రార్థము - తు శబ్దము పక్షమును వ్యావృత్తిచేయుచున్నది చ శబ్దము అవధారణార్థకము అంతరాపి - ఆశ్రమములను విడిచిపెట్టియుండెడి ఆశ్రమవాసులకున్ను అధికారమున్నది ఎట్లన్న తద్దృష్టే - రైక్వుడు మొదలైనవారియందు విద్యానిష్ఠదర్శనముండుటవలన

455 అపి స్మర్యతే (3-4-37)

అర్థము - అపి స్మర్యతే - స్మృతిచేతనూ చెప్పబడుచున్నది మరియు ఆశ్రమవిద్యానుగ్రహణపాదులచేతనే విద్యానుగ్రహస్మరణచేయబడు చున్నది "జప్యేనాపి చ సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయ " ఇత్యా దులవలన

456 విశేషానుగ్రహశ్చ (3-4-38)

అర్థము - విశేష - విశేషమైన, అనుగ్రహ - అనుగ్రహము వినబడుచున్నది ఆశ్రమమందు అవిరుద్ధములైన ధర్మవిశేషముచేతను విద్యానుగ్రహము శ్రుతియందు ప్రసిద్ధమైనది "తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా త్మానమన్విష్యేత్" అని

457 అతస్త్వితరజ్జ్యాయో లింగాచ్చ (3-4-39)

అర్థము - అత - అనాశ్రమిత్వముకంటే, ఇతరత్ - ఆశ్రమిత్వము, జ్యాయాన్ - శ్రేష్ఠమైనదని, లింగాచ్చ - స్మృతివలనను అత అనా శ్రమిత్వముకంటే, ఇతరత్ - ఆశ్రమమందుండడము, జ్యాయ - శ్రేష్ఠము, ధర్మములాధిక్యమువలన, లింగాత్ - స్మృతి వలనని, "అనాశ్రమీ న తిష్ఠేత్తు దినమేకమపి ద్విజ" అని స్మృతియందు చెప్పబడుచున్నది అందువలన ఆశ్రమరహితుడై విద్యయందు నిష్ఠను సంపాదించడము ఆపద్విషయమని అభిప్రాయము

అధికరణ సంగ్రహము - అనాశ్రములైన విధురాదులకు ఆశ్రమధర్మేతికర్త వ్యతాకమైన బ్రహ్మవిద్యయందధికారములేదని శంకించి అనాశ్రములగు రైక్వభీష్మాదులకు బ్రహ్మవిద్యా అనుష్ఠానముండుటచే విధురాదులకు దానాదులైన కొన్నికర్మలుండుటచే బ్రహ్మవిద్యయందు అధికారముకలదని నిర్ణయించబడినది

118 తద్భూతాధికరణము (3-4-10)

458 తద్భూతస్య తు నాతద్భావో జైమినేరపి నియమాత్తద్రూపాభావేభ్యః (3-4-40)

అర్థము - తద్భూతస్య - నైష్ఠికవైఖానసాదులకు, తద్భావ - అప్రకారం కావడము, న - సంభవించదు, తద్రూపాభావేభ్య - నైష్ఠికాద్యాశ్రమధర్మాభావమువలన, నియమాత్ - నియమమువలన, న - సంభవించదని, జైమిని - ఈ సంగతి జైమినికి ఇష్టము నైష్ఠికవైఖానసపరివ్రాజకులు మొదలైనవారు తన ఆశ్రమమువలన జారినవారికి విద్యయందు అధికారముకలదా లేదాయని సంశయము విధురాదులవలె జపాదులచే అనుగ్రహము సంభవించుటవలన అధికారము కలదని పూర్వపక్షము

సిద్ధాంతము - స్వాశ్రమభ్రష్టులైన నైష్ఠికాదులకు ప్రాయశ్చిత్తాభావస్మరణమువలన శిష్ట బహిష్కృతులౌటచే వారికధికారములేదు

సూత్రార్థము - తద్భూతస్య తు నాతద్భావ - నైష్ఠికాది భూతులకు అట్లుండకపోవుట సంభవించదు ఎట్లన్న శాస్త్రములచేత అరూపమభావముగును తద్రూపాభావా - నైష్ఠికాది ఆశ్రమధర్మములయొక్క అభావములు, తేభ్యో నియచ్ఛంతి హి శాస్త్రాణి - వారికొరకు శాస్త్రములు కట్టుబడుచున్నవి "బ్రహ్మచార్యాచార్యకులవాసీ తృతీయోఽత్యంతమాత్మానం ఆచార్యకులేఽవసాదయన్" అని నైష్ఠులకచ్చుటనే నియమము, "అరణ్యమియాత్తతో న పునరేయాత్" అని వైఖానసునికి "సన్యస్యాగ్నిం న పునరావర్తయేత్" అని పరివ్రాజకునికి ఆ కారణంచే వారికి అనాశ్రమిత్వమైన అవస్థాభావమువలన విద్యాధికారము సంభవించదు జైమినికి సహాసించితతమైనది

459 న చాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్ (3-4-41)

అర్థము - అధికారం - అధికారలక్షణమందు చెప్పబడినదియు, న - సంభవించదు, పతనానుమానాత్ - పతనము చెప్పుటవలన, తదయో

గాత్ - నైష్ఠికునికి అదిలేకపోవుటవలన అధికారికం - అధికారలక్షణ మందు చెప్పబడిన "అవకీర్ణి పశుశ్చ తద్వత్" అనెడి ప్రాయశ్చిత్తం నైష్ఠి కునికి సంభవించదు ట్లన్న నైష్ఠునికి పతనానుష్ఠాముండుటచేత ప్రాయశ్చి త్తయోగము లేకపోవును అతనికి ప్రాయశ్చిత్తములేకపోవుటచే తన పత నము స్మరింపబడుచున్నది

"ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రత్యవతే ద్విజ ।
ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుద్ధ్యేత్స ఆత్మహా"

అని ఆ కారణంవలన ఉపకుర్వాణబ్రహ్మచారి విషయమైనది అధికారిక మని తెలియవలయును

460 ఉపపూర్వమపీత్యేకే భావమశనవత్తదుక్తమ్ (3-4-42)

అర్థము - ఏకే - కొందరు, భావం - ప్రాయశ్చిత్తస్థితిని తెలియు దురు అశనవత్ - మధ్వశనాది నిషేధమువలె, ఉపపూర్వం - ఏ కారణమువలన ఉపపాతకమో, తత్ - ఈ సంగతి, ఉక్తం - స్మృతి కారులచేత చెప్పబడినది ఏకే - కొందరు ప్రాయశ్చిత్తభావమును తెలి యుచున్నారు ఏ కారణమువలన ఇది ఉపపూర్వం ఉపపాతకమో అశన వత్ - అశనమువలె మధ్వాశాదులయొక్కనిషేధతప్రాయశ్చిత్తము వలె, భవతి - అవుచున్నదని అర్థము అందువలన ఉపపాతకముచేసిన బ్రహ్మచారికి చెప్పబడిన అధికారం ఇతనికి సంభవించుచున్నది స్మృతి కారులచే ఈ అర్థమే చెప్పబడెను "ఉత్తరేషాం చైతదవిరోధి" అని ఉప పాతకముచేసిన బ్రహ్మచారియందు చెప్పబడిన ఆశ్రమముగలవానికి తమఆశ్రమమునకు విరోధికాదని అర్థము

461 బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ (3-4-43)

అర్థము - ఉభయథాపి - ఉపపాతకమహాపాతకమైనను, బహి - బహిర్భూతమేను, స్మృతే - స్మృతివలన, ఆచారాచ్చ - శిష్టాచారమువలన ఉభయథాపి - ఉపపాతకమందు మహాపాతకమందును నైష్ఠికమువలన జారినవాడు కర్మాధికారముచే బహిర్భూతుడు "ప్రాయశ్చిత్తం న పశ్యామి" అని స్మృతియుండుటవలన ఆచారంనుంచీ జారిన ఇతనిని శిష్టులు విద్యోపదేశంనుంచీ వర్జించుచున్నారు ఎట్లైనను పాపనాశంకొరకు కొందరిచేత ప్రాయశ్చిత్తము చెప్పబడినది ఐనను కర్మయందు అధికారాపాదనీశుద్ధివారలకు సంభవించదని అభిప్రాయము

అధికరణ సంగ్రహము - నైష్ఠికవైఖానసపారివ్రాజకాద్యాశ్రమభ్రష్టులకు విధురాదివ్యాయేన బ్రహ్మవిద్యయందధికారముసైదనిశంకించి ఆశ్రమధర్మబహిష్కృతులకు ప్రాయశ్చిత్తాభావ శ్రవణంచేతను శిష్టబహిష్కారం వల్ల బ్రహ్మవిద్యందధికారము లేదని నిర్ణయించబడినది

120 స్వామ్యధికరణము (3-4-11)

462 స్వామిన ఫలశ్రుతేరిత్యాత్రేయ (3-4-44)

అర్థము - స్వామిన - యజమానునికి, ఫలశ్రుతే - ఫలశ్రవణమువలన, ఇతి - ఇట్లని, ఆత్రేయ - ఆత్రేయులు తెలియుదురు ఉద్గీథాదులయుపాసనము యజమానునిచేత చేయదగినదా లేక ఋత్విక్కుచేతనాయని సంశయము "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం" అని క్రతువీర్యవత్తరత్వరూపమైన ఫలము యజమానునికేనని దహరోపాసనవలె యజమానునిచేత చేయదగినదని పూర్వపక్షము ఈఉపాసనకు కర్మాగాశ్రయత్వము వలన కర్మకు ఋత్విక్కు సంబంధంచేత అదియు ఋత్విక్కుచేత అనుష్ఠానము చేయతగినదని గోదోహనాదులవలెయని సిద్ధాంతము

సూత్రార్థము -- స్వామిన - యజమానునికి ఉద్గీథోపాసనయందు కర్తృత్వము, ఎట్లన్న ఫలశ్రుతే - యజమానునికే ఫలంయొక్క శ్రవణముండుట చేతనని ఆత్రేయులు చెప్పుదురు

463 ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మై హి పరిక్రీయతే (3-4-45)

అర్థము - ఆర్త్విజ్యం - ఋత్విక్కులచే చేయతగినది, ఇతి - ఈ ప్రకారమని, ఔడులోమి - ఔడులోమాచార్యులు చెప్పుదురు, తస్మై హి - యజమానునికొరకు, పరిక్రీయతే - ఋత్విక్ పరికరంగా చేయబడును క్రత్వంగమునకు ఆశ్రయమౌటచేత క్రతువందధికారముగలవానికే దీని యందధికారముండుటవలన క్రతువుకు ఋత్విక్కు కార్యత్వముచేత ఆ ఉద్గీథోపాసనము ఋత్విక్కు కార్యమని ఔడులోమాచార్యులు తెలియుదురు యజమానునియొక్క ఫలసాధనత్వం ఉండినను క్రతువుకు దానియనుష్ఠానముకొరకు ఋత్విక్కులయొక్క అంగీకారమని భావము

అధికరణ సంగ్రహము - ఉద్గీథాద్యుపాసనము వీర్యవత్తఫలకాముడైన యజమానునివలన దహరాద్యుపాసనములవలె అనుష్ఠేయమని శంకించి గోదోహనాదులవలె ఈ ఉపాసనము కర్మాంగాశ్రయమౌటవలన కర్మాంగములవలె ఋత్విక్కర్తృకమని నిర్ణయించబడినది

121 సహకార్యంతర విధ్యధికరణము (3-4-12)

464 సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్ (3-4-45)

అర్థము - తద్వతః - విద్యావంతునికి, సహకార్యంతర - మరియొక సహకారికారణమైనవిధి విధ్యాదివత్ - యజ్ఞదానాది ఆశ్రమధర్మము వలె, తృతీయం - మూడవదిగా, పక్షేణ - మునిశబ్దమునకు ప్రసిద్ధి వలన విధిచేయబడును " తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం పాండిత్యం చ నిర్విద్యాథ ముని " అని ఇచ్చట మౌనము విద్యాంగత్వముచేత విధింపబడుచున్నదా లేక అనువాదము చేయబడుచున్నదాయని సంశయము మౌనమునకు మననరూపత్వముండుటచే అనువాదముచేయబడుచున్నదని పూర్వపక్షము

సిద్ధాంతము - మునిశబ్దమునకు అధికమైన మననశీలునియందే ప్రసిద్ధి కల్గియుండుటచే ప్రకృష్టమైన మననము ఉపాసనకు యోగ్యమైన వస్తువు

యొక్క అభ్యాసరూపమైనది గనుక విద్యానిష్పత్తికొరకు విధించుచున్నదని సిద్ధాంతము

సూత్రార్థము - తద్వత - విద్యగలవానికి సహకార్యంతరరూపమైన విధి, మౌనవిధి - విధీయత ఇతి విధి అనే సమాసంచేత మౌనమే విధించుచున్నదని చెప్పబడినది విధ్యాదివత్ - ఇచ్చటను విధీయత ఇతి విధి యజ్ఞము, దానము మొదలైన ఆశ్రమధర్మములు ఆదిశబ్దముచే శ్రవణమననములు గ్రహింపబడుచున్నవి ఆశ్రమధర్మములవలె శ్రవణమననములవలెను పాండిత్యబాల్యములకు మూడవదియు సహకారియైన మౌనం అపూర్వంగా విధించుచున్నది ఎట్లన్న చెప్పుచున్నారు, (పక్షేణేతి) ముని శబ్దమునకు ప్రకృష్టమైన మననయుక్తునియందు ప్రసిద్ధియుండుటవలనని యర్థము

465 కృత్స్నభావాత్తు గృహిణోపసంహార (3-4-46)

అర్థము - గృహిణోపసంహార - గృహస్థాశ్రమధర్మముచేత ఉపసంహారము, కృత్స్న - సమస్త ఆశ్రమములందును, భావాత్ - విద్యుండుటవలన సమస్తమైన ఆశ్రమముగలవారికి విద్యయుండినను ఛాందోగ్యమందు "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోకం అభిసంపద్యతే" అని గృహస్థధర్మముచే ఉపసంహారము చేసినది సమస్తమైన ఆశ్రమధర్మప్రదర్శనార్థమని అర్థము ఎట్లన్న కృత్స్నభావాత్ - సమస్తములైన ఆశ్రమములందును విద్యయుండుటచేతనని యర్థము

466 మౌనవదితరేషామప్యుపదేశాత్ (3-4-47)

అర్థము - మౌనవత్ - మౌనమువలె, ఇతరేషామపి - ఇతరములకును, ఉపదేశాత్ - ఉపదేశమువలన "అథ ముని" అనువాక్యమందు "భిక్షాచర్యం చరతి" అని పారివ్రాజ్యైకాంతధర్మముచేత ఉపసంహారము చేసినదిన్ని సమస్తమైన ఆశ్రమధర్మప్రదర్శనార్థం భిక్షాచర్యమును

మౌనము మొదలైనవానివలె ఇతరధర్మాశ్రములకును యజ్ఞాదులకును ఉపదేశముండుటచే

అధికరణ సంగ్రహము - "బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిః" అనుచోట మునిశబ్దముచేత చెప్పబడినమౌనము మననరూపమగుట చేతను "మంతవ్య" అన్నట్లుగా మననము అనువదించబడుచున్నదని శంకించి శ్రవణప్రతిష్ఠార్థమైనమననము ప్రాప్తమైనను శుభాశ్రయసంశీలన రూపమననము ప్రాప్తముకానందున విధివిధముగా మననము విద్యాసహ కారిగా విధించబడుచున్నదని నిర్ణయము

122 అనావిష్కారాధికరణము (3-4-13)

467 అనావిష్కుర్వన్నన్వయాత్ (3-4-48)

అర్థము - అన్వయాత్ - అన్వయమువలన, నావిష్కుర్వన్ - బాలుని స్వభావంవలె విద్వాంసుడు ఉండవలెను "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిః" అనుచోట బాలునికర్మసమస్తకామచారాదులు విద్వాంసునికి ఉపాదేయమా లేక విద్యామాహాత్మ్యముచేత ఆవిర్భావము లేదాయని సంశయము "బాల్యేన తిష్ఠాసేత్" అని అవిశేషవిధానంవల్ల కామచారాదులు సర్వము ఉపాదేయం అని పూర్వపక్షము విద్వాంసునికి అవిశేషవిధానంవల్ల విద్యా మాహాత్మ్యముచేత నిషేధ శాస్త్రములు బాధితములుగాకపోవియుని

సిద్ధాంతము - పాండిత్యప్రయుక్తస్వమాహాత్మ్యము యొక్క ప్రకాశనాభా వమే విద్యాన్వయ యోగ్యత్వముచేత ఉపాదేయమైనదని ఇతరకామచారా దులు "నావిరతో దుశ్చరితాత్" ఇత్యాది శాస్త్రంవల్ల విద్యోత్పత్తివిరోధం తెలియబడుటవలన ఆ కారణంచే ఏ ప్రకారం బాలుడు తన వంశము మొదలైనవాటిని చెప్పకమందునో ఆ ప్రకారం విద్వాంసుడును ఉండదగి నదని యుక్తము

అధికరణ సంగ్రహము - "బాల్యేన తిష్ఠాసేత్" అనుచోట ఉపాసకునికి విధించబడు బాలకర్మ కామచారాదులౌటచే అవి విద్యామాహాత్మ్యము వలన ఉపాదేయమని శంకించి దుశ్చరితము విద్యోత్పత్తివిరోధిగా శ్రుతమౌటచేత పాండిత్యప్రయుక్తస్వమాహాత్మ్యానావిష్కరణము బాల్య శబ్దార్థాని ష్కరణమౌటచే కామచారాదులు అనుపాదేయములని నిర్ణయించబడినది

123 ఐహికాధికరణము (3-4-14)

468 ఐహికమప్రస్తుతప్రతిబంధేతద్దర్శనాత్ (3-4-49)

అర్థము - ఐహికం - ఐహికఫలసాధనమైనయుపాసనము, అప్రతిబంధే - ప్రబలకర్మాంతర ప్రతిబంధంలేకపోయినపక్షం, తద్దర్శనాత్ - అట్లు ప్రత్యక్షమువలన మోక్షముకంటే అతిరిక్తమైన అభ్యుదయఫలముపాసనము తనకు సాధనభూతమైన పుణ్యకర్మకంటే అనంతరం పుట్టుచున్నదా లేక తర్వాతకల్పక అనియమమాయని పూర్వపక్షము

సిద్ధాంతము - అప్రస్తుతమందు ప్రబలమైన కర్మాంతరప్రతిబంధమౌటుండగా అనంతరం ప్రస్తుతమైనదానికి ఉత్తరకాలమందే అని నియమము లేదు ప్రబలకర్మాంతరముచేత ప్రతిబంధఫలము చూడబడుచున్నది "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అని ఉద్గీథోపాసనకు క్రతువుయొక్క మరియొకకర్మచేత ఫలాప్రతిబంధఫలమని "పృథఘ్యప్రతిబంధ ఫలమిత్యభ్యుపగమాత్" అను సూత్రము వ్యాఖ్యానముచేయబడినది ఐహికం - అభ్యుదయఫలమని అర్థము

అధికరణ సంగ్రహము - అనాముష్మికఫలోపాసనములు స్వసాధనభూతకర్మానుష్ఠానాంతర నియతోత్పన్నములౌచున్నవని శంకించి ప్రతిబంధముండినచో విలంబేనోత్పన్నములగును ప్రతిబంధకములేనయెడల అవిలంబేనోత్పన్నములగునని నిర్ణయించబడినది

124 ముక్తిఫలాధికరణము (3-4-15)

469 ఏవం ముక్తిఫలానియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతే- (3-4-50)

అర్థము - ఏవం - ఈ ప్రకారం, తదవస్థ - ఆ క్రమముయొక్క, అవధృతే -తెలియుటవల్ల, ముక్తిఫలాని - ముక్తిఫలమునకును, అనియమః - నియమములేదు ముక్తిఫలములగు ఉపాసనలు స్వసాధనభూతాతిశయ పుణ్యకర్మలకంటే తర్వాత పుట్టుచున్నవా లేక పూర్వంవలె నియమములేదాయని సంశయము ముక్తిఫలములగు ఉపాసనలకు సాధనభూతమైన కర్మలకు సమస్తకర్మలకంటె బలీయస్త్వముచేత ప్రతిబంధాభావమువలన తర్వాతే పుట్టుచున్నదని పూర్వపక్షము

సిద్ధాంతము - అచ్యుతను బ్రహ్మవేత్తల అపచారము దానికంటే బలవత్తరత్వముచే ప్రతిబంధకము సంభవించుటచేత అనియమమేనని సిద్ధాంతము

సూత్రార్థము - ముక్తిఫలములకున్ను ఈప్రకారమే నియమములేదు ఎందుకంటే తదవస్థావధృతే - ప్రతిబంధకముండినయెడల ఫలము అనియమము రెండుమార్లుచెప్పుట అధ్యాయపరిసమాప్తిని సూచనచేయుటకొరకని అర్థము

అధికరణ సంగ్రహము - బ్రహ్మవిద్యలు మహాతిశయశాలులైనందున స్వసాధనీభూత కర్మానుష్ఠానానంతరం నియమోత్పన్నములౌచున్నవనిశంకించి దానికి బ్రహ్మవిదపచారాదులైన అతిక్రూరమైన ప్రతిబంధకములు సంభావితములౌటచే అనియమోత్పన్నములౌచున్నవని నిర్ణయించబడినది ఇందులో ద్వితీయతృతీయైకాదశాధికరణములు ప్రాసంగికములు అవశిష్టద్వాదశాధికరణమందు దశాధికరణముచే విద్యయే మోక్షసాధనమని తత్తదాశ్రమోచితములైన కర్మలే తత్తదాశ్రమిలవిద్యలకు నియతాంగములనియు అనాశ్రమిలైన విధురాదులకు తపోదానాదులైన కర్మలు విద్యాంగములనియు శమవిశేషణరూపమైన దుష్టాన్నపరిహారము విద్యాంగమనియు విద్యాంగములకే ఆశ్రమాంగత్వమున్నదనియు ఆశ్రమభ్రష్టులకు కేవల తపోదానాదులు విద్యాంగములుకావందున విద్యయుండనన్వయములేదనియు శుబాశ్రయసంశీలనరూపమైన మననమేమి పాండిత్యావిష్కరణరూప

రైన బాల్యమేమి వీనికి అంగమవియు అంగములను నిరూపించి అవశిష్ట చతుర్దశపంచదశాధికరణములవలన ప్రతిబంధకవిరహితదశయందు అంగములవలన అంగియైన ఉపాసన నిష్పత్తి నిర్ణయించబడినది

తృతీయాధ్యాయమున చతుర్థపాదము ముగిసెను

# చతుర్థాధ్యాయము - ప్రథమపాదము

**125 ఆవృత్త్యధికరణము (4-1-1)**

**470 ఆవృత్తిరసకృదుపదేశాత్ (4-1-1)**

అర్థము - అసకృత్ - పలుమార్లు చేయబడిన, ఆవృత్తి - ఆవృత్తి, ఉపదేశాత్ - ఉపదేశమువల్ల శాస్త్రోక్తము "బ్రహ్మవిదాప్నోతి పరమ్", "తమేవం విద్వానమృత ఇహ భవతి" ఇత్యాది వేదాన్తవిహితమైన వేదనము ఒకసారి చేయవలసినది శాస్త్రార్థమా లేక పలుమార్లు ఆవృతమైన వేదనమా అని సంశయము ఒకసారిచేయబడినదే అనిపూర్వపక్షము "స యో హ వై తత్పరం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఇత్యాదులందు వేదనమునకు ముక్త్యుపాయత్వము చెప్పుటచే ఒకసారి చేయబడిన వేదనమందునూ శాస్త్రార్థనివృత్తివల్ల దానికసకృదావృత్తి యందు ప్రమాణములేకపోవుటచే

సిద్ధాంతము - "యస్తద్వేద యత్స వేదస్స మయైతదుక్త" అనియుపక్రమించి "అనుమ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతాం ఉపాస్సే" అని ఏకవాక్యమందు వేదనోపాసనమునకు వ్యతిహారముగా ప్రయోగముండుటచే సమానార్థములలో "బ్రహ్మవిదాప్నోతి పరమ్", "ఆత్మా వా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇత్యాదులలో ధ్యానవిద్యలకు భేదముండుటచే ధ్యానముపాసనాది శబ్దార్థము అసకృదావృత్తమగు స్మృతిసంతానరూపమైన వేదనమే శాస్త్రార్థమని నిశ్చయించబడినది

సూత్రార్థము - (ఆవృత్తిరసకృత్) బ్రహ్మప్రాప్తికి సాధనమైన వేదనము అసకృదావృత్తమేయని శాస్త్రార్థము వేదనము ధ్యానశబ్దవాచ్యమనియర్థము ఎట్లన్న (ఉపదేశాత్) "ఓమిత్యేవాత్మానం ధ్యాయాత", "నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే, "ఆత్మానమేవ లోకముపాసీత", "ఆత్మా వారే ద్రష్టవ్యః" ఇత్యాదులందు ఉపాసనోపసంహారమును ఉపదేశించుట

చేత ఉపాసనము అవిచ్ఛిన్నస్మృతిసంతానరూపమని పూర్వమే చెప్పబడినది

తాత్పర్యము - మోక్షసాధనీభూతజ్ఞానము అసకృదావృత్తము

471 లింగాచ్చ (4-1-2)

అర్థము - లింగాచ్చ స్మృతివలన

లింగం - స్మృతి ఈయర్థము స్మృతియందు చెప్పబడును "మాం ధ్యాయన్త ఉపాసతే । తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్", "యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే", "తద్రూపప్రత్యయే చైకా సంతతిశ్చాన్యనిస్పృహా । తద్ధ్యానం ప్రథమైష్షడ్భిరఙ్గైర్నిష్పాద్యతే హ తత్ ॥" యని

అధికరణ సంగ్రహము - మోక్షసాధనీభూతజ్ఞానమసదావృత్తమని శంకించి నిరంతరధ్యానరూపమే మోక్షసాధనమని శ్రుతిసిద్ధమగుటవలన అసకృత్ కర్తవ్యమని నిర్ణయించబడినది

125 ఆత్మత్వోపాసనాధికరణము (4-1-2)

472 ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ (4-1-3)

అర్థము - ఆత్మేతి తు - ఆత్మయని, ఉపగచ్ఛంతి - తెలియుదురు గ్రాహయంతి చ - ఈవిధముగా శాస్త్రములు తెలుపుచున్నవి

ఉపాస్యమైన బ్రహ్మము ఉపాసకునికంటె వేరుగా అనుసంధించవలెనదా లేక ఆత్మయనియా యని సందేహము "అధికం తు భేదనిర్దేశాత్", "అధికోపదేశాత్", మొదలగువానియందు ఉపాసకునకు ఉపాస్యునకు భేదము చెప్పబడుటవలన యథావస్థితమైన వస్తువునకే భేదముండుటవలన అనన్యత్వముచేతనే ఉపాసన చేయవలెనని పూర్వపక్షము

సిద్ధాంతము - "త్వం వా అహమస్మి భగవో దేవతే అహం వై త్వమసి భగవో దేవతే" అని పురాతనులైన ఉపాసకులు ఉపాస్యమును ఆత్మగా తెలియుచుందురుగాన ఆత్మయే ఉపాస్యము అట్లు ఉపాసనచేయువారలగురించి వేరైనను బ్రహ్మను ఉపాసకుని ఆత్మగా శాస్త్రములు గ్రహింపజేయుచున్నవి 'య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః" అని ఆరంభించి ఉపాసకుడు పరమాత్మకు శరీరమనియు, పరమాత్మ ఉపాసకునకు ఆత్మయనియు చెప్పుటచేతను, "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి", "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః ఐతదాత్మ్యమిదం సర్వం" యని పరమాత్మాధీనస్వరూపస్థితి ప్రవృత్తిత్వమును ప్రతిపాదించెను ఇట్లు ఉపాసకుని ఆత్మకు ఆత్మగా పరమాత్మయుండుటవలన యథావస్థితస్వాత్మశరీరకుడైన బ్రహ్మానుసంధానమందు అహం అను అనుసంధానము చేయదగినది ఎట్లనగా నేను మనుష్యుడనైతిని యనుచోట స్వశరీరమునకు స్వప్రకారత్వమే ముఖ్యస్వభావము గలదగుటచేత ప్రకారియైన స్వాత్మయందు పర్యవసానమో అట్లే ఆత్మయందు అహంప్రత్యయమును, అహంశబ్దమును స్వాత్మవిషయములు గావు పరమాత్మకు శరీరమై తద్విశేషణముగానే తన ఆత్మయుండుటవలన

అధికరణ సంగ్రహము - "ఆత్మేత్యేవోపాసీత" మున్నగు వాక్యములచే ప్రతిపాదితమైన ఉపాసనవిశేషమందు అనన్యముగా ఉపాస్యమని శంకించి, ఆత్మగా ఉపాసించవలెనని నిర్ణయింపబడినది

126 ప్రతీకాధికరణము (4-1-3)

473 న ప్రతీకే హి సః (4-1-4)

అర్థము - ప్రతీకే - మనోరూపమైనదానియందు, న - ఉపాసింపదగినది కాదు సః -- ఆ యూత్మ న హి - కాదు

474 బ్రహ్మదృష్టిరుత్కర్షాత్ (4-1-5)

అర్థము - ఉత్కర్షాత్ - అతిశయమువలన, బ్రహ్మదృష్టిః - బ్రహ్మజ్ఞానము చేయతగినది

"మనో బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాదిలందు ప్రతీకోపాసనములలో ఆత్మత్వముచే అనుసంధానము చేయతగినదా కాదా యని సంశయము "మనో బ్రహ్మేత్యుపాసీత" యని బ్రహ్మోపాసనత్వావిశేషము వలన ఆత్మ యనే అనుసంధానము చేయతగినదియని పూర్వపక్షము

సిద్ధాంతము - ప్రతీకమందు ఆత్మత్వానుసంధానము చేయతగినది కాదు ఏమనగా మనస్సు మొదలగునవి ఉపాసకునికి ఆత్మకాదు అచ్చట బ్రహ్మముపాస్యముకాదు బ్రహ్మదృష్టిచే మనస్సు మొదలైనవి ఉపాసన చేయదగినవి భృత్యాదులయందు రాజదృష్టివలె అపకృష్టునియందు ఉత్కృష్టదృష్టి అభ్యుదయముకొరకగుచున్నది

అధికరణ సంగ్రహము - "మనో బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాదిప్రతీకోపాసనలలో బ్రహ్మోపాసనత్వసామ్యముచే ఉపాసకుని ఆత్మగా బ్రహ్మ ఉపాసించదగినదని శంకించి ఆ ఉపాసనలలో ప్రతీకమైన మనస్సు మొదలగునవి ఉపాస్యములగుటచేతనూ బ్రహ్మముపాస్యము కానందువలన ఈ చోట్లలో బ్రహ్మము ఉపాస్యముకాదని నిర్ణయించబడినది

127. ఆదిత్యాదిమత్యధికరణము (4-1-4)

475 ఆదిత్యాదిమతయశ్చాఙ్గ ఉపపత్తేః (4-1-6)

అర్థము - అంగ - కర్మాంగములందు, ఆదిత్యాది - సూర్యుడు మొదలైన వారి, మతయః - బుద్ధులే, ఉపపత్తేః - సంభవించుటచే చేయదగినవి "య

...వాహ భవతి తముద్గీథముపాసీత" మొదలగు కర్మాంగాశ్రయ యుపాసన లందు ఉద్గీథాదులయందు ఆదిత్యదృష్టి చేయదగినదా లేక ఆదిత్యుని యందు ఉద్గీథదృష్టి చేయదగినదా యని సంశయము కర్మలకు ఫలసాధ నత్వాతిశయమువలన ఆదిత్యునికి దేవతాత్వముచేత దాని గుణత్వమువ ...న ఆదిత్యాదులందు ఉద్గీథాదిదృష్టి చేయదగినదని పూర్వపక్షము

...ద్ధాంతము - కర్మకు ఫలసాధనత్వము ఆదిత్యుడు మొదలగు దేవతల యొక్క ఆరాధనమార్గముచేత సంభవించునని ఆదిత్యుడు మొదలగు ...రికి ఉత్కర్ష కుదురును గనుక ఆదిత్యాదిజ్ఞానమే కర్మాంగమైన ఉద్గీథా ...లయందు చేయదగినది

అధికరణ సంగ్రహము - ఫలసాధనముగా ఉత్కృష్టమైన ఉద్గీథాదిదృష్టి ఆదిత్యాదిలలోనని శంకించి, ఆదిత్యాదులే ఫలప్రదులుగా ఉత్కృష్టులగుట చేత ఉద్గీథాదులలో ఆదిత్యాదిదృష్టియే ఉన్నదని నిర్ణయించబడినది

128 ఆసీనాధికరణము (4-1-6)

476 ఆసీనస్సంభవాత్ (4-1-7)

...క్షము - ఆసీనః - బ్రహ్మోపాసనము కూర్చున్నవాడచేయ్యే, సంభవాత్ - ...కు కుదురుటవలన

ఈ బ్రహ్మోపాసనమును కూర్చుని చేయవలయునా? లేక పరుం ...డై నిలువబడినవారై, లేక నియమములేకుండగనే చేయతగునా ...సంశయము విశేషశ్రవణము లేకపోవుటవలన నియమములేకనే ...యదగినదని పూర్వపక్షము

...ద్ధాంతము - ఆసీనుడైన వానికే ఏకాగ్రతయుండుట కుదురును గనుక ఏకాగ్రతతో చేయవలసిన ఉపాసనము ఆసీనుడయ్యే చేయవలయును

477 ధ్యానాచ్చ (4-1-8)

...ర్థము - ధ్యానాచ్చ - ఉపాసనము ధ్యానరూపముగా నుండుటవలనను

"నిదిధ్యాసితవ్యః" అని ఉపాసనకు ధ్యానరూపత్వముండుటవలన ఏకాగ్రచిత్తముతో నుండుట ఆవశ్యకము ధ్యానమనగా విజాతీయమైన మరియొక జ్ఞానముచేత వ్యవహితముగాని తైలధారవలె విచ్ఛేదములేని స్మరణపరంపర వంటిది

478 అచలత్వం చాపేక్ష్య (4-1-9)

అర్థము - అచలత్వం - నిశ్చలముగానుండుట, అపేక్ష్య - అపేక్షించతగినది నిశ్చలత్వమును అపేక్షించి ధ్యానవాక్యంయుక్తి పృథివ్యాదుల యందు చూడబడుచున్నది "ధ్యాయతీవ పృథివీ ధ్యాయతీవాంతరిక్షం ధ్యాయతీవ ద్యౌః" ఇత్యాదులలు కనుక ధ్యానము చేయువానికి పృథివి వలె కదలకయుండుట ఆసనమునందే కుదురును

479 స్మరన్తి చ (4-1-10)

స్మరన్తి చ - స్మృతులును చెప్పుచున్నవి

ఆసీనునికే ధ్యానము తెలియబడుచున్నది "ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే" అని

480 యత్రైకాగ్రతా తత్రావిశేషాత్ (4-1-11)

అర్థము - యత్ర - ఏదేశమందు ఏకాగ్రతా - చిత్తైకాగ్ర్యము సంభవించునో తత్ర - ఆదేశమందు, అవిశేషాత్ - విశేషములేకపోవుట వలన చేయదగినది ఏదేశకాలములందు మనస్సునకు ఏకాగ్రతయో ఆదేశకాలాదుల యందు ఉపాసన చేయదగినది "శర్కరాదిరహితే మనోనుకూలే శుచౌ దేశే" యని అతిరిక్తవిశేషముయొక్క గ్రహణము లేకపోవుట వలన ఏ ప్రకారము దేశకాలములందు ఏకాగ్రత్వమందు విశేషమో, ఆ ప్రకా

ఠము స్థితియందును గతియందును సంభవించును ఆసీనుడైన వానికి విశేషమున్నదని అభిప్రాయము

అధికరణసంగ్రహము - ఉపాసనానుష్ఠానము ఆసీనత్వ, శయానత్వ-స్థితి గమనాద్యవస్థలలోను విశేషములేక పోవుట వలన కుదురునని ఆసీనత్వావస్థయందుననే ఉపాసనానుష్ఠానమని నిర్ణయించబడినది

**129 ఆప్రయాణాధికరణము (4-1-7)**

**481 ఆప్రయాణాత్ తత్రాపి హి దృష్టమ్ (4-1-12)**

అర్థము - ఆ ప్రయాణాత్ - ప్రయాణమువరకు, తత్రాపి - అక్కడను, దృష్టమ్ - ఉపాసనము చూడబడినది

మోక్షమునకు సాధనమైన ఉపాసన ఒకదినము చేయదగినదా లేక ప్రతిదినము ప్రాణప్రయాణమువరకు చేయవలయునా అని సంశయము ఒకదినమునందే శాస్త్రార్థముచేత చేయ బడునది కనుక అంతమాత్రముచేతనే సమాపనీయమౌనని "యావదాయుషం" అనెడి వచనము విధిశబ్దమందు లేకపోవుటవలన విద్యకు ఫలముచేత ఉపసంహారమని పూర్వపక్షము

సిద్ధాంతము - ప్రాణప్రయాణమువరకు ఆవర్తన చేయదగినది ఎందువలన నగా ప్రయాణమందును ప్రసిద్ధముగ చూడబడినది "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోకమభిసంపద్యతే" అని అప్రాప్తత్వము చేత అనువాదత్వము సంభవించకపోవుటవలన దీనిని విధియని తెలియవలయును

అధికరణ సంగ్రహము - పూర్వము నిర్ణీతమయిన ఉపాసనము ఏకదినసంపాద్యమని శంకించి, "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం" అనే శ్రుతి చెప్పిన ప్రయాణమువరకు అనువర్తనీయమని నిర్ణయించబడినది

**130 తదధిగమాధికరణము (4-1-8)**

**482 తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్ (4-1-13)**

అర్థము - తదధిగమ - విద్యాప్రాప్తియందు, ఉత్తరపూర్వాఘయోః -- ముందు వెనుక పాపములకు, అశ్లేషవినాశౌ - అసంబంధనాశములు, తద్వ్యపదేశాత్ - ఆప్రకారము చెప్పుటవలన, సంభవించును

విద్వాంసునికి పూర్వోత్తరపాపముల అశ్లేషవినాశములు కలుగునా లేదా యని సంశయము "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అని భోగమువలననే కర్మక్షయమని చెప్పబడుటవలన అశ్లేషవినాశకమైన శ్రుతి ఏదయినను విద్యాస్తుతి పర్యవసాయి యని చెప్పదగినదని పూర్వ పక్షము

సిద్ధాంతము - రెండుశాస్త్రములకు భిన్నవిషయత్వముచేత విరోధములేక పోవుటవలన సంభవించుచున్నది కర్మలకు ఫలజననసామర్థ్యమును దృఢపరచుచున్నది నాభుక్తం క్షీయతే కర్మ" యని "ఏవమేవం విది పాపం కర్మ న శ్లిష్యతే" "ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" అను శ్రుతి విద్యకు దాని సామర్థ్యవిదారణశక్తి విషయము ఎటుల జలతేజస్సులకు శీతజననము శీతనివారణశక్తి విషయమందు చూడవచ్చును ప్రమాణములు విరోధమును పొందును

అధికరణ సంగ్రహము - విద్యాఫలత్వేన శ్రుతములైన పూర్వోత్తరాఘముల యొక్క అశ్లేషవినాశములు "నాభుక్తం" ఇత్యాదివచనవిరోధంబుచేత విద్యాప్రశంసార్థములని శంకించి, అశ్లేషవినాశములు విద్యాఫలములుగా శ్రుతులచే చెప్పబడుటచేత "నాభుక్తం" ఇత్యాదివచనములు ఫలజననశక్తిప్రదర్శనప్రతిపాదనపరములగుటచే ప్రశంసార్థములని నిర్ణయింపబడినది

**131 ఇతరాధికరణము (4-1-9)**

**483 ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు (4-1-14)**

అర్థము - ఇతరస్యాపి - ఇతరస్యాపి, పుణ్యమును, ఏవం - ఈ ప్రకారమే, పాతే తు - శరీరపాతమౌచుండగా, అశ్లేషః - సంబంధమభావమగును

ఈ అశ్లేషవినాశములు పుణ్యకర్మలకు సమానములైనవా కాదా యని సంశయము పుణ్యకర్మఫలము సుఖరూపమగుటచేత విద్వాంసునికి అనిష్టత్వాభావమువలన సమానముకాదని పూర్వపక్షము

సిద్ధాంతము - ముముక్షువునకు మోక్షవిరోధిత్వముచేత అనిష్టత్వము సమానముగనుక అశ్లేషవినాశములు సమానములే

సూత్రార్థము - ఇతరస్య - పుణ్యమునకును అనిష్టఫలత్వమందు సామ్యమువలన, ఏవం - అశ్లేష వినాశములు విద్యకు అనుగుణమైన వృష్టి అన్నము ఆరోగ్యాది ఫలమునకు శరీరపాతమునకంటె అనంతరమందు అనిష్టము కనుక అశ్లేషము

అధికరణ సంగ్రహము - సుకృతము శాస్త్రసిద్ధమగుటవలన విద్యావిరోధికాదనిశంకించి, సుకృతము అధికారాది భేదము చేత విద్యావిరోధి యని నిర్ణయించబడినది

132 అనారబ్ధకార్యాధికరణము (4-1-10)

484 అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః (4-1-15)

అర్థము - తదవధేః - శరీరమోక్షావధిత్వశ్రుతివల్ల, పూర్వే --పూర్వమందు చేయబడిన, అనారబ్ధకార్యే ఏవ - అనారబ్ధకార్యముగలవానియందేనని విద్యోత్పత్తికంటె పూర్వమందు చేయబడిన పుణ్యపాపములకు అవిశేషమువల్ల వినాశమా లేక అనారబ్ధకార్యములకాయని సంశయము "సర్వే పాప్మాన ప్రదూయంతే" అని అవిశేషమువల్ల అవిశేషమువల్లనే అని పూర్వపక్షము "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేథ సంపత్స్యే' అని ఉత్పన్నవిద్యగలవానికి శరీరమోక్షావధిశ్రుతివలన, సర్వవినాశమందు శరీరస్థితికి అనుపపత్తివలన అనారబ్ధకార్యమునకే వినాశము

**అధికరణ సంగ్రహము** - సర్వపూర్వాఘములును విద్యామాహాత్మ్యమువల్ల వినాశములని శంకించి అనారబ్ధకార్యముకే అది ఉంటుందని నిర్ణయించబడినది

**133 అగ్నిహోత్రాద్యధికరణము (4-1-11)**

**485 అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్ (4-1-16)**

**అర్థము** - తత్కార్యాయైవ - విద్యోత్పత్తికొరకు, అగ్నిహోత్రాది - అగ్నిహోత్రము మొదలైనవి అంగీకరించతగినవి, తద్దర్శనాత్ - ఈ ప్రకారం శ్రుతియందు ప్రత్యక్షమగుటవలన అగ్నిహోత్రములైన ఆశ్రమధర్మములు విద్వాంసునికి అనుష్ఠానము చేయతగినదా కాదాయని సంశయము సుకృతదుష్కృతములకు అశ్లేషవినాశములు చెప్పుటచే ఆశ్రమధర్మములకు సుకృతసామ్యముచేత అశ్లేషకార్యమనుష్ఠేయమని పూర్వపక్షము ఆశ్రమధర్మములకు విద్యోత్పత్తియే కార్యమని ఆకార్యముకొరకే అనుష్ఠానము చేయతగినది "తమేవం వేదానువచనేన బ్రహ్మణా వివిదిషంతి" ఇత్యాదులచే విద్యోత్పత్తికార్యత్వమగును అవిద్యయైతే ప్రయాణమునకు ప్రతిదినము చేయబడిన అభ్యాసాధేయాతిశయముచేత పుట్టించతగినది అగ్నిహోత్రాదిసాధుకృత్యములు విద్యోత్పత్తియే ప్రయోజనముగలదైనట్లైతే పూర్వము చేయబడిన సాధుకృత్యము అనుభవింపబడినఫలము ప్రారబ్ధము కలిగినదని "సుహృదస్సాధుకృత్యామ్" అనుదానికి విషయమేనని చెప్పుచున్నారు

**486. అతోఽన్యాపి హ్యేకేషాముభయోః (4-1-17)**

**అర్థము** - అత - అగ్నిహోత్రము మొదలైన సాధుకృత్యముకంటే, అన్యాపి హి - మరియొక విద్యయున్నది, ఉభయో: - పుణ్యపాపకర్మలసంక్రమణము, ఏకేషాం - కొన్నిశాఖలవాక్యమందు విషయము అత - అగ్నిహోత్రాదిసాధుకృత్యముకంటే విద్యాధిగమములైన అన్యమైన పుణ్యకర్మలు

అవగా శారీరి మొదలగుగాగల వృష్ట్యర్థముగా విద్యాంసులవలన చేయ బడినవి విద్యోత్పత్తికంటే పూర్వము చేయబడిన అనాదికాలమునుంచీ ప్రవర్తించతమున్ను ప్రబలకర్మాంతరప్రతిబంధఫలము చేత సాధు కృత్యము ఉంటున్నది ఆకారణముచే కొన్నిశాఖల్లో "సుహృదస్సాధు కృత్యామ్" అనువాక్యము తద్విషయకమైనది విద్యచేత అశ్లేషవినాశప్రతి పాదకమైన శ్రుతియును తద్విషయము చేయబడినకర్మకు ప్రబలకర్మ ప్రతిబంధకసంభవము పూర్వము చెప్పినదానిని విస్మరింపచేయు చున్నారు

487 యదేవ విద్యయేతి హి (4-1-17)

అర్థము - విద్యయా - విద్యచేతను, యదేవ - ఏదో, ఇతి హి - ఈ ప్రకా రము అని తెలియవలయును చెప్పబడిన ఉద్గీథవిద్యకు క్రతువుయొక్క కర్మాంతరప్రతిబంధకములేకపోవుటయేఫలమవి ఆ కారణమువల్ల ప్రబల ప్రతిబంధఫలముగల సాధుకృత్యమే సుహృత్త్వమందు సంక్రమించును

అధికరణ సంగ్రహము - అగ్నిహోత్రాదినిత్యనైమిత్తికవర్ణాశ్రమధర్మముల కును తత్ఫలమునకును అశ్లేషోక్త్యా అనుష్ఠానమప్రాప్తమని శంకించి విద్యోత్పాదకములైన స్వవర్ణాశ్రమోచితకర్మలకు ఫలాశ్లేషములేనందున అనుష్ఠానమప్రాప్తమని నిర్ణయించబడినది

134 ఇతరక్షపణాధికరణము (4-1-12)

488 భోగేన త్వితరే క్షపయిత్వాథ సంపద్యతే (4-1-18)

అర్థము - భోగేన - అనుభవముచేతను, ఇతరే - ప్రారబ్ధఫలపుణ్యపాపము లను, క్షపయిత్వా - నాశనముపొందించి, అథ - అనంతరమందు, సంప ద్యతే -- సంపత్తిని పొందుచున్నాడు ఇతరే - అనారబ్ధకార్యముగల పుణ్య పాపములు విద్యకు కారణమైన శరీరావసానమందే నాశనమును పొందునా లేదా యని సంశయము "యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అని

సంపత్తికి శరీరవిళంబము మాత్రమని శ్రుతియుండుటచే ఆ శ[illegible] మందే అని పూర్వపక్షము ప్రారబ్ధఫలముగల కర్మలకు భోగం చేసిన [illegible] నము చేయగదిపదనే అభిప్రాయముచేత "యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అని చెప్పబడుచున్నది శరీరమాత్రమే కాదు కర్మవిషయము కాగలిగినవి బంధమోక్షములు అందువల్ల ప్రారబ్ధములగు పుణ్యపాపములు తచ్ఛరీరావసానమందైనను శరీరాంతరావసానమందైనను అనుభవముచే సమాప్తిరై బ్రహ్మసంపత్తిగల్గును

అధికరణ సంగ్రహము - ప్రారబ్ధకర్మవినాశము విద్యారోపిశరీరావసానమందు నియమముగా వచ్చుచున్నదని శంకించి తచ్ఛరీరావసానమందైనను శరీరఅవసానమందైనను నియమముగా వచ్చుచున్నదని నిర్ణయించబడినది

చతుర్థాధ్యాయమున ప్రథమపాదము ముగిసినది

# చతుర్థాధ్యాయము - ద్వితీయపాదము

135 వాగధికరణము (4-2-1)

489 వాఙ్మనసి దర్శనాచ్చ (4-2-1)

అర్థము - వాక్ - వాక్స్వరూపము, మనసి - మనస్సునందు, దర్శనాత్ - ప్రత్యక్షమువలన, శబ్దాచ్చ - శబ్దముండుటవలనను "అస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మన ప్రాణే, ప్రాణస్తేజసి, తేజ పరస్యాం దేవతాయామ్" ఇత్యాదుల్లో ఉత్క్రాంతివిషయము చెప్పబడుచున్నది అచ్చట వాగింద్రియము మనస్సునందు సంపత్తిని పొందునా లేక వాగ్వృత్తిమాత్రమేనాయని సంశయము వాక్కుమనస్సుయొక్క ప్రకృతిత్వభావమువల్ల స్వరూపవిలయమక్కడసంభవించదని వాగ్వృత్తి మాత్రమే అభిప్రాయముగలదని పూర్వపక్షము అకారణమందు సంపత్త్య భావమునకు వాగ్వృత్తియందును సమానముగనుండుటవలన "వాఙ్మనసి" అని వాక్స్వరూపమునకే సంపత్తిశబ్దమువల్లను స్వరూపమే సంపత్తిని పొందును "వాఙ్మనసి సంపద్యతే" అని వాక్స్వరూపసంపత్తియందే శబ్దమున్నదని వృత్తిమాత్రసంపత్తియందని కాదు అకారణమందు లయము లేకపోవుటవలన సంపత్తిశబ్దయోగమే అభిప్రాయముగాగలది

490 అత ఏవ సర్వాణ్యను (4-2-2)

అర్థము - అత ఏవ - అకారణమువల్ల, సర్వాణి - సమస్తేంద్రియములు, అను - వాక్కును అనుసరించుననెడు వాదన కుదురును ఎట్లైతే వాక్కు మనస్సునందు సంయోగము చెప్పబడుచున్నదో లయముచెప్పబడదో అట్లే సమస్తేంద్రియములును వాక్కననుసరించి మనస్సునందు సంపత్తిని పొందుననెడి వచనము "వాఙ్మనసి సంపద్యత" అనువచనమువలె

కుదురును "తస్మాదుపశాంతితేజా అపునర్భవమింద్రియైర్మనసి సంపద్య మానై" అని

అధికరణ సంగ్రహము - "వాఙ్మనసి సంపద్యతే" అని వాక్కుకు మనస్సం పత్తిని ప్రతిపాదించెడి శ్రుతి వాక్కునకు ఉపాదానముకానందున మనస్సు నందు వాక్స్వరూపసంపత్తిని చెప్పునది కాదు వాగ్వృత్తిమనోధీనమగుట చేత తద్వృత్తిసంపత్తిని చెప్పుచున్నదని శంకించి మనస్సునందు వాక్స్వ రూపసంపత్తిప్రతిపాదనమైతేనే సంపత్తి శ్రుతిస్వారస్యము సిద్ధించును గావున వాక్కుకు మనస్సునకు ఉపాదానముకానందున లయము కూడక పోయినను మనస్సుతో వాక్సంయోగము చెప్పవచ్చునదైనందున మనస్సునందు వాక్స్వరూపసంపత్తిని ప్రతిపాదించుచున్నదని నిర్ణయించ బడినది

## 136 మనోऽధికరణము (4-2-2)

### 491. తన్మనః ప్రాణ ఉత్తరాత్ (4-2-3)

అర్థము - ఉత్తరాత్ - మన ప్రాణమనెడిశబ్దముచేత, తత్ - సర్వేంద్రియ సంయుక్తమైన, మన -మనస్సు, ప్రాణే - ప్రాణమందు సంయోగము పొందును "మన ప్రాణ" అనుస్థలమందు ప్రాణశబ్దముచేత జలము చెప్ప బడుచున్నదా లేక ప్రాణమేనాయని సంశయము ప్రాణమునకు మన ప్రకృ తిత్వములేకపోవుటవలన "అన్నమయం హి సోమ్య మన " అని మనస్సు నకు అన్నమయత్వముయొక్క శ్రవణమువలన జలమునకు అన్నప్రకృతి త్వముచేత దానియందు సంపత్తి ఉపపన్నమగునని ప్రాణశబ్దముచేత జలమే చెప్పబడుచున్నదని పూర్వపక్షము "ఆపోమయః ప్రాణ " అని ప్రాణమునకు ఉదకమయత్వమువల్ల ప్రాణశబ్దముచేత ఉదకము చెప్ప దగును "అన్నమయ ఆపోమయ ప్రాణమయ " అని మన ప్రాణములకు వాని ప్రకృతిత్వము చెప్పడములేదు మరేమనిన దానియొక్క ఆప్యాయ నమే మనస్సుకు అహంకారకార్యమగుటవలన ప్రాణమునకు ఆకాశము

ప్రకృతిగాయుండుటవలన, ఆ కారణముచే "వాఙ్మనసి" అన్నట్లు ఉత్తరాత్ దానియుత్తరమందుండెడి "మన ప్రాణ" అనుశబ్దమువల్ల తత్ సర్వేంద్రియములచేత కూడినమనస్సు ప్రాణమందు సంయోగమునుపొందును

అధికరణ సంగ్రహము - "మన ప్రాణే" అన్నచోట ప్రకృతికముగా చెప్పబడు మనస్సుకు అన్నప్రకృతి భూతాత్ప్రకృతికమైన ప్రాణ కారణముగా కూడుటవలన పరంపరయా స్వకారణమునందు లయరూపసంపత్తిని చెప్పుచున్నదనిశంకించి మన ప్రాణములు అహంకారాకాశవికారములౌటచే అన్నాద్వికారములు కానందునను పరంపరగా కారణలయసంపత్తిప్రతిపాదనపరముకాదు, ముందు చెప్పినట్లుగా సంయోగమాత్రమని చెప్పుచున్నదని నిర్ణయించబడినది

137 అధ్యక్షాధికరణము (4-2-3)

492 సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః (4-2-4)

అర్థము - స - ప్రాణము, అధ్యక్షే - జీవునియందు, తదుపగమాదిభ్యః - జీవప్రాప్తిని చెప్పెడి శ్రుతివలన సంయోగమును పొందును ప్రాణము తేజస్సునందు సంయోగమును పొందునా లేక జీవుని యందాయని సంశయము "ప్రాణస్తేజసి" అనివాక్యముచే తేజస్సునందేనని పూర్వపక్షము ఉత్క్రాంతమైన ప్రాణమునకు జీవునియందు ప్రాప్తిశ్రవణమువల్ల ప్రాణము ఇంద్రియములకధిపతి అయిన జీవునియందు సంయోగమును పొందుచున్నది దీనికి విరోధములేకపోవుటకు జీవునియందు సంయోగమునుపొంది తరువాత తేజస్సునందు సంయోగమును పొందునని పూర్వమందు చెప్పబడిన శ్రుతిని వక్కాణించుచున్నది ప్రాణమునకు జీవప్రాప్తి వినబడుచున్నది "ఏవమేవమిమమాత్మానం అంతకాలే సర్వే ప్రాణా అభిసమాయాంతి", "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి", "కస్మిన్వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామ్" ఇత్యాదుల్లో

అధికరణ సంగ్రహము - "ప్రాణస్తేజసి' అనుచోట కేవలతేజస్సులో ప్రాణసంపత్తియని శంకించి జీవునితో కూడ తేజస్సులో ప్రాణసంపత్తియని నిర్ణయించబడినది

138 భూతాధికరణము (4-2-4)

493 భూతేషు తచ్ఛ్రుతేః (4-2-5)

అర్థము - భూతేషు - భూతాదులయందు, తచ్ఛ్రుతేః - పూర్వోక్తార్థశ్రవణముండుటవలన

494 నైకస్మిన్ దర్శయతో హి (4-2-6)

అర్థము - ఏకస్మిన్ - తేజస్సు ఒకదానియందు సంప్రవిష్టము, న దర్శయతో హి - చూపించదో "ప్రాణస్తేజసి" అని తేజోమాత్రమందే ప్రాణసంయోగము పొందువా లేక భూతాంతరములచేత సంయోగముగలదాయని సంశయము "తేజసి" అనువచనముండుటవలన తేజోమాత్రమందేనని పూర్వపక్షము "పృథివీమయ" ఇత్యాదులచేత సంచరించుచుండెడి జీవునికి సర్వభూతమయత్వశ్రవణమువల్ల త్రివృత్కరణశ్రుతిచేత తేజస్సుయొక్కటికే కార్యమందు సామర్థ్యము లేకపోవుటచే భూతాంతరసంపృక్తుడని సిద్ధాంతము

అధికరణ సంగ్రహము - తేజశ్శబ్దమాత్రశ్రవణమువలన జీవసంయుక్తప్రాణనికి కేవలతేజస్సంపత్తియేనని శంకించి తేజ ఉపలక్షితసర్వభూతములలోనూ సంపత్తియని నిర్ణయించబడినది

139 అసృత్యుపక్రమాధికరణము (4-2-5)

495 సమానా చాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య (4-2-7)

అర్థము - అసృత్యుపక్రమాత్ - గతియుపక్రమము, అమృతత్వం చ - మోక్షమును, అనుపోష్య - పోషించుకుని, సమానా చ - సదృశమైయుం

డును ఈయుత్క్రమణము విద్వాంసావిద్వాంసులకు సమానమైనదా లేక విద్వాంసునికేనా యని సంశయము విద్వాంసునికి అచ్చట అమృతత్వ ప్రాప్తివినబడుచున్నది "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది స్థితా । అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అని విద్వాంసునికి అర్చిరాది మార్గముచేతనే బ్రహ్మప్రాప్తి అర్చిరాదిగమనముయొక్క ఉపక్రమమునకు పూర్వము ఈ ఉత్క్రాంతిసమానమైనది ఆ గతియు మూర్ధన్యమైన నాడిచేత "శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా। తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అని శ్రుతియు, " యదా సర్వే ప్రముచ్యంతే" అనుదానిచేత గతిశ్రుత్యవిరోధముచేత అమృతత్వమునకు సాధనమైన ఉపాసననిష్పత్తిచెప్పబడుచున్నది హృదయమందుండెడి కామములు ఎప్పుడు విడువబడుచున్నవో అప్పుడేయుపాసనారంభమువలన మనుష్యుడు మృతుడౌనని అచ్చట కామవిమోచనపూర్వముగా ఉపాసనమందుండెడివాడు అర్చిరాదిమార్గముచేత బ్రహ్మము అనుభవించునని అర్థము

సూత్రార్థము - సృతి - అనగా గతి, అసృత్యుపక్రమాత్ - ఉత్క్రాంతి విద్వాంసునికి అవిద్వాంసునికి సమానమైనది విద్వాంసునికి అర్చిరాదిశ్రవణముండుటవలన "అథ మర్త్యోఽమృతో భవతి" అని చెప్పబడిన అమృతత్వముపోషించి దగ్ధముకాని శరీరేంద్రియాదులయొక్క సంబంధము ఉపాసనారంభపరికరరూపమని యర్థము

తాత్పర్యము - ఈయుత్క్రాంతి విద్వాంసునకు అవిద్వాంసునకు సమానమా లేక విద్వాంసునికేనా అనిశంకించి శ్రుతియందమృతప్రాప్తివిద్వాంసునికి అర్చిరాదిమార్గముచేత బ్రహ్మప్రాప్తియునియు అర్చిరాదిగతియుపక్రమమునకంటే పూర్వముత్క్రాంతి అందరికీ సమానమని చెప్పబడినది

**496 తదాపీతేస్సంసారవ్యపదేశాత్ (4-2-8)**

అర్థము - తత్ - అమృతత్వము చెప్పబడినప్రకారము కలదు ఎట్లన్న, ఆపీతే - బ్రహ్మప్రాప్తివరకు, సంసారవ్యపదేశాత్ - సంసారమును చెప్పుటవలన తత్ - పూర్వముచెప్పినట్లే ఎట్లన్న (ఆపీతేస్సంసారవ్యపదేశాత్) ఆపీతి - బ్రహ్మప్రాప్తి అర్చిరాదిగతిచేత దేశవిశేషమును పొంది ఎంత వరకు బ్రహ్మమును పొందునో అంతవరకు సంసారః - శరీరసంబంధవ్యపదేశము చేయబడుచున్నది

తాత్పర్యము - అమృతత్వము ఉక్తప్రకారమే బ్రహ్మప్రాప్తి అర్చిరాదిమార్గముచేత దేశవిశేషమును పొంది అంతపర్యంతమును బ్రహ్మప్రాప్తివరకు సంసారసంబంధము చెప్పబడుచున్నది గతివ్యపదేశము వలన శరీరమునుండి ఉత్క్రాంతుడైన వానికి ఏవిధముగా శరీరసంబంధమన్న చెప్పుచున్నారు

497 సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః (4-2-9)

అర్థము - సూక్ష్మం - సూక్ష్మశరీరము, ప్రమాణతశ్చ - ప్రమాణమువలన తథా - ఆప్రకారము, ఉపలబ్ధే - తెలియుటవలన

సూక్ష్మశరీరము అనుసరించుచున్నది గతివ్యపదేశమువలన గతివ్యపదేశమాత్రముచేతనేకాదు, ప్రమాణాంతరమువలనను అట్లే తెలియబడుచున్నది సూక్ష్మశరీరముతో అర్చిరాదిగతిచేత పోయినవిద్వాంసునికి చంద్రునితోగూడ సంవాదము చెప్పబడుచున్నది "తం ప్రతి బ్రూయాత్ సత్యం బ్రూయాత్" ఇత్యాదులయందు

తాత్పర్యము - గతివ్యపదేశమువలన శరీరమును విడిచి వెళ్ళినవానికి తిరిగి ఎటుల శరీరసంబంధమని శంకించి సూక్ష్మశరీరమనువర్తించుచున్నది ప్రమాణాంతరము వలన విద్వాంసునికి అర్చిరాదిమార్గముచేతనే పోయి చంద్రునితో కూడ సంవాదము చెప్పబడుచున్నది

498 నోపమర్దేనాతః (4-2-10)

అర్థము - అతః - ఈ హేతువువలన, ఉపమర్దేన - దేహసంబంధోపమర్ద ముచేత, న - అమృతత్వమును చెప్పుటలేదు

అతః - చెప్పబడిన కారణములవలన "అథ మర్త్యోఽమృతో భవతి" యను వచనము దేహసంబంధ ఉపమర్దముచేత అమృతత్వమును చెప్పుట లేదు మరేమనిన చెప్పబడిన ఉపాసనారంభరూపమును చెప్పుచున్నదని యర్థము

తాత్పర్యము - శ్రుతియందు అమృతుడగుచున్నాడను వచనము దేహసం బంధోపమర్దమైన ఉపాసనారంభమును చెప్పుచున్నది

499 అస్యైవ చోపపత్తేరూష్మా (4-2-11)

అర్థము - అస్య - ఈ సూక్ష్మశరీరమునకు, ఉపపత్తేః - సంభవించుట వలన, ఊష్మా - సూక్ష్మదేహగుణమైన ఊష్మయును యుపపన్నమగును

అస్య - సూక్ష్మశరీరము ఉండటము కుదురుటవలన దేహసంబంధోపమర్ద ముచేత కాదు తరలిపోతూ ఉండెడి విద్వాంసునికి సూక్ష్మదేహగుణమైన ఊష్మ పొందబడుచున్నది ఇది స్థూలదేహగుణంబు కాదు మరియొక స్థల మందు ప్రత్యక్షము లేకపోవుటవలన విద్వాంసుడు సూక్ష్మశరీరముతో పోవుచున్నాడు

500 ప్రతిషేధాదితి చేన్న శారీరాత్ స్పష్టో హ్యేకేషామ్ (4-2-12)

అర్థము - ప్రతిషేధాత్ - నిషేధమువలన, ఇతి చేన్న - ఇట్లనకూడదు శారీరాత్ - విద్వాంసుడైన జీవునివలన ఈసంగతి ఏకేషాం - కొన్ని శాఖల యందు స్పష్టం - స్పష్టము

"న తస్య ప్రాణా ఉత్క్రామంతి" యని ఆరంభించి, "ఇతి తు కామయ మానః" అనువరకు విద్వాంసునికి ఉత్క్రాంతిక్రమమును లోకాంతరగమ నమును తిరిగి ఆవృత్తి చెప్పి "అథాకామయమాన" ఇత్యాదివాక్యముచేత

అతని ప్రాణములు ఉత్క్రమణము పొందవనెడి అర్థము చెప్పబడి "న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అని విద్వాంసునికి ఉత్క్రాంతి నిషేధము వలన ప్రాణముల ఆశ్లేషము దీనిచే చెప్పబడుచున్నది సత్య - ఆ అపేక్షించిన విద్వాంసునికి ప్రాణములు శరీరమును విడిచి ఉత్క్రమమును పొందవు దేవయానమున పోవుటకొరకు మాత్రమే ఉంటున్నవి కొన్ని మాధ్యందిన శాఖలపాఠములందు ఈ అర్థము స్పష్టమైనది "యో కామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్మాత్ ప్రాణా ఉత్క్రామన్తి" యని కొన్ని శ్రుతులందు ఆ విద్వాంసునికి ఉత్క్రాంతి విషయములో లోకాంతరగమనము ఉత్క్రాంతులను చెప్పి కొన్ని శ్రుతులయందు విద్వాంసునకు ఉత్క్రాంతిప్రతిషేధమువలన పూర్వోక్తప్రకారయుపపత్తిని చెందదని శంకించి, కామరహితుడయిన విద్వాంసునకు దేవయానగమనము కొరకు ప్రాణములు వెంటనే ఉంటున్నవని శ్రుత్యర్థము గాని ఇతరము లేదు ఈ అర్థమే కొన్ని శాఖలయందు చెప్పబడినది

**501. స్మర్యతే చ (4-2-13)**

అర్థము - స్మర్యతే చ - స్మృతిచేతనే సంగతి చెప్పబడుచున్నది

విద్వాంసునకు మూర్ధన్యనాడిచే ఉత్క్రమణము స్మరించబడుచున్నది "ఊర్ధ్వమేకస్థితస్తేషాం యో భిత్వా సూర్యమండలం । బ్రహ్మలోకమతిక్రమ్య తేన యాతి పరాం గతిమ్ ।।" యని

తాత్పర్యము - బ్రహ్మనిష్ఠునకు ఇక్కడనే అమృతత్వము చెప్పబడుటవలన ఉత్క్రాంతి లేనందున ఆ బ్రహ్మనిష్ఠునికే ఉత్క్రాంతి యని శంకించి, బ్రహ్మనిష్ఠునికి నాడీవిశేషమువలన ఉత్క్రమణము శ్రుతియందు చెప్పబడుటవలన వానికిని యది కలదని నిర్ణయించబడినది

**140 పరసంపత్త్యధికరణమ్ (4-2-6)**

**502 తాని పరే తథా హ్యాహ (4-2-14)**

అర్థము - తాని - భూతములని, పరే - పరదేవతయందు, తథా - ఆ ప్రకారముగ, ఆహ - శ్రుతి చెప్పినది

"ప్రాణ స్తేజసి" అని తేజశ్శబ్దముచేత చెప్పబడిన భూతములు జీవపరిష్వక్తములై పరదేవతయందు సంపత్తిని పొందుచున్నవా లేక కర్మననుసరించి పోతూమున్నవా యని సంశయము ఆ కాలమందు సుఖదుఃఖాల యనుభవము లేకపోవుటచేత పరదేవతసంపత్తియందు ప్రయోజనము లేకపోవుటవలన కర్మననుసరించి విద్యననుసరించి యని పూర్వపక్షము - సమస్తము పరదేవతయొక్క కార్యముచేత తదాత్మకముగా నుండుట చేత పొందదగిన స్థానమిదే "పరస్యాం దేవతాయాం" అని చెప్పబడుచున్నది

సిద్ధాంతము - అవి పరబ్రహ్మయందు సంపత్తిని పొందుచున్నవి "తేజః పరస్యాం దేవతాయాం" యని శ్రుతి చెప్పినది శ్రుతిననుసరించి విశ్రమ స్థానముచేత కార్యము కల్పించతగినదని యర్థము

అధికరణ సంగ్రహము - జీవసంపరిష్వక్తములైన భూతసూక్ష్మములలో సుఖదు భోపభోగరూపకార్యము కనపడనందున వానికి పరమాత్మసంపత్తి లేదని శంకించి, సుషుప్తి ప్రళయదశలలో వలె పరమాత్మసంపత్తివలన సుఖదుఃఖోపభోగాయాసవిశ్రామరూపకార్యము ఉత్క్రమణదశయందు ఉండుటవలన "తేజః పరస్యాం దేవతాయాం" యని శ్రుతిప్రతిపన్నంబయిన జీవసంయుక్తభూతసూక్ష్మములకును పరమాత్మసంపత్తిలేనట్లు చేయకూడదని నిర్ణయించబడినది

**141 అవిభాగాధికరణము (4-2-7)**

**503 అవిభాగోవచనాత్ (4-2-15)**

అర్థము - అవిభాగః - విభాగము లేకపోవటము, వచనాత్ - చెప్పుటవలన గ్రహించతగినది

ఈ పరమాత్మయందు సంపత్తి ప్రాకృతప్రళయమందువలెనే కారణాపత్తి రూపమయినదా లేక మనస్సు మొదలయిన వాటియందు సంపత్తివలె విభాగములేకపోవుటను మాత్రమా యని సంశయము "పరమాత్మకు కారణత్వమువలన ఆ పరమాత్మ సంపత్తిని చెప్పుటవలనను కారణాపత్తియే యని పూర్వపక్షము

సిద్ధాంతము - "వాఙ్మనసి సంపద్యతే" యని వినబడిన సంపత్తివచనము నకు సమస్తస్థలములయందు అనుషంగమునకు ఇచ్చటనుండే అనుషక్తమయిన అభిధానవైరూప్యము సంభవించకపోవుటవలన ఇచ్చటను అవిభాగమే శ్లేషమునే చెప్పబడుచున్నది

అధికరణ సంగ్రహము - పూర్వోక్తమయిన సంపత్తి కారణాపత్తియని శంకించి, "వాఙ్మనసి సంపద్యతే" యను స్థలమందు "సంపద్యతే" యను పదము సంసర్గవిశేషవాచియగుటవలన అనుషక్తమయిన ఆ పదమునకు అభిదానవైరూప్యమందు ప్రమాణంబు లేనందువను సంసర్గవిశేషాపత్తిని చెప్పుచున్నదని నిర్ణయించ బడినది

## 142 తదోకోధికరణము (4-2-8)

504. తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతశ్శతాధికయా (4-2-16)

అర్థము - విద్యాసామర్థ్యాత్ - బ్రహ్మవిద్యాసామర్థ్యమువలన, తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ - దానికి అంగమయిన గతిచింతన చేతను, హార్ద - బ్రహ్మచే, అనుగృహీతః - అనుగ్రహింపబడినవాడై, తదోకః - జీవస్థానము, అగ్రజ్వలనం - ప్రకాశితమైన అగ్రముగలదౌటను, తత్ప్రకాశిత ద్వారః - దానిచే ప్రకాశింపచేయబడిన మార్గము గలవాడై, శతాధికయా - సుషుమ్నా నాడిచేత, పోవును

"శతం చైకా చ హృదయస్య నాడ్యః తాసాం మూర్ధానమభినిస్సృతైకా ।

తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" అని నూటికంటె అధికమయిన మూర్ధన్యమనెడినాడిచేత విద్వాంసునికి గమనము అని నియమము సంభవించుచున్నదా లేదా యని సంశయము నాడులకతిసూక్ష్మముచే వివేచనము చేయుటకు అశక్యమగుటవలన నియమము సంభవించదు హఠాత్తుగా ప్రాప్తంబయిన గమనమును ఆ నాడిచే అనువాదము చేయుచున్నది వచనమని పూర్వపక్షము

సిద్ధాంతము - భగవదారాధనస్వరూపమయిన ఈవిద్యచేత దానికంగమైన గమనము యొక్క ఆలోచనచేత సంతోషమునుపొందిన భగవంతునివలన అనుగ్రహింపబడిన జీవుడు భగవానుని ప్రసాదముచే చూపబడిన ద్వారముగల ఆ మూర్ధన్యనాడిద్వారా పోవుచున్నాడు

సూత్రార్థము - హృదయమందుండెడి పరమపురుషునియొక్క ఆరాధనస్వరూపమయిన విద్యాసామర్థ్యమువలన విద్యాశేషభూతమయిన గతి మనన యోగమువలన ప్రీతుడైన హార్దునిచే జీవుడు అనుగ్రహింపబడినవాడగుచున్నాడు అనవంతరము తదోకః జీవుని స్థానము హృదయమగ్రజ్వలనము - ప్రకాశితాగ్రజ్వలనమగుచున్నది ఆవిధముగా భగవంతునిచే ప్రకాశింపజేయబడిన ద్వారముగలవాడై అనాడి నుండి పోవుచున్నాడు "తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" యని హార్దశబ్దముచేత పరమాత్మ తెలియతగినది

అధికరణ సంగ్రహము - శతాధికమైన మూర్ధన్యనాడియందు నిష్క్రమణము నెడు నియమము లేదు తోచిన యొక నాడి ద్వారా నిష్క్రమణము కలదని శంకించి, "తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" అని మూర్ధన్యనాడిలో నిష్క్రమణమని శ్రుతి చెప్పుటచేత నియమేన మూర్ధన్యనాడిద్వారా నిష్క్రమణమని నిర్ణయించబడినది

**143. రశ్మ్యనుసారాధికరణము (4-2-9)**

**505 రశ్మ్యనుసారీ (4-2-17)**

అర్థము - రశ్మి - సూర్యకిరణములను, అనుసారీ - అనుసరించినవాడై పోవును "అథ యత్రై తదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభి రూర్ధ్వమాక్రమత" అని సూర్యకిరణములను అనుసరించే విద్వాంసుడు పోవుచున్నడని నియమము సంభవించునా లేదాయని సంశయము రాత్రి మృతుడైన విద్వాంసునికి సూర్యకిరణముల అనుసారము సంభవించకపోవుటచే నియమము లేదని పూర్వపక్షము ఈ వచనమైతే పక్షప్రాప్తమైన అర్థమును అనువాదము చేయుచున్నది ఈవచనమునకు పక్షప్రాప్తియొక్క అనువాదపరత్వమునుచెప్పినచో "అథైతైరేవ" అను అవధారణమునకు విరోధముకలుగును రాత్రికిరణములులేవని చెప్పరాదు గ్రీష్మఋతువులో రాత్రులందు వేడిమికి ప్రత్యక్షముండుటచే సూక్ష్మముగాకిరణములు ఉన్నవి వానిననుసరించి పోవును హేమంతఋతువందు ప్రత్యక్షములేక పోవుటకు దుర్దినమువలె మంచుచేత తిరస్కారమగును

అధికరణ సంగ్రహము - ఉత్క్రమణానంతరము రశ్మ్యనుసారేణగతి అనని యమము లేదు నిశిమృతుడైన బ్రహ్మవిత్తునికి అదిలభించనందున అని శంకించి నిశియందునను రశ్మిసంభవప్రతిపాదకశ్రుతి ఉండుటచే నిశిమృతుడైనను బ్రహ్మవిత్తునికి రశ్మ్యనుసారేణ గమనము నిర్ణయము

144. నిశాధికరణము (4-2-10)

506 నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ (4-2-18)

అర్థము - నిశి - రాత్రిమృతునకు, న - బ్రహ్మప్రాప్తిలేదు, ఇతి చేన్న - అనకూడదు, సంబంధస్య - అనారబ్ధకార్యకర్మసంబంధమునకు, యావద్దేహభావిత్వాత్ - దేహపాతమువరకు ఉండుటచే, దర్శయతి చ - అని శ్రుతి ఈ ప్రకారము చెప్పును నిశిమృతుడైన విద్వాంసునికి బ్రహ్మప్రాప్తి ఉన్నదా లేదాయని సంశయము "దివా చ శుక్లపక్షశ్చ ఉత్తరాయణమేవ చ। ముమూర్షతాం ప్రశస్తాని విపరీతం తు గర్హితమ్॥" అని రాత్రిమరణము

నకు నిందవల్ల అధోగతిహేతుత్వమువల్ల బ్రహ్మప్రాప్తికలుగదని పూర్వప క్షము విద్యామాహాత్మ్యమువల్ల ఉత్తరపూర్వాఘమువల్ల అశ్లేషవినాశముం విని కిరివల్ల ప్రారబ్ధకర్మకు చరమేదేహమే అవధియగుటచే దేహమందు హేతువులేకపోవుటవల్ల రాత్రిమృతుడైనవానికి బ్రహ్మప్రాప్తియుండునని రాత్రిమరణమందు అవిద్వాంసులవిషయమని తెలియవలయును

సూత్రార్థము - రాత్రిమరణనిందచేత రాత్రియందు మృతుడైనవానికి బ్రహ్మ ప్రాప్తిలేదనరాదు (సంబంధస్య యావద్దేహభావిత్వాత్) అనారబ్ధమైనకార్య ముగల కర్మసంబంధానికి విద్యచేతచేత నాశముసంభవించుటచేత ప్రారబ్ధ కార్యముగల కర్మసంబంధానికి చరమదేహముచేతనే నాశము సంభవిం చుటచే సంబంధహేత్వభావమువలన బ్రహ్మప్రాప్తియున్నదని అర్థము ఈ అర్థాన్నే శ్రుతి చెప్పుచున్నది "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అని

అధికరణ సంగ్రహము - నిశామరణము శాస్త్రగర్హితమగుటచే నిశి మృతునికి బ్రహ్మప్రాప్తిలేదని శంకించి కర్మసంబంధము యావద్దేహభావియగుటచే కర్మవినాశానంతరం సంసారముకూడదుగనుక నిశామరణగర్హణము అవి ద్వద్విషయమగుటవలన నిశామృతునకు బ్రహ్మప్రాప్తికలదని నిర్ణయించబ డినది

145 దక్షిణాయనాధికరణము (4-2-11)

507 అతశ్చాయనేఽపి దక్షిణే(4-2-19)

అర్థము - అత - ఈ కారణమువల్ల, దక్షిణాయనేఽపి - దక్షిణాయనమందు మృతిపొందినవానికి బ్రహ్మప్రాప్తికలదు దక్షిణాయనమందు మృతుపొం దిన విద్వాంసునికి బ్రహ్మప్రాప్తియున్నదా లేదాయని సంశయము "అథ యో దక్షిణే ప్రమీయతే పితౄణామేవ మహిమానం గత్వా చంద్రసా యుజ్యం గచ్ఛతి" అని దక్షిణాయనమందు మృతిచెందిన విద్వాంసునికి చంద్రసాయుజ్యముండుటచే చంద్రునిపొందినవానికి "అక్షితమేవాధ్వానం

పునర్నివర్తంతే" అనువచనముచే దక్షిణాయనమందు మృతుడైనవానికి బ్రహ్మప్రాప్తిసంభవించదని పూర్వపక్షము పూర్వముచెప్పబడిన సంబంధ రూపమైన హేతుత్వభావమువలన విద్వాంసునికి చంద్రప్రాప్తియందు పునరావృత్తిలేదు ఆ చంద్రసాయుజ్యముచెప్పెడిశ్రుతి బ్రహ్మమును పొందెడి విద్వాంసునికి మార్గాయసవినివృత్తికొరకు విశ్రమస్థానముగా చెప్పబడుచున్నది పునరావృత్తిచెప్పెడిశ్రుతి అవిద్వాంసుని విషయము

సూత్రార్థము - యత - ఏ హేతువువల్ల రాత్రిమృతుడైనవానికి బ్రహ్మప్రాప్తి గలదో ఆకారణముచే సంబంధహేతుత్వభావమువలన దక్షిణాయనమందు మృతినొందినవానికి బ్రహ్మప్రాప్తియున్నది "యత్ర కాలే త్వనావృత్తిం అవృత్తిం చైవ యోగిన" అని మరణకాలవిశేషము స్మరింపబడుచున్నదని పక్షమందు చెప్పుచున్నారు

**508 యోగిన ప్రతిస్మర్యేతే స్మార్తేచైతే (4-2-20)**

అర్థము - యోగిన ప్రతి - బ్రహ్మవిద్యవిష్ఠులనుగురించి, స్మార్తే - స్మృతి విషయములైన, ఏతే - దేవయానపితృయానగతులు స్మర్యేతే - స్మరింప బడుచున్నవి యోగిన - బ్రహ్మవిద్యానిష్ఠులనుగురించి ఏతే - దేవయాన పితృయానగతులు, స్మార్తే - స్మృతియందు స్మరింపబడుచున్నవి, ప్రతిదినము స్మరింపబడుచున్నవని అర్థము "యత్ర కాలే త్వనావృత్తిం అవృత్తిం చైవ యోగిన" ఇత్యాదులచే "నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన । తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున।।" అను వరకూ ముముక్షువులనుగురించి కాలవిశేషము యొక్క ఉపాదానము స్మరింపబడుచున్నది మోక్షప్రాపకములగు ఆతివాహికగణమునకు కాలాభిమాని దేవతావిశేషాధిక్యముండుటవలన "యత్ర కాలే" అని చెప్పబడుచున్నది

అధికరణ సంగ్రహము - దక్షిణాయనమృతునకు చంద్రప్రాప్తిశ్రవణముచేత చంద్రప్రాప్తికల్గినవారికి పునరావృత్తి శ్రుతమౌటచే ఆ కాలమందు మృతులై

నవారికి బ్రహ్మప్రాప్తిలేదని శంకించి పితృయానపథముచేత చంద్రప్రాప్తిగల్గినవారికే పునరావృత్తియేగాక చంద్రప్రాప్తిగల్గినవారందరికిని పునరావృత్తి ఉంటుందను నియమము లేనందున బ్రహ్మప్రాప్తియున్నదని నిర్ణయించబడినది

**చతుర్థాధ్యాయమున ద్వితీయపాదము ముగిసెను**

# చతుర్థాధ్యాయము - తృతీయపాదము

146 అర్చిరాద్యధికరణము (4-3-1)

509 అర్చిరాదినా తత్ప్రథితే (4-3-1)

అర్థము - అర్చిరాదినా - అర్చిరాదిమార్గములోనే విద్వాంసుడు పోవును తత్ప్రథితే - దానిప్రసిద్ధివలన విద్వాంసుడు అర్చిరాదిమార్గమందే పోవునా లేదాయని సంశయము సమస్తవిద్యలందు అర్చిరాదిమార్గమే చెప్పబడుచున్నదా లేక అచ్చటచ్చట భిన్నముగా యున్నదాయని సంశయము ఎప్పుడు అర్చిరాదిమార్గమొక్కటే సర్వవిద్యలందు చెప్పబడునో అప్పుడు ఆ మార్గమందే పోవుచున్నాడు ఎప్పుడు మరికొన్నిచెప్పబడుచున్నవో అప్పుడు అన్యముచేతనా దానిచేతనా యనునియమములేదని ఛాందోగ్య వాజసనేయములందు అనేకవిధములైన గతిప్రకారములు వినబడుచున్నవి ఛాందోగ్యమందు "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంతే" అని ఉపక్రమించి "సర్వాణి వయతి సర్వేషు లోకేషు భాతి య ఏవం వేద అథ యదు చాస్మిన్ కించిచ్ఛవ్యం కుర్వంతి యదు చ నార్చిషమేవాభిసంభవంతి అర్చిషోఽహరహ్న ఆపూర్యమాణపక్షాపూర్యమాణపక్షాద్యాన్ షడుదజ్ఙేతి మాసాన్మాసేభ్యస్సంవత్సరం సంవత్సరాదాదిత్యమాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తతపురుషో మానవస్స ఏనాన్ బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథస్తేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతే" అని, బృహదారణ్యకమందు "య ఏవమేతద్విదుర్యేచామీ అరణ్యే శ్రద్ధా సత్యమిత్యుపాసతే తేఽర్చిషమభిసంభవంత్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణ పక్షమాపూర్యమాణపక్షాద్యాన్ షణ్మాసానుదజ్ఙాదిత్య ఏతి మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్యమాదిత్యాద్వైద్యుతం వైద్యుతాత్పురుషోఽమానవస్స ఏతాన్ బ్రహ్మలోకాన్గమ

యతి" అని అట్లే మరోచోట "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి స వాయులోకమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స ఆదిత్యమాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథాడంబరస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స చంద్ర మసమాగచ్ఛతి ... తత్ర విజిహీతే యథా దుంధుభే ఖమ్" ఇత్యాదులందు వారికి బ్రహ్మ ప్రాప్తియందపేక్షలేదని వినికిడిచే వానిచేతనో అర్చిరాదిచేతనో వికల్పమని పూర్వపక్షము అన్నిచోట్లను అర్చిరాదులందతర్భూతుడైన ఆదిత్యుని పఠనముచే అదేయని ప్రత్యభిజ్ఞ కల్గుటచే మరోచోట చెప్పినదానికి వేరే ... ఉపసంహారమువల్ల అన్నిచోట్లను అర్చిరాదిమార్గము ఒక్కటేయని, వానిద్వారానే విద్వాంసుడు వేంచేయుచున్నాడని సిద్ధాంతము

సూత్రార్థము - అర్చిరాది మార్గముచేతనే విద్వాంసుడు వెళ్ళిపోవుచున్నాడు ఎట్లన్న (తత్ప్రథితే) ప్రథితి - ప్రసిద్ధి, అన్నిచోట్లను దాని ప్రత్యభిజ్ఞపలనని అర్థము

అధికరణ సంగ్రహము - బ్రహ్మప్రాప్తియందర్చిరాదిమార్గమును మరికొన్ని మార్గాంతరములు నైరపేక్ష్యేణ ఛాందోగ్యవాజసనేయాదులలో శ్రుతమగుటచేత మార్గములు వికల్పేన వస్తావన్నవని శంకించి అన్నిచోట్లను అర్చిరాదిభూతములైన ఆదిత్యాదిపురుషులే మార్గమునడిపించెడివారుగా అగుచుటవలన అర్చిరాదిమార్గమే ప్రత్యభిజ్ఞాతమగుటచేత మార్గమొక్కటే ప్రసిద్ధమగుటచే వాటివల్ల అన్యత్రోక్తములకు అన్యత్రోపసంహారము ప్రామాణికమగుటవలన అర్చిరాదిమార్గేణైవ ముక్తునకు బ్రహ్మప్రాప్తిగమనమని నిర్ణయించబడినది

147 వాయ్వధికరణము (4-3-2)

510 వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్ (4-3-2)

అర్థము - అబ్దాత్ - సంవత్సరముకంటె తర్వాత, వాయుం - వాయువో ... కగినది, అవిశేషవిశేషాభ్యాం - అవిశేషవిశేషములైన దేవలోక ... "తేఽర్చిషమభిసంభవంత్యర్చిషోఽహరహ్న" అని

యారంభించి "మాసేభ్యః సంవత్సరం సంవత్సరాదాదిత్యమ్" అని ఛాందోగ్యమందు శ్రుతమైనది అచ్చట సంవత్సరసూర్యునిమధ్యమందు దేవలోకము వాయులోకము మరియొకశ్రుతియందు వినబడినది రెండైన ప్రమాణాలుగల ప్రకరణమునకు దేవలోకము వాయువు అంతర్భూతములా లేక వాయువొక్కటేనాయని సంశయము శబ్దభేదమువల్ల అర్థాంతరభూతములని పూర్వపక్షము అర్థాంతరత్వముచెప్పినపక్షమందు "దేవలోకాదిత్యమ్" అని దేవలోకమునకు "తేన స ఊర్ధ్వమాక్రమతే స ఆదిత్యమ్" అని వాయువునకు సూర్యునికంటే పూర్వత్వముచేత శ్రౌతక్రమమందు చెప్పుటచే దేవలోకవాయు యథేష్టమైన క్రమముచేత నిర్దేశముచేయతగినది వాయువొక్కటే దేవలోకశబ్దముచేత చెప్పబడినదని దానికంటే వేరుకాదు దేవానాం లోకః దేవలోకః అని దేవతలకావాసస్థానము అని విశేషములేక నిర్దేశము చేయుటచే "యోఽయం పవత ఏష ఏవ దేవానాం గృహాః" అని వాయువున్ను దేవతలలో దేవతావిశేషముగనుక ఆవాసముగా చెప్పుటచే అవిశేషముగా నిర్దిష్టమైన దేవలోకశబ్దము వాయువేనని నిశ్చయింపబడుచున్నది సంవత్సరమునకంటే పైన వాయువున్నదని వాయువుకంటే ఊర్ధ్వమందు సూర్యుడని క్రమము

సూత్రార్థము - అబ్దాత్ - సంవత్సరమునకంటే పూర్వము ఆదిత్యునికంటే పూర్వము వాయువొక్కటే నివేశించతగినది దేవలోకవాయులోకశబ్దములచే అవిశేషవిశేషములైనవానిచే వాయువొక్కటే చెప్పుటచే దేవతలకు ఆవాసస్థానమని అవిశేషముచేత దేవలోకశబ్దము వాయుదేవతకు అస్థానమని చెప్పుచున్నది వాయుశబ్దము రెంటిచేత విశేషింపబడుచున్నది ప్రకరణద్వయమందు చెప్పబడిన రెంటికి ఏకత్వమున్నదని అర్థము

అధికరణ సంగ్రహము - అర్చిరాదిపురుషప్రతిపాదనమధ్యే శాఖాభేదేన శ్రుతములైన దేవలోకవాయులోకశబ్దములు అభిన్నార్థములౌటచేత దేవలోకశబ్దవాచ్యమును వాయువున్ను అర్థాంతరముకాదని నిర్ణయించబడినది

**148 తటిదధికరణము (4-3-3)**

**511 తటితోఽధి వరుణస్సంబంధాత్ (4-3-3)**

అర్థము - తటితోఽధి - తటిత్తు కంటే తర్వాత, వరుణ - వరుణుడు, సంబంధాత్ - లోకవేదములందు సంబంధమువలన ఛాందోగ్యవాజసనేయక కౌషీతకీమొదలైన వానియందు చెప్పబడిన అర్చిరాదిమార్గమందు అర్చిస్సు పూరణచేయబడెడి పక్షము ఉత్తరాయణము, వాయువు, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు, వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతిరూపమైన వాయుపర్యంతములకు శ్రుత్యాదులవల్ల ఉపసంహారము యొక్క క్రమప్రకారం చెప్పబడినది వరుణేంద్రప్రజాపతులకు విద్యుత్తు కంటే ఉపరిభాగమందు నివేశమా లేక వాయువు ఉపరిభాగమందు నివేశమా యని సంశయము "స వాయులోకం స వరుణలోకమ్" అని కౌషీతకిపాఠక్రమముచే వాయువుపిదుగా వరుణునికి నివేశము ఇంద్రాదులకును వరుణనివేశము కొరకు వాయ్వాదిత్యులయొక్క క్రమమునకు బాధసంభవించుటచేత అచ్చట వరుణుడేనని పూర్వపక్షము విద్యుత్తుకు మేఘోదరస్థితిచేత విద్యద్వరుణులకు లోకమందును వేదమందును సంబంధమువల్ల పాఠక్రమముకంటె అర్థక్రమము బలీయముగుటచే వరుణునికి విద్యుత్తు కంటె ఉపరిభాగమందు నివేశకార్యము ఇంద్రాదులకును వరుణుని నివేశముకొరకు విద్యుత్తుకు అవ్యవధానసహత్వముయొక్క ప్రత్యక్షమువలన వరుణుని ఉపరిభాగమందు నివేశము

అధికరణ సంగ్రహము - పాఠక్రమముచే వరుణేంద్రప్రజాపతులకు వాయ్వనంతరనివేశము యుక్తమని శంకించి పాఠక్రమాపేక్షయా అర్థక్రమము బలిష్ఠమైనందుచే మేఘోదరవర్తిత్వరూపసంబంధమువల్ల విద్యుతోపరి వరుణేంద్రాదులకు నివేశము యుక్తమని నిర్ణయించబడినది

**149 అతివాహికాధికరణము (4-3-4)**

**512 ఆతివాహికాస్తల్లింగాత్ (4-3-4)**

అర్థము - ఆతివాహికా - అర్చిరాద్యభిమానిదేవతలు, తల్లింగాత్ --బ్రహ్మమును పొందించే చిహ్నములు గలవారగుటచే బ్రహ్మనుపొందుటకు నిశ్చయించిన విద్వాంసునికి అర్చిరాదుల మార్గములు గుర్తులా లేక పొందించెడి వారాయని సంశయము ఈ వృక్షమును, ఈ నది, ఈ పర్వత పార్శ్వములనుపొంది ఈ గ్రామమును పొందుమని ఆతిదేశికమైన ఉపదేశముయొక్క ప్రకారప్రత్యక్షమువల్ల మార్గమునకు గుర్తులని పూర్వపక్షము "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని వైద్యుతపురుషునికి గమయితృత్వదర్శనమువల్ల అవిశేషముగా చెప్పబడిన ఇతరములకును ఆదే సంబంధమని నిశ్చయింపబడినది "అగ్నిలోకమ్" ఇత్యాది లోకశబ్దమును మధ్యకాలమందు భోగములేకపోవుటవలన పొందింపచేయుచున్నారని సిద్ధాంతము

సూత్రార్థము - ఆతివాహికా - విద్వాంసులయొక్క ఆతివహనమందు పరమపురుషునియందు నియోగింపబడిన అర్చిరాద్యభిమానిదేవతావిశేషములు పొందింపచేయుచున్నారని అర్థము "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని లింగమువలన

తాత్పర్యము - బ్రహ్మను పొందతగినవిద్వాంసుని అర్చిరాదులు మార్గచిహ్నములా బ్రహ్మను పొందించేవారా యని శంకించి శ్రుతియందు విద్యుత్సంబంధితపురుషునికి గమయితృత్వదర్శనమువల్ల ఇతరులైన అర్చిరాద్యధిష్ఠానదేవతలకును ఇదే సంబంధమని నిశ్చయింపబడుచున్నది

513 వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతే (4-3-5)

అర్థము - తత - విద్యుత్తత్పరంపైన, వైద్యుతేన - వైద్యుతపురుషునిచేత, తచ్ఛ్రుతే - అప్రకారం శ్రుతులుండుటచే తత - విద్యుత్తు ఉపరిభాగమందు వైద్యుతునిచేత విద్వాంసునికి గమనము, తచ్ఛ్రుతే - "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని శ్రుతియుండుటచే వరుణుడు మొదలగువారికి

వాని అనుగ్రాహకప్రమాణమునుబట్టి గమయితృత్వమే నిశ్చయింపబడు చున్నదని అర్థము

అధికరణ సంగ్రహము - అర్చిరాదులు మార్గచిహ్నములని శంకించి గమయితృత్వము శ్రుతమాటచే అర్చిరాదులు ఆతివాహికపురుషులని నిర్ణయించ బడినది

[150] కార్యాధికరణము (4-3-5)

514 కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః (4-3-6)

అర్థము - కార్యం - హిరణ్యగర్భునిపొందిస్తున్నదని, బాదరి - బాదర్యాచార్యులు చెప్పుదురు అస్య - హిరణ్యగర్భుని ఉపాసనచేసినవారికే, గత్యుపపత్తే - గమనమునకు ఉపపత్తిగల్గుట అర్చిరాదిగణకార్యము హిరణ్యగర్భుని ఉపాసించెడివారలను పొందింతురా లేక పరబ్రహ్మను ఉపాసించు వారిలో ప్రత్యగాత్మను బ్రహ్మాత్మకముగా ఉపాసించువారిని పొందించువా యని సంశయము చతుర్ముఖబ్రహ్మనుపాసించువారని పూర్వపక్షము వారికే గత్యుపపత్తియగును పరిపూర్ణమై సర్వగతమైన పరబ్రహ్మను ఉపాసించు వారికి తత్ప్రాప్తికొరకు గత్యుపపన్నము కానేరదు నిత్యప్రాప్తుడగుటవలన అవిద్యానివృత్తియే చేయతగినది పరబ్రహ్మని ఉపాసనచేయువారికి పొందించునని రెండవపక్షము "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని పరబ్రహ్మశబ్దమునకు అచ్చటనే ముఖ్యత్వమువలన విద్యానిష్పత్తికి ఫలాభిసంధిలేని యజ్ఞాపేక్షవలె శ్రవణాపేక్షవలె గతిశ్రుతివలన దేశవిశేషము యొక్క అపేక్ష ఉన్నదని నిశ్చయింపబడుచున్నది పరమపురుషుని ఉపాసించువారికి అన్యులను పొందుచున్నది "తద్య ఇత్థం విదుర్యే చేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవంతి" అని ఉభయ విధములైనవాని భేదముచేత తీసుకొని అర్చిరాదిగతులచేత అపునరావృత్తి శ్రుతివలనను నిశ్చయింపబడునని సిద్ధాంతము

మాత్రార్థము - కార్యం - హిరణ్యగర్భుని ఉపాసనచేసినవారిని అతివాహిక సమూహము తీసుకుపోవుచున్నదని బాదరాచార్యులు చెప్పుదురు గత్యుపపత్తివల్ల అర్థము తెలియుచున్నది పరబ్రహ్మను ఉపాసనచేసినవారికి అతని ప్రాప్తికొరకు గత్యుపపన్నము కానేరదు పరబ్రహ్మకు సర్వగతత్వముండుటవలన

తాత్పర్యము - పరమపురుషోపాసకులకు తత్ప్రాప్తికొరకు పరబ్రహ్మ సర్వగతుడౌటవలన గత్యుపపత్తిని చెందదని బాదరాచార్యులు చెప్పుదురు

**515 విశేషితత్వాచ్చ (4-3-7)**

అర్థము - విశేషితత్వాచ్చ - ప్రాప్యమైన స్థానమునకు విశేషముండుటవలన "పురుషోऽమానవ ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి" అని "ప్రజాపతే స్సభాం వేశ్మ ప్రపద్యే" అని ఉపాసనకు విశేషణముండుటవలన హిరణ్యగర్భుని ఉపాసనచేసినవారిని తీసుకుపోవుచున్నారు ఈ ప్రకారము నిశ్చయము చేయబడినయెడల "స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని హిరణ్యగర్భునికి బ్రహ్మశబ్దముచేత కథనము ఏ ప్రకారంబనగా చెప్పుచున్నారు

**516. సామీప్యాత్తు తద్వ్యపదేశః (4-3-8)**

అర్థము - సామీప్యాత్ - బ్రహ్మసామీప్యమువలన, తద్వ్యపదేశ - బ్రహ్మశబ్ద ప్రయోగము చేయబడును " స ఏనాన్ బ్రహ్మ గమయతి" అని హిరణ్యగర్భునికి బ్రహ్మశబ్దవ్యపదేశము బ్రహ్మసామీప్యమువలన కలిగెను "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్" అని మొదటపుట్టినవాడుగనుక బ్రహ్మసామీప్యముండును

**517. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్ (4-3-9)**

అర్థము - కార్య - హిరణ్యగర్భలోకము, అత్యయే - నాశమందు, తదధ్య క్షేణ సహ - దానియధిపతియైన బ్రహ్మతో, అత - వానికంటే, పరం - పర బ్రహ్మను పొందుననీ, అభిధానాత్ - చెప్పుటవలన హిరణ్యగర్భునిప్రాప్తి యందును అపునరావృత్తియుపపన్నమౌచున్నది కార్యమనగా హిరణ్యగ ర్భలోకమునకు, అత్యయే - నాశకాలమందు, తదధ్యక్షేణ - అధిపతియైన హిరణ్యగర్భునితో కూడా అనగా హిరణ్యగర్భుడగు అధికారిపురుషునితో కూడా విద్వాంసునికి పరబ్రహ్మ ప్రాప్తిచెప్పుటచేత "తే బ్రహ్మలోకే తు పరాంతకాలే పరామృతాత్ పరిముచ్యంతి సర్వే" అని

518 స్మృతేశ్చ (4-3-10)

అర్థము - స్మృతేశ్చ - స్మృతులవలన "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మాన ప్రవిశంతి పరం పదమ్" అను స్మృతిచే ఈ అర్థము తెలియబడుచున్నది

519 పరం జైమినిర్ముఖ్యత్వాత్ (4-3-11)

అర్థము - పరం - పరంబ్రహ్మయని, జైమిని - జైమినులు చెప్పుదురు, ముఖ్యత్వాత్ - బ్రహ్మశబ్దమునకు ముఖ్యత్వముండుటవలన ఈ అతివా హికసమూహము పరబ్రహ్మను ఉపాసనచేసినవారినే పొందించు చున్నా రని జైమిన్యాచార్యులు చెప్పుదురు "బ్రహ్మ గమయతి" అని బ్రహ్మశబ్ద మునకు పరబ్రహ్మశబ్దమందే ముఖ్యత్వముండుటవలన "బ్రహ్మలోకాన్" అనుశబ్దము బ్రహ్మైవ లోకో బ్రహ్మలోక అను కర్మధారయ సమాసపరిగ్ర హమునకే యోగ్యత్వముండుటవలన ఉపపన్నమౌను ఈ ప్రకారము నిశ్చయము చేయబడిన తర్వాత బహువచనమెందుకనగా "అదితి పాశాన్" అన్నట్లు ఉపపన్నమగును

**520 దర్శనాచ్చ (4-3-12)**

అర్థము - దర్శనాచ్చ - పరబ్రహ్మప్రాప్తికి ప్రత్యక్షముండుటవలన "అస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్యత స్వేన రూపేణాభినిష్పద్యత" అని అర్చిరాదిమార్గమందు పోయినవారికి పరబ్రహ్మప్రాప్తి స్ఫుటమైనది

**521 న చ కార్యే ప్రత్యభిసంధి (4-3-13)**

అర్థము - కార్యే - కార్యభూతమైన హిరణ్యగర్భలోకమందు, ప్రత్యభిసంధి - అభినివేశము, న చ - లేదు "ప్రజాపతేస్సభాం వేశ్మ ప్రపద్యే" అని ప్రత్యభిసంధియు కార్యముకాదు "ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామి" అని అకృతమైన బ్రహ్మలోకమని అచ్చుటనే విశేషించినందున "యశోఽహం భవాని బ్రాహ్మణానామ్" అని సర్వాత్మభావముచెప్పుటవలన

**522 అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథా చ దోషాత్తత్క్రతుశ్చ (4-3-14)**

అర్థము - ఉభయథాచ - రెండుపక్షములందును, దోషాత్ - దోషమువలన, అప్రతీకాలంబనాన్ - సత్యసంకల్పము మొదలైన గుణములుగల బ్రహ్మను ఉపాసనచేసినవారిని, నయతి - పొందించుచున్నదని, తత్క్రతుశ్చ-- యథాక్రతున్యాయానుసారంగా, బాదరాయణ - బాదరాయణులు చెప్పుచున్నారు కార్యమును ఉపాసనచేసినవారలనేయని నియమము సంభవించదు పరబ్రహ్మను ఉపాసనచేసినవారిని పొందించుచున్నదని నియమము సంభవించదు ఎట్లన్న, (ఉభయథా చ దోషాత్) కార్యమును ఉపాసనచేసినవారినేయని నియమము చెప్పినపక్షము "అస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యత", "యే

చేమేంరణ్యే శ్రద్ధాతప " ఇత్యాదిశ్రుతులు పరబ్రహ్మోపాసకులకే అవి విషయమనుచెప్పినపక్షము "తద్య ఇత్థం విదు " అనేశ్రుతి కోపము పొందును ఆ కారణమువల్ల అప్రతీకాలంబనలను పొందుచున్నదని బాదరాయణాచార్యులు చెప్పుదురు ప్రతీకాలంబనములనగా అచిన్మిశ్రములైన కేవల అచిద్వస్తువు అనగా దేవదత్తునియందు సింహదృష్టివలె బ్రహ్మదృష్టిచేతనైనను స్వరూపముచేతనైనను ఆ వస్తువును ఎవరు ఉపాసనచేయుదురో వారు అప్రతీకాలంబనములు వారికి వ్యతిరిక్తులైనవారు సర్వజ్ఞులై సర్వకారణులై అనేకగుణవిశిష్టులై సత్యసంకల్పులై నిఖిలహేయప్రత్యనీకానవధికాతిశయానందస్వరూపులైన బ్రహ్మను ఎవరు ఉపాసనచేయుదురో ప్రత్యగాత్మలై భూతసూక్ష్మములచేత సంపరిష్వక్తులై సర్వత్రవర్తమానమై భూతసూక్ష్మములకు వ్యతిరిక్తులై జ్ఞానైకస్వరూపులై నిత్యులై నిర్వికారులై "య ఆత్మని తిష్ఠన్" ఇత్యాదులచే అవగతమైన బ్రహ్మభావముగా ఎవరు పంచాగ్నివిద్యయందు చెప్పబడిన క్రమముచే ఉపాసనచేతురో ఈ ఇద్దరిని పొందించుచున్నది "తద్య ఇత్థం విదుర్యేచేమేంరణ్యే" అని ఉభయవిదశ్రుతులుండుటవలన (తత్క్రతుశ్చ) "యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి" అని వీరిద్దరికినీ పునరావృత్తి సంభవించదు అచిన్మిశ్రమైన అచిద్వస్తువును ఉపాసనచేయువారికి తత్క్రతున్యాయముచేత పునరావృత్తి అపర్జనీయము

## 523 విశేషం చ దర్శయతి (4-3-15)

అర్థము - విశేషం - పరిమితఫలవిశేషము, దర్శయతి - శ్రుతిచూపుచున్నది చెప్పబడినలక్షణములుగల ప్రతీకాది విద్యావిరోధియని నిర్ణయించ బడినది

అచిన్మిశ్రములైన కేవల అచిద్వస్తువునే ఉపాసనచేయు అందరికీ గత్యపేక్షమును పరిమితఫలవిశేషమును చెప్పుచున్నది శ్రుతి "యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి" ఇత్యాదులు అందు

వలన "బ్రహ్మణా సహ తే సర్వే" అనువచనము అర్చిరాదిమార్గమందు పోయినవారిగతిప్రకారమైన విషయముకాదు అర్చిరాదిమార్గముచేతపోయి నవారికి దేహావసానసమయమందే సుకృతదుష్కృతనాశమువలన హిరణ్య గర్భలోకప్రాప్తియు అచ్చట ఉండడము అచ్చట భోగములను అనుభవిం చుటయందు హేత్వభావమువలన తత్క్రతున్యాయవిరోధమువలన తత్క్షణమే బ్రహ్మప్రాప్తి కల్గునని చెప్పెడి శ్రుతివిరోధముకల్గి "బ్రహ్మణా సహ తే సర్వే" అనువచనము పుణ్యకర్మచేత హిరణ్యగర్భ లోకమునుపొంది "తదుపర్యపి బాదరాయణః" అనున్యాయముచేత అచ్చట నిష్పన్నమైన విద్యగల్గినవారి గతిప్రకారకవిషయము "తే బ్రహ్మ లోకమ్" అనుచోట బ్రహ్మలోకశబ్దానికి కర్మధారయసమాసముచేత బ్రహ్మ విషయత్వము సంభవించుటవలన బ్రహ్మోపాసనముందుండెడివాడు పరాంతకాలే - చరమదేహావసానసమయములో, పరామృతాత్ - ఉపాసన వలన ప్రీతుడైన పరబ్రహ్మరూపహేతువువలన, పరిముచ్యంతి సర్వే - సమస్తబంధమువలన విడువబడుదురని "వేదాంత విజ్ఞానసునిశ్చితార్థాః" అని ప్రకరణములయందవగతమౌచున్నది "తద్య ఇత్థం విదుర్యే చేమేఽరణ్యే" అని పంచాగ్నివేత్తలకు బ్రహ్మప్రాప్తి అపునరావృత్తి వినిశ్రవణ మువలన తత్క్రతున్యాయముచేత అచిద్వియుక్తబ్రహ్మాత్మకభూతసూ క్ష్మవ్యతిరిక్తాత్మస్వరూపోపాసనము వివక్షచేయబడినదని నిశ్చయింపబడి నది ఆ ప్రకారమే అచ్చటశ్రుతియు "ఇతి తు పంచమ్యామాహుతా వాప పురుషవచసో భవంతి" అని "రమణీయచరణా" అని కర్మహేతుకకర్మము నుష్యాదిభావము భూతాంతరసంసృష్టమైన జలమునకే అని చిదచిద్వివేక మునుచెప్పి "తద్య ఇత్థం విదు" అని భూతసూక్ష్మ వ్యతిరిక్తాత్మస్వరూ పోపాసనము చేయబడుచున్నది

అధికరణ సంగ్రహము - బ్రహ్మోపాసకునకు పరిపూర్ణప్రాప్యర్థము దేశాంత రగమనము అపేక్షితమగుటవలన బ్రహ్మోపాసకులకు అర్చిరాదిమార్గము లేదు ప్రతీకోపాసకులకే అర్చిరాదిమార్గమున్నదని శంకించి దేశవిశేషాప

చ్చిన్నబ్రహ్మప్రాప్తిగల్గినవానికే అవిద్యానివృత్తి శ్రుతమగుటచే నిష్కృష్ట బ్రహ్మ శరీరజీవోపాసకులకున్ను జీవశరీరబ్రహ్మోపాసకులకున్నే అర్చిరాది మార్గము ఉన్నదని నిర్ణయించబడినది

చతుర్థాధ్యాయమున తృతీయపాదము ముగిసెను

# చతుర్థాధ్యాయము - చతుర్థపాదము

**151 సంపద్యావిర్భావాధికరణము (4-4-1)**

**524 సంపద్యావిర్భావస్స్వేనశబ్దాత్ (4-4-1)**

అర్థము - సంపద్య - పరంజ్యోతినిపొంది, ఆవిర్భావ - స్వరూపావిర్భావము కల్గును, స్వేనశబ్దాత్- స్వసంబంధివాచకశబ్దంవల్ల "ఏవమేవైషసంప్రసాదోஉస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యత" అని పరంజ్యోతినిపొందిన ప్రత్యగాత్మకు స్వరూపావిర్భావము చెప్పబడుచున్నదా లేక సాధ్యమైన అన్యరూపంచేత సంబంధమాయని సంశయము స్వస్వరూపమునకు సుషుప్తియందు నిరానందత్వ ప్రత్యక్షము వల్ల స్వరూపమాత్రమునకు నిత్యానిర్భూతముండుటవలన సాధ్యమైన ముక్తికాలరూపంచేత సంబంధంపొందును ఇప్పుడు అభినిష్పద్యత అనువాక్యము ఉపపన్నమగును పరంజ్యోతిని పొందినవారికి ఆనందం వినబడుచున్నది "రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి", "స ఏకో బ్రహ్మణ ఆనంద శ్రోత్రియస్య చాకామహతస్య" ఇత్యాదులందు అందువల్ల సాధ్యరూపముచేతనే "స్వేనరూపేణాభినిష్పద్యత" అని విశేషణముండుటచే స్వస్వరూపావిర్భావమే స్వరూపమునకు అపహత పాప్మత్వాదులుండును కనుక ప్రజాపతివాక్యమందు చెప్పబడిన కర్మకృత దేహసంబంధము దానిచేత సూక్ష్మదేహమువలన వినబడువానికి అసంకుచిత జ్ఞానానందాదులుగల స్వరూపావిర్భావము సంభవించుటవలన స్వస్వరూపయాథాత్మ్యానుభవపూర్వకంగా అనవధికాతిశయానందబ్రహ్మానుభవము సంభవించును అభినిష్పత్తియు కల్గుననుట ఉపపన్నతరము

మూలార్థము - పరంజ్యోతినిపొంది స్వస్వరూపావిర్భావము ప్రతిపాదించుచున్నది ఎట్లన్న (స్వేనశబ్దాత్) సాధ్యమైనరూపానికి తనకసాధారణత్వం లేకపోవుటవలన స్వేనయను విశేషణము వ్యర్థమగును స్వస్వరూపమాత్ర

మునకు అహం జానామి — నేను తెలియుదును అని నిత్యంగా ఆవిర్భూత మగును "పరంజ్యోతిరుపసంపద్యత" అనువాక్యము వ్యర్థమగునసగా చెప్పుచున్నారు

525 ముక్త ప్రతిజ్ఞానాత్ (4-4-2)
అర్థము - ప్రతిజ్ఞానాత్ - ప్రతిజ్ఞవలన, ముక్త - ముక్తనిరూపం తెలియుచు న్నది కర్మబంధతత్కృతదేహముచే విడువబడినస్వరూపమాత్రం అచ్చట "స్వేనరూపేణాభినిష్పద్యత" అని చెప్పబడుచున్నది ఇది ఎట్లు తెలియు ననగా ఏతం త్వేవతేభూయోఽను వ్యాఖ్యాస్యామ్" అని కర్మమే హేతువుగా గల దేహసంబంధమున్ను తత్కృతజాగరాద్యవస్థలచేతను వినిర్ముక్తమైన స్వరూపమును ఇచ్చట చెప్పుటచే తెలియును ఇట్లు స్వస్వరూపమాత్రావి ర్భావమునకు పురుషార్థముసంభవించదనెడి సందేహానికి సమాధానం చెప్పుదున్నారు

526 ఆత్మా ప్రకరణాత్ (4-4-3)
అర్థము - ప్రకరణాత్ - ప్రకరణమువలన, ఆత్మా - ఆత్మ సత్యసంకల్పా దులు గలవాడే దేహాదులచేత వినిర్ముక్తమైన స్వరూపముచేత స్థితుడైన ఆత్మ అపహతపాప్మత్వాది సత్యసంకల్పత్వపర్యంతగుణములుగలవాడు అతనికి ఎట్లన్న "ఏష పాప్మా అపహతపాప్మా" అని ప్రస్తుతముచేసుకుని "ఏతం త్వేవ భూతే భూయోఽనువ్యాఖ్యాస్యామ్" ఇత్యాదులందు చెప్పబ డును ఆ కారణముచే అపహతపాప్మత్వాదిగుణస్వరూపునికి కర్మమను అవిద్యచే తిరోహితునికి పరంజ్యోతిసంపత్తిచేత నివృత్తమైన తిరోధానము గలవానికి ఆవిర్భావము చెప్పబడుచున్నది
అధికరణ సంగ్రహము - బ్రహ్మసంపత్తిగల్గినవానికి స్వరూపము నిత్యావి ర్భూతముగా ఉండుటవలన దానికి ఆవిర్భావము చెప్పగూడదు అపూర్వ ముగా నుండెడి ఆకారనిష్పత్తియే నున్నదని శంకించి అపహతపాప్మ

త్వాది గుణాత్మస్వరూపము అవిద్యాతిరోహితమౌటవలన తన్నివృత్త్యా ఎప్పుడు ఉండు ఆత్మస్వరూపావిర్భావమే గలదని నిర్ణయించబడినది

152 అవిభాగేన దృష్టత్వాధికరణము (4-4-2)

527 అవిభాగేన దృష్టత్వాత్ (4-4-4)

అర్థము - అవిభాగేన - నేను బ్రహ్మయును విభాగములేకనే ముక్తుడు బ్రహ్మను అనుభవించును, దృష్టత్వాత్ - యథావస్థితమైన స్వరూపము నకు దర్శనముండుటవలన ఈ ముక్తుడైన ఆవిర్భూతస్వరూపముగల ప్రత్యగాత్మ స్వాత్మకంటే అవిభక్తుడైన పరబ్రహ్మను అనుభవించుచు న్నాడా లేక స్వాత్మకును ఆత్మగా అవిభాగేన "అహం బ్రహ్మాస్మి" అని అనుభవించుచున్నాడాయని సంశయము "నిరంజన పరమం సామ్యము పైతి", "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" "ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతా" ఇత్యాది శ్రుతిస్మృతులచేత విభక్తుడైనవానినే అనుభవించునని పూర్వపక్షము "సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఐతదాత్మ్యమిదం సర్వమ్", "తత్త్వమసి" ఇత్యాదులచే సామా నాధికరణ్యముచే అభేదమును బోధించుటవలన "య పృథివ్యాం తిష్ఠన్ యస్య పృథివీ శరీరమ్" "య ఆత్మని తిష్ఠన్ యస్యాత్మా శరీరమ్" ఇత్యా దుల్లో సమస్తచిదచిద్వస్తువులకు బ్రహ్మశరీరత్వ రూపమైన బ్రహ్మప్రకార ముచేత ఆయా వస్తుబుద్ధిశబ్దములు తత్పర్యంతవిషయములుగాగలవని తెలిసి "ఆత్మేతి తు ఉపగచ్ఛంతి" అనువ్యాయముచేత స్వాత్మకువాని త్మగా "అహం బ్రహ్మాస్మి" అనెడు ఉపాసనచేత యథావస్థితపరమాత్మే ఆత్మగాగల తనకు దృష్టత్వమువలన ముక్తుడు తనకున్ను ఆత్మభూతుని బ్రహ్మహం బ్రహ్మాస్మి అని అవిభాగముగానే అనుభవించుచున్నాడు

మాత్రార్థము - "అహం బ్రహ్మాస్మి" అని ముక్తుడవిభాగముచేత బ్రహ్మ అనుభవించుచున్నాడు స్వాత్మకు ఆత్మగా ఉపాసనందు యథావస్థిత పరమాత్మస్వరూపమునకు దర్శనముండును సాధర్మ్యశ్రుతిపరమాత్మశరీ

రకుడైన ప్రత్యగాత్మకు అపహతపాప్మత్వాదిగుణాంతోకూడా అతని గుణా
నుభవము చెప్పుచున్నది "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా
విపశ్చితా" అని బ్రహ్మశరీరత్వమై బ్రహ్మప్రకారభూతుడౌటవలన స్వాత్మ
భూతుడైన బ్రహ్మతోకూడా అతనికి గుణానుభవము చెప్పబడుచున్నది
కామ్యంత ఇతి కామా కల్యాణగుణములు కల్యాణగుణవిశిష్టుడైన బ్రహ్మ
మును అనుభవించుచున్నాడని అర్థము

అధికరణ సంగ్రహము - ముక్తుడు బ్రహ్మానుభవదశలో బ్రహ్మను విభక్తంగా
అనుభవించుచున్నాడని చెప్పుటచే శ్రుతిశతములచేత తద్దశయందు
భేదము కనబడుచున్నదని శంకించి ప్రకారిప్రకారభేదముచే వచ్చినభే
దాన్ని శ్రుతిశతములు చెప్పినవేగాని "తత్త్వమసి" ఇత్యాదిశ్రుతిసిద్ధవిశి
ష్టైక్యమును బాధించవచ్చినవి కాదుగనుక తత్ప్రకారతయా అవిభక్తము
గానే అనుభవించుచున్నాడని నిర్ణయింపబడినది

153 బ్రాహ్మాధికరణము (4-4-3)

528 బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః (4-4-5)

అర్థము - ఉపన్యాసాదిభ్యః - ఉపన్యాసము మొదలైనవానివలన,
బ్రాహ్మేణ - అపహతపాప్మత్వాదిగుణములచేత స్వరూపావిర్భావమని
జైమిని - జైమినులు చెప్పుదురు జీవునికి స్వాభావికరూపము అపహతపా
ప్మత్వము మొదలగు గుణములు గలదా లేక చైతన్యమాత్రమా లేక
రెండునాయని సంశయము అపహతపాప్మత్వాదులు గలదని మొదటి
పక్షము "య ఆత్మా అపహతపాప్మా" అని ప్రతిపాదనమువలన చైతన్య
మాత్రమని రెండవపక్షము "ఏవం వా అరేఽయమాత్మానంతరో బాహ్య
కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ విజ్ఞానఘన ఏవ" అని ఏవకారమువలన జ్ఞాన
స్వరూపునికే అపహతపాప్మత్వాది గుణములుగలవాడని చెప్పుటవలన
అవిరోధముచే ఉభయము స్వరూపమే "విజ్ఞానఘన ఏవ" అని ఏవకా
రము గుణాంతరమును సహించదని చెప్పకూడదు ఎట్లైతే ఉప్పుగడ్డకు

"రసఘన ఏవ" అను అవధారణముండినను ద్రవ్యరూపసర్పర్శాదిగుణాంత రములను సహించదని చెప్పగూడదు "రసఘన ఏవ" అను అవధారణ మైతే రసవత్తైన ద్రవ్యాంతరస్వభావము యొక్క వ్యావృత్తిపరమైనది ద్రవ్యాంతరములకైతే స్వేతరదేశమందు భిన్నమైన రసవత్త్వములేదు సైంధవ ఘనమునకైతే అంతటా ఏకరసము దృష్టమైనది ఈ ప్రకారమి చ్చటను అచిద్వస్తువ్యావృత్తిచేత స్వస్వభావముతో గుణములతోగూడిన తనయొక్క స్వప్రకాశత్వముగా "విజ్ఞానఘన ఏవ" అని ఏవకారము వచ్చెను

సూత్రార్థము - బ్రాహ్మేణ అపహతపాప్మత్వాది గుణములచేత స్వరూప ఆవిర్భావము అపహతపాప్మత్వాదులు బ్రహ్మగుణములుగా దహరవాక్య ములో వినబడినది (ఉపన్యాసాదిభ్య) ఆ బ్రహ్మగుణములకు ప్రత్యగాత్మ యందును "య ఆత్మా అపహతపాప్మా' ఇత్యాదుల్లో ఉపన్యాసమువలన ఆదిశబ్దమువల్ల "జక్షత్క్రీడన్ రమమాణ" ఇత్యాదులందును సత్యసంక ల్పత్వాదులు తెలియబడుచున్నదని జైమిన్యాచార్యులు చెప్పుదురు

**529 చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమి (4-4-6)**

**అర్థము** - చితి - చైతన్యమందు, తన్మాత్రేణ - చైతన్యమాత్రముచేతనే స్వరూపావిర్భావము, తదాత్మకత్వాత్ - తత్స్వరూపత్వనిశ్చయమువల్ల నని ఔడులోమి - ఔడులోములు చెప్పుదురు చైతన్యమాత్రముచేత స్వస్వరూపావిర్భావము "విజ్ఞానఘన ఏవ" అని తదాత్మకత్వముయొక్క అవధారణవల్లయని ఔడులోమ్యాచార్యులు చెప్పుదురు

**530 ఏవముపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణ (4-4-7)**

**అర్థము** - ఏవముపన్యాసాత్ - విజ్ఞానఘనపూర్వమునకే అపహతపాప్మ త్వాదులు చెప్పుటవలన, పూర్వభావాత్ - రెండు అంగీకరించుటచే, అవి

రోధం - విరోధాభావమును, బాదరాయణ - బాదరాయణులు చెప్పుదురు ఈ ప్రకారం విజ్ఞానఘనస్వరూపుడైనవానికే స్వప్రకాశస్వరూపుడైనవానికే పూర్వముండెడి అపహతపాప్మత్వాది సత్యసంకల్పత్వపర్యంతము "య ఆత్మాఽపహతపాప్మా" అని ఉపన్యాసమువలన సద్భావమంగీకరించుటచే స్వరూపములైన రెంటికినీ భేదములేదని బాదరాయణులు చెప్పుదురు ఉభయశ్రుతులచేత తెలియబడిన అర్థములకు పరస్పరమువిరోధమువలన రెంటనొటికి బాధచెప్పుటయందు ప్రమాణములేదని అభిప్రాయము

అధికరణ సంగ్రహము - ముక్తునికి అపహతపాప్మత్వాది గుణవత్త్వమున్ను జ్ఞానమున్ను స్వరూపమని మతభేదముచేత శంకించి ఉభయమున్ను శ్రుతిసిద్ధమౌటవలన ఉభయమున్ను స్వరూపమని నిర్ణయించబడినది

154 సంకల్పాదికరణము (4-4-4)

531 సంకల్పాదేవ తచ్ఛ్రుతే (4-4-8)

అర్థము - సంకల్పాదేవ - ముక్తునికి సంకల్పమువలన ఇష్టములు సిద్ధించును తచ్ఛ్రుతే - ఆ ప్రకారము శ్రుతియుండుటవలన "పరంజ్యోతిరుప సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యే స ఉత్తమ పురుష స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్ రమమాణస్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా" ఇత్యాదులు చెప్పుచున్నవి ఈ జ్ఞాతులు మొదలైనవారు ముక్తుని సంకల్పమువల్ల కల్గించున్నారా లేక ప్రయత్నాంతరముయొక్క అపేక్షగల సంకల్పమువల్లనా యని సంశయము లోకమందు రాజులకు సత్యసంకల్పత్వముండువను ఒకకార్యమందు ప్రయత్నాంతరాపేక్షసంకల్పమువల్లనేయని పూర్వపక్షము "సంకల్పాదేవ" అని అవధారణము "విజ్ఞానఘన ఏవ" అన్నట్లు ఉపపన్నముగును

సిద్ధాంతము - సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠంతి" అని అవధారణముచే అన్యాపేక్షలేదు సత్యకామత్వాదుల ఉపన్యాసమువలె దానికి అన్యాపేక్షయందు ప్రమాణములేదు లోకంలో సత్యసంకల్పత్వాది అభావము

వల్లే మరో ప్రయత్నమందు అపేక్షయున్నది పరమపురుషునికంటే అతిరిక్తుడైన ఒక సత్యసంకల్పపురుషుడు లేడు ముక్తుడైతే బ్రహ్మప్రసాదము వల్ల అతని సామ్యమునుపొంది అతనివలె ఉండును

532 అత ఏవ చానన్యాధిపతి (4-4-9)

అర్థము - అత ఏవ చ - ఈకారణమువల్ల, అనన్యాధిపతి - ముక్తుడు కర్మకు అధీనుడుకాడు ఆ కారణమువలన శ్రుతివల్లనే ముక్తుడు మరోప్రభువులేని వాడు అనన్యాధిపతిత్వమునగా కర్మ అనధీనుడు "అపహత పాప్మా సత్యసంకల్ప" అని తెలియును గమక అనన్యాధిపతి

అధికరణ సంగ్రహము - ముక్తునికి శ్రుతమైన జ్ఞాత్యాదిప్రాప్తియందు ప్రయత్నాంతర సాపేక్షమునని శంకించి ఈశ్వరునివలె ప్రయత్ననిరపేక్షముగానే జ్ఞాత్యాది ప్రాప్తియున్నదని నిర్ణయించబడినది

155 అభావాధికరణము (4-4-5)

533 అభావం బాదరిరాహ్యేవమ్ (4-4-10)

అర్థము - అభావం - శరీరాభావమును, బాదరి - బాదర్యాచార్యులు మేనే - తలిసెను, ఏవం - ఈ ప్రకారంగా, ఆహ - శ్రుతి చెప్పినది ముక్తునికి శరీరేంద్రియాదులు కలవా లేక వాని యొక్క సంకల్పానుసారముగా కల్గుచున్నదా లేదాయని సంశయము "న హ వై సశరీరస్య సత ప్రియాప్రియయోరపహతిరస్తి అశరీరం వా వసంతం న ప్రియాప్రియే స్పృశత" అని ముక్తునికి శరీరములేదని ఒకపక్షము "స ఏకధా భవతి త్రిధా భవతి" అని శరీరముకలవాడని శ్రుతియుండుటచే అశరీరత్వశ్రుతి కర్మకృతశరీరవిషయము శరీరేంద్రియాదులు గలవని రెండవపక్షము

సిద్ధాంతము - "మనసైతాన్కామాన్పశ్యన్రమతే య ఏతే బ్రహ్మలోకమ్" అని అశరీరమునకే భోగశ్రుతియుండుటవలన వీనిసంకల్పానుసారముగా

"స ఏకధా భవతి త్రిధా భవతి" అనుశ్రుతివల్ల ఉంతనూ ఉన్నది లేనిది లేదు

సూత్రార్థము - శరీరాభావమును బాదర్యాచార్యులు చెప్పుదురు "అశరీరం వా వసంతమ్" అని దీనినే శ్రుతిచెప్పుచున్నది

తాత్పర్యము - ముక్తునికి శరీరేంద్రియాదులు కలవా లేదాయని శంకించి కర్మకృతశరీరము లేదుగానీ ఇచ్ఛాధీనశరీరముకలదని బాదరి తలతురు

534 భావం జైమినిర్వికల్పామననాత్ (4-4-11)

అర్థము - భావం - శరీరస్థితిని, జైమిని - జైమిన్యాచార్యులు చెప్పుదురు, వికల్ప - అనేకవిధములైన కల్పనలయొక్క, ఆమననాత్ - చెప్పుటవలన శరీరస్థితిని జైమినులు చెప్పుచున్నారు ఎట్లన్న వికల్పామననాత్ - వివిధ కల్ప వికల్ప అని "స ఏకధా భవతి త్రిధా భవతి" ఇత్యాదులచేత ముక్తునికి నానావిధవికల్పనము చెప్పబడుచున్నది ఏకరూపుడైతే అచ్ఛేద్యుడైన ఆత్మకు వైవిధ్యము సంభవించదుగనుక శరీరద్వారముచేతనే అనేకవైవిధ్యత్వము తెలియును

535 ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోऽత (4-4-12)

అర్థము - ద్వాదశాహవత్ - ద్వాదశాహమువలె, అత - రెండువిధములైన శ్రుతులుండుటవలన, ఉభయవిధం - రెండువిధములున్ను, బాదరాయణ - బాదరాయణులు చెప్పుదురు అత - ఈ ఉభయశ్రుతివలన ఇచ్ఛచే ఉభయవిధమైన, అనగా శరీరసత్త్వమును శరీరాభావమును బాదరాయణులు చెప్పుచున్నారు (ద్వాదశాహవత్) ఎట్లైతే రెండుశ్రుతుల్లో చెప్పినప్రకారం సంకల్పభేదంచేత చేయబడే ద్వాదశాహమువలె "ద్వాదశాహమృద్ధికామా ఉపేయు" అని సత్రమైనది "ద్వాదశాహేన ప్రజాకామం యాజయేత్" అని అహీనమైనది

తాత్పర్యము - ఉభయవిధశ్రుతివలన ఉభయవిధశరీరవత్త్వాశరీరవత్త్వములు ఇచ్ఛవల్లనేయౌనని బాదరాయణులు చెప్పుదురు

536 తన్వభావే సంధ్యవదుపపత్తే (4-4-13)

అర్థము - తన్వభావే - దేహాభావమందు, సంధ్యవత్ - స్వప్నమందువలె, ఉపపత్తే - కుదురుటవలన తనచేతనే నిర్మాణముచేయబడిన దేహాదులైన ఉపకరణములు అభావమైనప్పుడు పరమపురుషునిచేత నిర్మాణంచేయబడిన ఉపకరణములవలన భోగములకు ఉపపత్తిగల్గుటచేత సత్యసంకల్పులైనను తాను సృష్టిచేయక (సంధ్యవత్) ఏ ప్రకారం స్వప్నమందు "అథ రథార్థయోగాత్ పథస్సృజతే" అని ఆరంభించి "అథ వేశాంతాన్ పుష్కరిణ్యః స్రవంత్యః సృజతే స హి కర్తా" అని, "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః । తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే। తస్మిన్ లోకాశ్శ్రితాస్సర్వే తదు నాత్యేతి కశ్చన" అని ఈశ్వరసృష్టములైన ఉపకరణములచేతనే జీవుడు సుఖముపొందునో ఆప్రకారమే ముక్తుడున్ను లీలాప్రవృత్తమైన ఈశ్వరుని చేత సృష్టములైన పితృలోకాదులవలన లీలారసమును అనుభవించుచున్నారు

తాత్పర్యము - తనచే సృజింపబడిన దేహప్రభృతి ఉపకరణాభావమందును పరమపురుషసృష్టములైన ఉపకరణములచేత లీలారసమును అనుభవించుచున్నారు

537 భావే జాగ్రద్వత్ (4-4-14)

అర్థము - భావే - దేహాదుల ఉనికియందు, జాగ్రద్వత్ - జాగ్రత్పురుషునివలె తన సంకల్పముచేత నిర్మాణముచేయబడిన దేహాదులైన ఉపకరణములయునికియందు జాగరూకులైన పురుషునిభోగమువలె ముక్తుడును లీలారసమును అనుభవించుచున్నాడు సాక్షాద్భగవానుడు దశరథవసుదేవాది పితృలోకమును తానే సృష్టిచేసి మనుష్యధర్మలీలను అనుభవించు

చున్నారు ఆ ప్రకారమే ముక్తుడును సత్యసంకల్పుడౌటవలన పరమపురుషలీలాంతర్గతమైన స్వపిత్రులోకాదులను తానే నిర్మాణముచేసి లీలారసమును అనుభవించుచున్నాడు

తాత్పర్యము - జీవునకు సత్యసంకల్పత్వమువలన స్వసంకల్పసృష్టదేహప్రభృతులనద్వారమందు జాగ్రత్పురుషభోగమువలె లీలారసమును ముక్తుడనుభవించుచున్నారు ఎటులననగా పరమపురుషుడు దశరథవసుదేవప్రభృతిపితృజనమును తనవల్లనే సృష్టింపజేసి వారివలన మనుష్యధర్మలీలారసమును అనుభవించునటులు

ఆత్మకు అణుపరిమాణమును చెప్పినట్లయిన అణువుగానుండు ఒక ఆత్మకు అనేకశరీరములయందు అభిమానము ఎట్లు సంభవించును అనిన చెప్పుచున్నారు -

538 ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి (4-4-15)

అర్థము - ప్రదీపవత్ - దీపమువలె, ఆవేశః - వ్యాప్తి, తథా - అప్రకారముగా దర్శయతి హి - శ్రుతి చూపుచున్నది గదా

ఏ విధముగా ఒక ప్రదేశముననున్నదీపము తన ప్రభచేత అనేకప్రదేశములయందు ప్రవేశించునో అదే విధముగా ఒక ప్రదేశముననుండు ఆత్మ తన ప్రభారూపమైన జ్ఞానముచేత సమస్తదేహములందు సంకల్పమువతిక్రమించపట్టుగా ఆత్మాభిమానమునకు అనుగుణమైన వ్యాప్తి సంభవించుచున్నది ఏవిధముగా ఒకదేహమున హృదయమందుండెడి ఆత్మ అణువైనప్పటికి దేహమందంతటను అహమనెడి అభిమానమునకు అనుగుణమైన వ్యాప్తి స్వప్రభావరూపచైతన్యముచేతనో, అప్రకారముగానే శ్రుతి ఈ అర్థమును చెప్పుచున్నది "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ । భాగో జీవస్స విజ్ఞేయస్స చానన్త్యాయ కల్పతే ।।" యని ప్రత్యగాత్మకు అణుత్వమే స్వరూపమని సూత్రకారులమతము "వాణురతచ్ఛ్రుతేరితి

చేన్నేతరాధికారాత్" యని పరమపురుషునకే మహత్త్వవచనముండుట వలన

ఇంకనూ పరబ్రహ్మప్రాప్తిపొందినవానికి బాహ్యాంతరజ్ఞానములే దని "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాన్తరమ్" అని చెప్పుచుండగా ఏవిధముగా ముక్తునకు జ్ఞానానన్త్యము చెప్పబడుచు న్నదనగా చెప్పుచున్నారు

539 స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి (4-4-16)

అర్థము - స్వాప్యయసంపత్త్యోః - సుషుప్తిమరణముల, అన్యతర - రెండింట నొకటి, అపేక్షం - అపేక్షను ఆవిష్కృతం హి - శ్రుతి తెలుపు చున్నది కదా

ఇది ముక్తవిషయము కాదు సుషుప్తిమరణములయందు ఒకటిక లవాని విషయము ఆవిష్కృతమైతే శ్రుతులందు సుషుప్తిమరణములలో జ్ఞానము లేకపోవుట, మోక్షదశయందు సర్వజ్ఞత్వమును, సుషుప్తియందంత పర్యంతము "నాహ ఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహ మస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమేవాపీతో భవతి" అని వశించటము చూడటములేదని అర్థము మోక్షమందైతే "స వా ఏష దివ్యేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే" అని "సర్వం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః" యనియు

తాత్పర్యము - బ్రహ్మమును పొందినవానికి శ్రుతియందు అంతరబాహ్యజ్ఞానలో పము చెప్పుటవలన జ్ఞానానంత్యము ఎటుల చెప్పబడినదని శంకింటే, ఇది ముక్తవిషయము కాదు, సుషుప్తిమరణములలోపల ఒకదానికి రెండవదాని అపేక్ష తెలుపబడినది

అధికరణ సంగ్రహము - కర్మసంబంధము లేనందున ముక్తుడు శరీరములే కనే యుండునవియు, కర్మసంబంధము లేకపోయినను కేవలేచ్ఛచే సశరీ

దుడయి ఉన్నాడని శంకించి, సంకల్పముండినచో శరీరముగలిగి యుండును, సంకల్పములేనిచో శరీరములేనివాడుగానుండునని నిర్ణయించ బడినది

156 జగద్వ్యాపారవర్జాధికరణము (4-4-6)

540 జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ (4-4-17)

అర్థము - ప్రకరణాత్ - ప్రకరణమువలన, అసన్నిహితత్వాచ్చ - ముక్తునకు సాన్నిధ్యములేదని చెప్పుటవలనను జగద్వ్యాపారవర్జం - జగత్సృష్టి మున్నగునవి లేవు

ముక్తునకు భోగము నిఖిలహేయప్రత్యనీక కల్యాణైకతాన సకలేతరవిలక్షణ అనవధికాతిశయ ఆనంద మహదైశ్వర్యములు గల పరబ్రహ్మానుభవమేనా, లేక జగత్సృష్ట్యాది జగన్నియమనరూపమయిన లీలయు సంభవించునా యని సంశయము "నిరంజనః పరమం సామ్యముపైతి" అను శ్రుతివలన జగన్నియమనరూపలీలయు సంభవించునని పూర్వపక్షము

సిద్ధాంతము - "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి, "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం తదైక్షత బహు స్యాం ప్రజాయేయ తత్తేజోఽసృజత", "బ్రహ్మ వా ఇదమేకమేవాగ్ర ఆసీత్" తదేకం సన్నవ్యభవత్ తచ్ఛ్రేయోరూపమత్యసృజత తత్క్షత్రం యాన్యేతాని దేవక్షత్రాణి ఇంద్రోవరుణస్సోమోరుద్ర పర్జన్యో యమో మృత్యురీశాన ", "ఆత్మా వా ఇదమేకమేవాగ్ర ఆసీత్ నాన్యత్కించనమిషత్ స ఈక్షత లోకాన్నుసృజా ఇతి స ఇమాల్లోకానసృజత", "ఏకో హ వై నారాయణ ఆసీన్నబ్రహ్మ నేశానో నేమేద్యావా పృథివీ న నక్షత్రాణి నాపో నాగ్నిర్న సోమో న సూర్య స ఏకాకీ న రమేత తస్య ధ్యానాంతస్థస్యైకా కన్యా దశేంద్రియాణి" ఇత్యాదులందు పరబ్రహ్మసంకల్పముచేతనే జగ

ద్వ్యాపారము వినబడుచున్నది అచ్చటచ్చట ప్రకరణమందు ముక్తునికి సన్నిధి చెప్పలేదు అందుచే జగన్నియమనరూపమైన భారములేదు "సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా", "స ఏకో బ్రహ్మణ ఆనందః శ్రోత్రియస్య చాకామహతస్య" అని అనవధికాతిశయా నందబ్రహ్మానుభవమే ముక్తునికి సామ్యము బ్రహ్మకైతే తనకి పరునికి అనుభవవిషయము అవిశేషముచే అనవధికాతిశయానందముగా ఉంటుం దని ఆనందస్వరూపమందు విశేషములేకపోవుటచేత

తాత్పర్యము - ముక్తునికి భోగము బ్రహ్మానుభవమా లేక జగత్సృష్టి మొదలుగాగల విలాసమాయని శంకించి శ్రుతులయందు పరబ్రహ్మకే జగ ద్వ్యాపారము వినబడుచున్నది ముక్తునికి సాన్నిధ్యము వినబడదు అందుచే జగన్నియమనరూపమైన భారరహితముగా ముక్తుడు భోగ మాత్రము అనుభవించును

## 541 ప్రత్యక్షోపదేశాదితి చేన్న ఆధికారికమణ్డలస్థోక్తేః (4-4-18)

అర్థము - ప్రత్యక్ష - శ్రుతిచే, ఉపదేశాత్ - ఉపదేశమువలన, సోఽపి - జగ ద్వ్యాపారవర్తము ముక్తునికి కలదు, ఇతి చేన్న - అని అనకూడదు, ఆధికా రికమండల - బ్రహ్మచే ఆయా అధికారములందు నియమింపబడిన వారి సమూహములో, స్థ - ఉండుటను, ఉక్తేః - చెప్పుటవలన ప్రత్యక్షం - శ్రుతి "తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి", "ఇమాల్లోకాన్కామాన్నీకామ్య రూపమనుసంచరన్" ఇత్యాదిశ్రుతులందు ముక్తునికి జగద్వ్యాపార ఉపదేశ ముండుటవలన అది కలదని చెప్పినట్లైతే అట్లు చెప్పరాదు (ఆధికారికమ ణ్డలస్థోక్తే) అధికారికులనగా పరమపురుషునిచేత లోకనియమన రూప మైన అధికారమందు నియోగింపబడిన హిరణ్యగర్భాదులు మండలం అనగా వారిలోకములు అచ్చటనుండు భోగములందు ముక్తునికి ఇచ్ఛ కలదే అచ్చట యథాకామముగా పరమపురుషానుగ్రహముగా వర్తించుచు అచ్చటనుండు భోగములను అనుభవించుచుండునని శ్రుతిచే చెప్పబడి

నది "కామచారో భవతి" అనిగదా వినబడుచున్నది నియోగింపబడినవాడు కాదు ఉత్పత్త్యాదివికారములుగల హేయమిశ్రాద్యల్పములగు భోగములు ఎట్లు ముక్తునికి భోగమౌచున్నది, యథేచ్ఛగా సమస్తలోకములందు కామ చారము చెప్పబడుచున్నదంటే చెప్పుచున్నారు

**542 వికారావర్తి చ తథా హి స్థితిమాహ (4-4-19)**

అర్థము - వికారావర్తి - ఉత్పత్త్యాదివికారావర్తిలోకములకు, స్థితి - ముక్తభోగ్యత్వము ఉండును, తథా - ఆవిధముగా, ఆహ - చెప్పుచున్నదిగదా చ శబ్దము అవధారణార్థకము ఉత్పత్తిమొదలైన వికారములందుండెడువాడు కాడుగనుక వికారావర్తియనగా పరబ్రహ్మమే నిర్ధూతనిఖిలవికారమై నిఖిలయహేయప్రత్యనీకకల్యాణైకతానమై, నిరతిశయానందమైన పరబ్రహ్మ సవిభూతికసకల కల్యాణగుణములతో ముక్తునికి భోగ్యము అతని విభూత్యంతర్గతమౌటచే వికారావర్తియైన లోకములకు ముక్తభోగ్యత్వముగలదు అదే ప్రకారం పరబ్రహ్మయందు ముక్తునికి అనుభవితృత్వమైన స్థితిని శ్రుతిచెప్పినది "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతేఽథ సోఽభయం గతో భవతి", "రసో వై స రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" బ్రహ్మనిష్ఠుడు బ్రహ్మనుపొంది ఆనందించుచున్నారని అర్థము బ్రహ్మ నిరతిశయానందస్వరూపుడు నిరతిశయకల్యాణానంతగుణకుడు అనంతమహావిభూతికలవాడు అచ్యుత సవిభూతికబ్రహ్మనుభవము విభూతి ఏకదేశములైన లోకములందు సంచరించెడి ముక్తునికి అచ్యుతచ్యుత కామచారము కలుగుచున్నదని చెప్పబడుచున్నది

తాత్పర్యము - ఉత్పత్త్యాదులందు వర్తించువాడు పరబ్రహ్మమే వాని విభూత్యంతర్గతమైన లోకాలకు ముక్తభోగ్యత్వము చెప్పబడుచున్నది

543 దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే(4-4-20)

అర్థము - ఏవం - ఈ ప్రకారం, ప్రత్యక్షానుమానే - శ్రుతిస్మృతులు, దర్శయతి - చెప్పుచున్నది ఈ ముక్తుడైన నియామ్యభూతప్రత్యగాత్మకు నియంతృభూతపరమపురుషాసాధారణమగు జగద్వ్యాపారరూపనియమనం సంభవించదని చెప్పబడినది నిఖిలజగన్నియమనరూపమైన వ్యాపారము శ్రుతిస్మృతులందు పరమపురుషాసాధారణమని తెలియుచున్నది "భీషాస్మాద్వాత పవతే భీషోదేతి సూర్య। భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ", "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠత" ఇత్యాదులు అట్లే "ఏష సర్వేశ్వర ఏతభూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ" అను శ్రుతులు స్మృతులున్ను "మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్ । హేతునానేన కౌన్తేయ జగద్ధి పరివర్తతే।", "విష్టభ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్" అని ఆవిధముగా ముక్తునికి సత్యసంకల్పత్వాది పూర్వకముగాకలిగే ఆనందమునకు పరమపురుషుడే హేతువని శ్రుతిస్మృతులు చూపించుచున్నవని "ఏష హ్యేవానందయాతి, "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే। స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే। బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్య చ। శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ।।" అని ఎప్పుడు ప్రత్యగాత్మకు అపహతపాప్మత్వాదులు సత్యసంకల్పపర్యంతమైన గుణములు స్వాభావికముగా ఆవిర్భవించుచున్నవో అప్పుడు జీవునికి తథావిధత్వము పరమపురుషాయత్తము వానియొక్క నిత్యస్థితిన్ని తదాయత్తము పరమపురుషుని సత్యసంకల్పమువల్లనే నిత్యముగాను నిశ్శేషముగాను ముక్తునికి స్వరూపరూపగుణాలు వర్తించుచున్నదనుటలో సందేహములేదు ఈ ప్రకారము పరమపురుష భోగోపకరణమునకు లీలోపకరణమునకు నిత్యముగాను శాస్త్రమువలన అవగతమైన పరమపురుషుని నిశ్శేషమువలననే ఆ రీతి ఉంటుందని శాస్త్రముచేత తెలియబడుచు

న్నది అందువల్ల ముక్తునికి సత్యసంకల్పత్వము ఉన్నది సామ్యమున్న జగద్వ్యాపారము లేదు

544 భోగమాత్రసామ్యలింగాచ్చ (4-4-21)

అర్థము - భోగమాత్ర - భోగమాత్రముచేత, సామ్యలింగాచ్చ - సామ్యము చెప్పెడి హేతువువలన "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విప శ్చితా" అని ముక్తునికి బ్రహ్మానుభవభోగమాత్రముచేత సంభవించిన బ్రహ్మసామ్యవచనమువలన జగద్వ్యాపారవర్జము లేదని నిశ్చయింపబడు చున్నది

అధికరణ సంగ్రహము - పరమసామ్యాపత్తి శ్రుతివలన జగదీశ్వరత్వం ముక్తునికిగలదని శంకించి అది ఉండుట జగత్కారణభూతబ్రహ్మమాత్ర మునకే అగుటవలన భోగమాత్రసామ్యమే ఉన్నదని నిర్ణయించబడినది పరబ్రహ్మకే నియంతృత్వముచెప్పినపక్షమందు స్వతంత్రుడౌటచేత ముక్తునికి పరబ్రహ్మ తిరిగి ఎప్పుడైనా పునరావృత్తి కలుగచేయునా అని శంకించి సమాధానం చెప్పుచున్నారు

545 అనావృత్తిశ్శబ్దాత్ అనావృత్తిశ్శబ్దాత్ (4-4-22)

అర్థము - శబ్దాత్ - శ్రుతివలన, అనావృత్తి - ముక్తునికి పునరావృత్తిలేదు రెండుమార్లుచెప్పుట శాస్త్రపరిసమాప్తిని తెల్పును ఏవిధముగానైతే నిఖిల హేయప్రత్యనీకమై, కల్యాణైకతానమై, జగజ్జన్మాదికారణమై, సమస్తవస్తువి లక్షణమై, అశ్రితవాత్సల్యైకజలధియై, సర్వజ్ఞసత్యసంకల్పమై, పరమకారు ణికమై, నిరస్తసమాభ్యధికసంభావనమై, పరబ్రహ్మాభిధానమైన పరమపురు షుడున్నాడని శ్రుతులచేత అవగతమౌచున్నది ఆ ప్రకారం ప్రతిదినమూ అనుష్ఠీయమానవర్ణాశ్రమధర్మానుగృహీతతదుపాసనరూపతత్సమారాధన ప్రీతుడై ఉపాసించువారియొక్క అనాదికాలప్రవృత్తానంతదుస్తరకర్మసంచ యరూపమైన అవిద్యాదులను నివర్తింపచేసి స్వయాథాత్మ్య- అనుభవరూ

నములగు అనవధికాతిశయానందమును ప్రాప్తింపచేసి పునరావృత్తిని కలుగచేయడనియు శ్రుతులచేతనే తెలియబడుచున్నది శ్రుతులున్ను "స ఖల్వేవం వర్తయన్యావదాయుషం బ్రహ్మలోకమభిసంపద్యతే న చ పునరావర్తతే" ఇత్యాదులు ఆ ప్రకారము భగవానులు స్వయంగా సాయించినారు "మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్। నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతా ॥ ఆ బ్రహ్మభువనాల్లోకా పునరావర్తినోఽర్జున । మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" అని విచ్ఛిన్నకర్మసంబంధముగలవానికి, అసంకుచితజ్ఞానము గలవానికి పరబ్రహ్మానుభవైకస్వభావునికి తదేక ప్రియునికి అనవధికాతిశయ ఆనందమైన బ్రహ్మానుభవునికి అన్యాపేక్షయు దాని అర్థారంభములు సంభవించవసందున పునరావృత్తిశంకలేదు సత్యసంకల్పుడైన పరమపురుషుడు మిక్కిలి ప్రియుడైన జ్ఞానినిపొంది ఎప్పటికైనను పునరావృత్తికలుగచేయడు ఈ ప్రకారము గీతయందు చెప్పెను "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియ । ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్॥ ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ । బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే। వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభ ॥" అని

**అధికరణ సంగ్రహము** - చరమసూత్రము అధికరణాంతరమైన పక్షము సత్యమాధికరణమైన దానియందును స్వతంత్రుడైన ఈశ్వరుడు కదాచిత్పునరావృత్తిని సహా చేయ గూడునని శంకించి అనావృత్తిశ్రుతిసిద్ధమాటచేత సత్యసంకల్పవిరుద్ధముగా పునరావృత్తిని చేయుడు కనుక పునరావృత్తిరాదని నిర్ణయించబడినది సూత్రావృత్తి శాస్త్రముయొక్క సమాప్తిని తెలియచేయుచున్నదని సమస్తము సమంజసమైనది

**చతుర్థాధ్యాయమున చతుర్థపాదమును ముగిసెను**

చతుర్థాధ్యాయము ముగిసెను

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు ।